పురాణగ్రంథమాలిక ౧౧.

# శివపురాణము

( ఆఱవ సంపుటము. )



సంపాదకుఁడు.

నడకుదుటి వీరరాజు పంతులు.

# రాజపోషకులు.



మహారాజరాజశ్రీ

సి. జనార్ధన్ రావు గారు

హిమాయత్ నగర్

హైదరాబాదు 2

# శివపురాణము

(ఆఱవ సంపుటము.)

మూర్తిత్రయ ప్రణీతము.



నడకుదుటి వీరరాజు పంతులు
సంపాదకుఁడు.

# విషయసూచిక



---

శ్రీరామచంద్ర.

# శివపురాణము

## ధర్మఖండము.

ఎవనివదనపద్మ ♦ మెలమిమ్రోఁగ్రోలి వా
ఙ్మయసుధారసంబు ♦ జగతినించె
నట్టివ్యాసమూర్తి ♦ యైన సత్యవతీకు
మారచంద్రమునకు ♦ మంగళంబు.

---

సాత్వికుండయ్యు రా ♦ జసవృత్తి నెవ్వాఁడు
సకలలోకంబుల ♦ సంసృజించుఁ
త్రిగుణమాయాబలా ♦ తీతుఁడై యెవ్వాఁడు
జగతిఁదామసవృత్తి ♦ సంహరించు
అతిరిక్తరూపగు ♦ ణాఖ్యుఁడై యెవ్వాఁడు
బ్రహ్మాదిసంజ్ఞలఁ ♦ బరిణమించు
వేదవేదాంగాద్య ♦ వేద్యుఁడై యెవ్వాఁడు
పరమానుభవసిద్ధిఁ ♦ బ్రస్ఫురించు
నట్టిసత్యస్వరూపు, ని ♦ త్యప్రకాశు
నమలు నానందమూర్తి ♦ ననాదిపురుషు,
నభవుఁ, బరిపూర్ణు, శివు, నిగ ♦ మాంతనిలయు,
హరు, ననంతుని ధ్యానింతు ♦ మనవరతము.

## — శ్రీకృష్ణతపశ్చరణము —

సూతుం డిట్లు చెప్పందొడంగెను. మునులారా! ఒకప్పుడు దేవకీనందనుం డగుకృష్ణుం డేయుపాయంబుచేనైనం బుత్త్రలాభంబు నందఁగోరి యాలోచించుచుండఁగా నాకస్మికముగ నుపమన్యుం డనుమహర్షి యాతనిచెంత కరుదెంచెను. కృష్ణదేవుం డమ్మునికులతిలకుని విధివిధానంబునఁ బూజించి సుఖాసీనుం గావించి “నీవు ప్రతిదినము నేదేవతనైన నారాధింతువా” అని ప్రశ్నించెను. మునివరుం డాప్రశ్నకుఁ బరమానందభరితుండై యిట్లు చెప్ప నారంభించెను.

వాసుదేవా! పూర్వము నేను మహాదేవుని సందర్శింపఁగోరి బహుకాలంబు తపంబు చేసితిని. అదృష్టవశంబున నాకాతనిదివ్యదర్శనము లభించినది. అమ్మహాదేవునిపార్శ్వమున భక్తపాలన శత్రునాశనప్రశస్తంబగు త్రిశూలమును దర్శించితిని. అదిసకలాయుధముల కంటెను శ్రేష్ఠమైనది. ఏకదండంబును, మహాదంష్ట్రంబును, జ్వాలాముఖంబు నగు నయ్యస్త్రము ద్విసహస్రమయూఖంబులచేఁ దేజోమయమై విరాజిల్లుచుండును. కల్పాంతమునం దదియే విశ్వసంహారణంబు గావించుచుండును. జనార్దనుం డొక్కఁడు దక్క దానిచే వధ్యుండు గానివాఁ డెవ్వఁడును లేఁడు. అతిగుహ్యంబగుదానితో సమానంబును, దానికంటె నధికంబును నగునస్త్రం బేదియును లేదు. అదిసకలభూమండలమును భేదింపఁగలదు. సప్తసాగరములను శోషింపఁజేయఁగలదు. పూర్వము త్రైలోక్యవిజయుండును మహాతేజుఁడును చక్రవర్తియు నగుమాంధాత ససైన్యముగా నయ్యస్త్రరాజముచేతనే నిహతుం డయ్యెను. లవణాసురుం డొకప్పు డమ్మహాయుధమును గ్రహించుకొని బలదర్పితుఁడై శత్రుఘ్నుని యుద్ధమున కాహ్వానించి

యాంతనిచే నిహతుండయ్యెను. అప్పుడు మూల నది రుద్రహస్తముఁ జేరుకొనియెను.

మఱియుఁ దీర్ఘాగ్రంబును, అతిభయంకరంబును, త్రిశిఖంబును, నిర్ధూమజ్వాలాభీలంబును, బాలసూర్యప్రభావిభాసితంబును, సర్పహస్తంబును, అప్రతిమప్రభావంబును, నిశితధారాకలితంబును, సర్వాలంకృతంబును, ప్రళయకాలానలసన్నిభంబును పురుషాకృతియు నగుపరశువుకూడ నద్దేవునిసన్నిధినే యుండెను. అది యొకప్పుడు క్షత్రియనాశకుం డగుపరశురామునకుఁ బ్రసాదింపఁబడియెను. పితృవధను గుపితుండగు భార్గవుండు శివదత్తంబగు పరశువుచే నిరువదియొక్కపర్యాయము భూమండలమును నిక్షత్రియముగఁ జేసినై చెను. ఆపరశువుకంటెను యతిలోకప్రభావసంకలితంబగు సుదర్శనమునుకూడ నేనద్దేవుని చెంగటఁ గనుఁగొంటిని. అది సహస్రవదనంబును, ద్విసహస్రభుజంబును, సహస్రచరణంబును, ద్విసహస్రనేత్రంబును నై భాసిల్లుచుండును. మఱియు వజ్రము, శక్తి, తోమరము, ఖడ్గము, పాశము, దండము, అంకుశము గద మొదలుగాఁగల దిక్పాలకుల యాయుధములన్నియు నాదేవదేవునిపార్శ్వమున విరాజిల్లుచుండెను.

పితామహుండగు బ్రహ్మ మనోవేగంబును, హంసయుతంబు నగుదివ్యవిమానము నధిరోహించి యాదేవుని వామభాగంబున నిలిచి యుండెను. శంఖచక్రగదాధరుం డగునారాయణుండును గరుడారూఢుండై యాపక్కనే వసించి యుండెను. ఘంటాకరుండగు కుమారుండు శక్తిపాణియై మయూరము నధిరోహించి రెండవయగ్నిదేవునిం బోలి దేవపార్శ్వంబున వెలుంగుచుండెను. ఆమహాదేవుని కెదురుగ శూలపాణి యగునందీశ్వరుఁడు నిలిచియుండెను. సకలభూతగణంబులును, వివిధమాతృగణంబులును నద్దేవుని సమ్ముఖంబున నిలిచి

యుండెను. ఆసమయంబున సకలదేవతలును నలుగెలంకుల నిలిచి యీదేవు ననేకవిధంబులఁ గీర్తించుచుండిరి. ఈజగంబునఁ జూచినవియు, వినినవియు నగుసకలపదార్థములు నయ్యీశ్వరుని చెంతఁ గనంబడుటయు నేనత్యంతమును విస్మితుండ నై పోయితిని. అయినను నేన ప్పుడు ధైర్యము నవలంబించి బద్ధాంజలినై బాష్పగద్గదస్వరంబున ననేకవిధంబుల నద్దేవుని స్తుతించుచు నతిశ్రద్ధతో నారాధించుచుంటిని.

అప్పుడు భగవానుండగు శంకరుండు ప్రసన్నుండై "వత్సా! నిన్నుఁ బరీక్షించుటకై మాటిమాటికిని నీకు భయప్రదర్శనముం గావించితిని. అయినను నిన్ను జలింపఁజేయఁజాలకపోయితిని. ఇంకఁ బరీక్షతోఁ బ్రయోజనము లేదు. నీవేయథార్థభక్తుఁడవు. కావున దేవతలకైనను దుర్లభంబగువరంబునుగోరుకొనుము" అని యానతిచ్చుటయు, నేనానందభరితుండనై "శంకరా! నీవు నాయెడల నిజముగ సంతుష్టుండ వైతివేని నాయందు నీకు దయగలదేని నాకుఁద్రికాలజ్ఞానంబును నీయందపారభక్తిని బ్రసాదింపుము. మఱియు నవిచ్ఛిన్నంబగునావంశము నిత్యక్షీరోదనలాభముం గాంచుఁగాక. దేవదేవా! నాయాశ్రమంబున నీదివ్యసాన్నిధ్యము నిరంతరవిరాజమానంబగుఁగాక" అని ప్రార్థించితిని.

సర్వకామప్రదుం డగుశంకరుండు నాకోరికలను మన్నించి "భక్తాగ్రేసరా! నీవింతటినుండి జరామరణరహితుండవై, మునిమాననీయుండవై యశస్వి వయ్యెదవు. మఱియు నాప్రసాదంబుచే సద్వృత్తుండవును, కృపామయుండవు, గుణవంతుఁడవు, నైశ్వర్యవంతుఁడవు నయ్యెదవు. క్షీరసాగరము నీకు నిత్యసన్నిహితం బగుఁగాక! బంధుసహితంబుగ నీవీవైవస్వతకల్పంబంతయును జూచెదవుగాక! నీయన్వయం బక్షయంబు గాఁగలదు. నేను నిత్యమును నీయాశ్రి

మంబున సాక్షాత్కరించుచుండెదను. నీకు నాయెడలంగలభక్తి యె న్నండును జలింపక యుండును. నీవు స్వచ్ఛందసంచారివై విహరింపుము" అని యనుగ్రహించి కోటిసూర్యప్రభామయుండగు భగవానుం డంతర్హితుండయ్యెను.

శ్రీకృష్ణా! తపోబలంబున నద్దేవదేవుండు ప్రసాదించినవరంబులన్నియును నాకు లభించినవి. అంతకుఁబూర్వము నేనెన్నఁడును దేవగంధర్వాదులను జూచియుండలేదు. ఆక్షణమునందే నాకట్టివారిని దర్శించు శక్తి లభించినది. ఆనిమిషమందే నాయాశ్రమం బంతయు దివ్యవస్తుసమృద్ధం బైనది. దేవర్షిసమాగమంబుచే నిత్యమును నాయాశ్రమశోభ వర్ధిల్లుచుండెను. మహాదేవప్రసాదముచే నాయాశ్రమోప వనంబు లన్నియుఁ బుష్పఫలవిరాజితంబులై యతిలోకరమణీయంబు లయ్యెను. సకలైశ్వర్యములును, దివ్యశస్త్రములును నాకు లభించెను.

ఈవిధముగా నీశ్వరానుగ్రహముచే నేను దివ్యజ్ఞానవంతుఁడనై భూతభవిష్యద్వర్తమానవిషయంబులఁ దెలియఁగలుగుచుంటిని. ఆరాధనచేఁగాని లభింపని యాదేవుని దివ్యసందర్శనము నాకనాయాసముగ లభించినది. ఈజగంబున నాకంటె ధన్యుం డెవ్వఁడున్నాఁడు? షడ్వింశకతత్త్వఖ్యాతుండును, పరతత్త్వస్వరూపుఁడును, సనాతనుండును, పరముండును, అక్షరుండును, విబుధశ్రేయుండును, సర్వతత్త్వవిధిజ్ఞుండును, తత్త్వార్థదర్శనుండును, భగవానుండును, ప్రధానపురుషుండును, దేవుండు నగునీశ్వరుండు తనదక్షిణపార్శ్వమునుండి లోకకారణుండగు బ్రహ్మను, వామభాగమునుండి లోకరక్షకుండగు విష్ణుదేవుని, శరీరమునుండి లయకారకుండగురుద్రుని సృజించెను. ఆదేవుఁడు యుగావసానంబునఁ గాలరూపియై సకలజీవులను సంవర్తకానలముంబోలి సంహరించును. సర్వగుండును, సర్వభూతాత్ముండును, సర్వకారణుండును

నగునమ్మహాదేవుఁడు దేవతలకుఁగూడ నదృశ్యుఁడు.

కావున నోవాసుదేవా! పుత్త్రలాభార్థమై నీవాతని నారాధింపుము. ఆదేవు నారాధించి యభీష్టసిద్ధిం గాంచినభక్తులంగూర్చి వర్ణించెద నాకర్ణింపుము. పూర్వము హిరణ్యకశిపుం డయుతవర్షంబులు తపంబు చేసి యాచంద్రశేఖరానుగ్రహంబున దేవతాధిపత్యలాభముం గాంచఁగలిగెను. అతనికుమారుండగు నందనుండను రాక్షసుఁడు శంకరవరగర్వితుండై యయుతవత్సరంబు లింద్రునితో మహారణంబు గావించెను. మహేంద్రవజ్రమును, విష్ణుచక్రమునుగూడ నాతనియెడ నిష్ప్రయోజనములై పోయినవి. మహాదేవునివరముచే నాతనికి శస్త్రబాధలేకుండెను. గ్రహపరుండను నామాంతరము గలయానందనాసురుఁడు దేవతలవలననే బలవంతముగా వరములనంది వారినేపీడింపఁదొడంగెను. మఱియు విద్యుత్ప్రభుండను నసురునితపంబునకు మెచ్చి శంకరుం డాతనికి త్రైలోక్యాధిపత్యము నొసంగెను. ఆతఁడు శతసహస్రవర్షంబులు సకలలోకంబులను బాలించి యీశ్వరానుగ్రహముచే నసంఖ్యసంతానముం గాంచెను. బ్రహ్మదేవుం డాతనికి కుశద్వీపమును బ్రసాదించెను. పూర్వకాలము శతముఖుం డనుదైత్యుం డయుతవర్షంబులు తపంబు చేసి యద్దేవుని యనుగ్రహముచేఁ బురాణలాభముం గాంచెను. యాజ్ఞవల్క్యుం డమ్మహాదేవు నారాధించి విజ్ఞానలాభముం గాంచెను. ఇంద్రపరాభూతు లగు వాలఖిల్యులు శంకరు నారాధించి సోమహర్తయు, దుర్జయుండు నగుగరుడుని సాహాయ్యముం గాంచిరి. అనసూయ త్రిశతవత్సరంబులు శివు నారాధించి దత్తాత్రేయుఁడు, చంద్రుఁడు, దూర్వాసుఁడు నను మువ్వురుపుత్రులం గాంచెను. మధుసూదనా! ఆమహాదేవుని పవిత్రచరిత్రమును సంపూర్ణముగా నెవ్వరు చెప్పఁగలరు?

అని చెప్పుటయు శ్రీకృష్ణుఁడు విస్మితుఁడై యుపమన్యుం గాంచి « భూసురకులతిలకా! నీయాశ్రమమునం దట్టిమహాదేవుండు నిత్యసన్నిహితుం డై యున్నాఁడు. నీవు ధన్యుండవు. ఈజగంబున నీకంటెఁ బుణ్యపురుషుం డెవ్వఁడున్నాఁడు? మునీంద్రా! ఆమహాదేవుం డెన్నటికైన నాకు దర్శనమిచ్చి నన్ననుగ్రహించునా?" అని కుతూహలపడుటయు నుపమన్యుండు « జనార్దనా! నీవచిరకాలంబు ననే కృపామయుం డగుమహాదేవుని దర్శింపఁగలవు. పత్నీసహితుం డవై యద్దేవునివలనఁ జతుర్వింశతివరంబులను బడయఁగలవు. ఆతఁడు నీ కేల వరమీయకుండును? నీవుసాక్షాద్విష్ణుదేవుఁడవు. సర్వదేవపూజ్యుండవు. సనాతనుఁడవు. అచ్యుతా! నీకు నేను మంత్రోపదేశముం గావించెదను. శ్రద్ధతో నీవామంత్రమును జపించుచు శంకరు నారాధింపుము. ఆదేవునియనుగ్రహంబున నీకు నీవంటిపరాక్రమశాలియగు పుత్త్రుం డుదయింపఁగలఁడు. నీవు సంతానార్థివై యుంటివని నేనెఱుంగుదును." అని వచించెను.

వారీవిధముగా నీశ్వరవిషయంబున మాటాడుకొనుచుండఁగా నెనిమిదిదినంబులు ముహూర్తమాత్రముగాఁ గడచిపోయెను. నవమదినంబునఁ గృష్ణుం డమ్మునియనుగ్రహంబుచే శైవమంత్రదీక్షితుండై నియమావలంబనంబునఁ దపంబు చేయ నారంభించెను. కొంతకాలమున కాతనిశిరోజములు జడలుగట్టెను. నఖరోమాదులు ప్రవర్ధమానంబులై మునిరూపంబు వోఁ చెను. కృష్ణుండట్లు మాసంబువరకు నిరాహారియై ద్వితీయమాసంబున జలపానమాత్రంబు చేసి మూఁడవ మాసంబున వాయుభక్షణంబుచేయుచు సమాధిలాభముంగాంచి యంగుష్ఠమాత్రస్థితుండును, నూర్ధ్వబాహుండునై కఠోరతపంబు చేయుచుండెను. ఇట్లు పదియాఱుమాసంబులు గడచుటయు వర్షాకాలంబున భగ

వానుం డగుశంకరుండు సంతుష్టుండై వాసుదేవుని మెదుట సాక్షాత్క రించెను.

బ్రహ్మాదిసకలదేవతాపూజ్యుండును, సిద్ధకోటివంద్యుండును, దివ్యమాల్యాంబరధారియు, పార్వతీసహితుండు నగుశంకరుం డట్లు దర్శనం బిచ్చుటయు కమలలోచనుండు విస్మితుండును, బద్ధాంజలిపు టుండునై యనేకవిధముల స్తోత్రముం గావించెను. మఱియు సహస్ర నామంబులతో నాతనిస్తుతింప నారంభించెను. అనంతరము దేవగంధ ర్వాదులవ్వాసుదేవునియుత్తమాంగంబునఁ బుష్పవర్షముం గురియిం చిరి. అప్పుడు భక్తవత్సలుండగు శంకరుండు పార్వతివంకఁ గటా క్షంబుఁ బరగించి కేశవు నుద్దేశించి " కృష్ణా ! నేను నీయెడలసంతుష్టుం డనైతిని. నీవు మహేంద్రునికంటెను బరమభక్తుఁడవు. నీవిప్పుడెనిమి దివరంబులను గోరుకొనుము.

అని యానతిచ్చుటయు గోవిందుండు చేతులు దోయిలించి " మహాదేవా ! ధర్మబుద్ధియు, యశోవృద్ధియు, బలసమృద్ధియు, నీయందు నిశ్చలభక్తియు, నీనిత్యసాన్నిధ్యంబును, సంగ్రామంబున సర్వశత్రువిజయంబును, పరమయోగిప్రియత్వంబును నాకుఁబ్రసా దింపుము. నాకులభించుసంతానమునందు మొదటిపదుగురును బుత్రు లగునట్లనుగ్రహింపుము " అని వేడుకొనియెను.

మహాదేవుండును బ్రసన్నుండై నీసర్వాభీష్టంబులును సిద్ధించు నని యనుగ్రహించి " శ్రీకృష్ణా! మునిశాపతప్తుండై మానవజన్మంబు నొందవలసిన సంవర్తకుం డనునాదిత్యుండు సాంబుండనుపేర నీపు త్రుండై జనింపఁగలఁడు." అని వచించుటయుఁ గృష్ణుండానందపరవ శుండై శివానుచరులను, బార్వతీదేవినిబహువిధంబుల స్తోత్రము చేయఁదొడంగెను. అప్పుడు భవానియు కేశవునియెడల సంతుష్టయై వర

ప్రార్థనంబు గావింపు మని యానతిచ్చెను. అప్పుడు నుపమన్యుండు « దేవీ! దేవదేవునింబోలి నీకును నాయందు దయగలదేని నాయెడల నిట్లనుగ్రహింపుము. నాకెన్నఁడును బ్రహ్మద్వేషంబు లేకుండుఁగాక! బ్రాహ్మణపూజనమే నానిత్యవ్రతంబగుఁగాక! తల్లిదండ్రులు నాయెడల నిత్యసంతుష్టు లగుదురుగాక! నాకెల్లయెడల సర్వభూతానుకూల్యంబు లభించుఁగాక! నాసంతానము గుణవంతం బగుఁగాక! నాచేయుమఖశతంబులచే దేవతలు తృప్తు లగుదురుగాక! యతిసహస్రంబులును, అతిథిసహస్రంబులును నిత్యము నామందిరంబున భోజనాదికంబులచే సంతుష్టు లగుదురుగాక! నాబంధుమిత్రులు నావలనఁ బ్రీతిసుఖంబులం గాంతురుగాక! నేను సతీసహస్రవల్లభుండ నయ్యెదఁగాక! నేను సకలజీవులకు నన్నంబుకంటెను బ్రియతముఁడ నయ్యెదఁగాక! » అని వేడుకొనియెను.

దేవి యానందనందనుని వచనంబులకు విస్మితయై నీయభీష్టంబులన్నియు సిద్ధించుఁగాక యని యానతిచ్చెను. పార్వతీపరమేశ్వరు లీవిధముగా శ్రీకృష్ణునకు వరప్రదానంబు గావించియంతర్హితులైరి. అనంతరము కృష్ణుండు పరమానందముతో నిజాశ్రమంబునకుం జని యుపమన్యునకుఁ బ్రణామంబాచరించి యెల్లవృత్తాంతము నాతనికి నివేదించెను. ఉపమన్యుండును సంతోషించి « గోవిందా! శంకరునికంటె భక్తాభీష్టదాయకుం డగుప్రభుం డెవ్వఁడును లేఁడు. జ్ఞానంబును, దపంబును, శౌర్యంబును, స్థైర్యంబును నాతఁడే. అలోకసామాన్యంబగు నాతనిపుణ్యచరిత్రము నాకర్ణింపుము. అందువలన నీభక్తి మఱియును వర్ధిల్లఁగలదు.

పూర్వకాలంబున బ్రహ్మయోగి యగు తండియనుమహాత్ముఁడు సహస్రనామంబులచే సదాశివస్తవముం గావించెను. విస్తీర్ణంబును,

దుర్జ్ఞేయంబు నగునాస్తోత్రమును సాంఖ్యయోగులు పఠించుచుందురు. ఇట్లాతండిచే నారాధితుండైనశివుం డాతనికి సర్వాభీష్టంబులను బ్రసాదించెను. నీవును నట్లే సిద్ధకాముఁడవయ్యెదవు. అని ప్రబోధించుటయు నమ్మునిచే ననుజ్ఞాతుండై శ్రీకృష్ణుండు మరల ద్వారకానగరంబునకు విచ్చేసెను.

## —♦ శివానుగ్రహము ♦—

మునివరులారా! పూర్వమత్రిమునీంద్రుండు గోకర్ణక్షేత్రంబున శతవత్సరంబులు ఘోరతపంబు చేసి శంకరానుగ్రహంబున శతపుత్రులను, శాశ్వతకీర్తిని బడయఁగలిగెను. ఆతనికుమారు లందఱును జరామరణవర్జితులైరి. ఆతఁడొకకారణముచే బ్రహ్మహత్యాపాపమునకు లోనయ్యెను. మునులందఱు నాతని బహిష్కరించిరి. భక్తసులభుండగు మహాదేవుం డప్పు డాతనియెడఁ గరుణించి పాపవిముక్తునిం గావించెను. మఱియు మున్ను భార్గవరాముండు తపంబుచే నమ్మహేశ్వరు నారాధించి తత్ప్రసాదంబున నతినిశితంబగు పరశువును బడసెను. దానిచేతనే యాతఁ డిరువదియొక్కమారు క్షత్రియసంహారంబు గావించెను. పిమ్మట నాతఁడు మహేంద్రపర్వతంబునకుం బోయి తపోనిరతుండై యచిరకాలంబుననే యజేయుఁడు నమరుండు నయ్యెను. ఆతఁడు మహేంద్రపర్వతమున లింగార్చనము చేయుచుండఁగా దేవత లెన్నియోసారులు దర్శించి యున్నారు. ఆతఁడు సాక్షాద్విష్ణుండు గావునఁ బ్రళయకాలంబున మరల వైకుంఠమునకుఁ బోఁగలఁడు. పూర్వకాలంబున నసితానుజుం డగుదేవలుండు మోహాగ్రహావిష్టుండై లోకక్షోభంబుకొఱకు తపంబు సేయుచుండ నింద్రుండు కోపించి యతని శపించెను. అయినను దేవలుండు శివారాధనమును విడువక తదనుగ్ర

హంబున దీర్ఘాయుర్యశోధర్మంబులం గాంచెను. తొల్లి సామగానపరి
షత్తునందు కృత్స్నమదుండను మునీంద్రుండు పొరపాటున యజ్ఞాసంగ
తంబగు రథంతరపాఠముం గావించెను. అందుచే వసిష్ఠుండు కోపించి
దండకారణ్యంబునఁ బందొమ్మిదివేలవత్సరములు మృగరూపివై ప్రజ్ఞా
రాహిత్యంబున దుఃఖించుచుండు మని యాతని శపించెను. తోడనే
యమ్మునీంద్రుండు తృణలతాజలవిహీనంబగు నయ్యరణ్యమున మృగ
రూపంబునఁ బుట్టెను. అయినను నతఁడు పూర్వవాసనావశంబున
భక్తితోఁ బ్రణవయుక్తంబుగా శివనామమును స్మరింప నారంభించెను.
ఆప్రభావముచే శివుండు ప్రసన్నుండై యాతని గణాంతర్గతుని గావిం
చెను. కాని శాపాంతకాలమువఱకు నాతనిముఖముమాత్రము మృగా
కృతిం దాల్చియుండెను. శాపావసానంబున మహాదేవుం డాతని కజ
రామరత్వమును, భోగభాగ్యాభివృద్ధియు, గణసహచరత్వమును బ్రసా
దించెను. జైగీషవ్యుఁడను మహాతపుం డగునొకఋషీంద్రుండు కాశీ
ధామంబున నిత్యలింగార్చనంబు సేయుచు శుభాశుభకర్మఫలంబుల
వాంఛింపక సర్వంబును శివార్పణంబు సేయుచుండెను. మహాదేవుం
డాతనియెడ దయాళుండై యణిమాద్యష్టసిద్ధుల నాతనికిఁ బ్రసాదిం
చెను. అట్టిశర్వుండు భక్తుం డగుగార్గ్యునకు ముక్తిసాధనం బగుకాల
జ్ఞానమును బ్రసాదించెను. శివప్రసాదముచే నమ్మునీంద్రుండు సర్వశా
స్త్రపారంగతుం డయ్యెను. అతని కాత్మసమానులగు వేయిమందిపు
త్రులు లభించిరి. అట్లే శంకరుండు పరాశరునకు నిర్జరత్వంబును, అను
రక్తియును, గలవ్యాసమునీంద్రుని బుత్రునిగా ననుగ్రహించెను. భక్త
దయాళుం డగుభవానీనాథుండు తొల్లి శూలగ్రస్తుం డగుమాండవ్య
మునీంద్రునకుఁ బ్రాణదానంబు చేయుటయే కాక దశలక్షవత్సరంబుల
వఱకు నాధివ్యాధిశూన్యత్వముం బ్రసాదించెను.

పూర్వకాలంబునం దొకదరిద్రబ్రాహ్మణుఁడు "నమశ్శివాయ" యనుమంత్రమును నిత్యమును ధ్యానించుచు గాలవుండను తనకుమారుని విద్యాభ్యాసంబు చేయుటకై గురుగృహంబున నొప్పగించి తాను పత్నీసహితుండై గృహంబునం దుండెను. ఒకనాఁ డాతఁడు భార్యం బిలిచి "ఓసీ! గృహస్థుల మగుమనయింటికెవ్వరైన నతిథులు భిక్షార్థమై రాఁగలరు. దరిద్రులమగుమనము వారికేమీయఁగలము. లేదని చెప్పుటకు నోరెట్లు వచ్చును. నేను లోపలనే యుండెదను. భిక్షుకుఁ డెవ్వఁడైన వచ్చినప్పుడు నాభర్త యింట లేఁడని చెప్పుము" అని యుపదేశించెను. కాలవశంబున నొకప్పు డొకభిక్షుకుఁ డావిప్రునింటికి వచ్చి గృహిణిం గాంచి నీభర్త యెచ్చట నున్నాఁడని ప్రశ్నించెను. ఇంట లేఁడని యామె ప్రత్యుత్తర మిచ్చెను. భిక్షుకుం డావంచనమును దివ్యదృష్టిచే గ్రహించి కోపించి "నీభర్త యెచ్చట దాఁగి యుండెనో యచ్చటనే మరణించుఁగాక!" యని శపించి వెడలిపోయెను. అనంతరము గాలవుండు సకలవిద్యలనభ్యసించి గురుం డగువిశ్వామిత్రునిచే ననుజ్ఞాతుండై గృహంబునకు వచ్చి యెల్లసంగతులం దెలిసి విచారించి పితృలాభంబునకై శంకరారాధనంబు గావించుచుండెను. ఒకనాఁడు గాలవుండు గృహంబు వెడలి సమిత్కుశాహరణార్థంబు పోవుచుండఁగా తండ్రియాతనికి సాక్షాత్కరించి పరమానందముతోఁ గుమారునిఁ గౌఁగిలించుకొని "కుమారా! ఈశ్వరానుగ్రహంబున నేను పునర్జీవితుండనై పుత్రవంతుఁడను, ఐశ్వర్యవంతుఁడను నైతిని" అని పరమేశ్వరుని బ్రస్తుతింప నారంభించెను.

మహర్షులారా! పరమేశ్వరుని భక్తదయాళుత్వముం గూర్చి కొంతవఱకుమాత్రము చెప్పఁగలిగితిని. అనంతునివలె సహస్రముఖములు లభించినను నేను వేయివత్సరంబులకైన నద్దేవునిగుణంబులను సంక్షేప

ముగనైన వర్ణింపఁజాలను. అని యుత్సాహము పట్టఁజాలక సూతుండు వారికి మహాదేవుని త్రిపురదహనవృత్తాంతమును మరల సవిశేషముగ నెఱింగించుటయు మునులందఱును బ్రహృష్టహృదయులై యంధకచరిత్రముం దెలుపవలయు నని ప్రార్థించిరి.

## —♦ అంధకచరిత్రము ♦—

సూతుం డిట్లు చెప్పందొడంగెను. ఒకప్పుడు మందరాచలంబునఁ బార్వతీదేవి పరిహాసార్థమై వెనుకనుండి వచ్చి కనకకమలసదృశంబగుతనకరపల్లవద్వయముచే మహేశ్వరునికన్నులను మూసెను. ఆక్షణంబున గాఢాంధకారము జగమెల్ల నాక్రమించి లోకనేత్రనిరోధంబు గావించెను. ప్రియస్పర్శమువలన నప్పుడు గౌరీదేవి కరకమలములు చెమరించెను. అందొకస్వేదబిందువు శివుని నేత్రానలముచేఁ దపించి యాకరాననగర్భంబునఁ బతితం బయ్యెను. కొలదిసేపటిలో నాగర్భము నుండి విరూపియు, జటిలుండును, శ్మశ్రులుండును, కృష్ణవర్ణుండును, వికృతరోముండును, మేఘభీకరనినదుండును, క్రోధపరుండును, భయంకరుండును నగునొకపురుషుం డుదయించి నవ్వుచు నేడ్చుచు నృత్యము చేయుచుండెను.

అప్పుడు శివుండు నవ్వుచుఁ బార్వతినుద్దేశించి ‹‹ దేవీ ! నాకన్నులను విప్పుము. నన్నేల భయపెట్టెదవు ” అని హెచ్చరించెను. ఆవికృతపురుషదర్శనంబును, పతివాక్యశ్రవణంబును గాంచి యమ్మహాదేవి నవ్వుచు ప్రియనేత్రవిమోచనముం గావించెను. ఈశ్వరుఁడు కన్నులఁ దెఱచినంతనే యంధకారము దూరమైపోయెను. ఆవికారపురుషుఁ డంధకారమున జనించుటచే దృష్టివిహీనుం డయ్యెను. అంతఁ బార్వతిదేవి పరమేశ్వరుం గాంచి ‹‹నాథా! విరూపుఁడగుపీతఁ డెవ్వఁడు?

ఎవ్వఁ డెందుకొఱ కీతని బుట్టించెను? వీఁ డెవ్వరితనయుఁడు ?" అని ప్రశ్నించెను. శివుండు మందహాసము సేయుచు "ప్రియా ! నీవు నాకన్నులను మూసినప్పుడు స్వేదబిందువునుండి చండబలుండగు నీతఁడు జన్మించినాఁడు. అంధకారమున జనించుటచే నీతఁ డంధకనామధేయుఁ డయ్యెను. నేనీతని కనురూపైశ్వర్యప్రదానంబు చేయుదును. నీవును సదయహృదయవై సఖులతోఁగూడ నీతని నంద్యాదులవలె సంరక్షింపుము !" అని యానతిచ్చెను.

భవానియు పతివచనంబులకు సంతుష్టయై సఖులతోఁగూడ నయ్యంధకుని పుత్రునింబోలి యతిప్రియంబుగఁ బోషించుచుండెను. అయ్యంధకుం డుదయించినసమయమందే కశ్యపాత్మజుం డగుహిరణ్యాక్షుండు పుత్రార్థియై తపంబు సేయుట కారంభించి క్రమంబుగ రోషదోషవిముక్తుండై కాష్ఠాకృతినుండి శివధ్యాననిమగ్నుఁడయ్యెను. మహేశ్వరుం డయ్యసురేంద్రునితపంబునకు మెచ్చి యాతనికి దర్శనంబిచ్చి వరంబు గోరుకొమ్మని యనుగ్రహించెను. అప్పుడు హిరణ్యనేత్రుండు పరమానందభరితుండై "ఓచంద్రశేఖరా ! నాకుఁ గులానురూపవీర్యసంపన్నుం డగుపుత్రుఁడు లేఁడు. అందుకొఱకే నేనిట్టితపంబు చేయుచుంటిని. దేవా ! నాకట్టిపుత్రదానంబుచేసి కృతార్థుం గావింపుము. నాయగ్రజునకుఁ బరాక్రమనిధులగు ప్రహ్లాదాదు లైదుగురుతనయులున్నారు. నావిశాలరాజ్యభోగము లనుభవించుటకు నాకొక్కకొమరుండును లేఁడు. నేను వంశవిహీనుఁడనై యున్నాను. పరాక్రమంబుచే రాజ్యసంపాదనముచేయువాఁడును, పితృరాజ్యమును బరిపాలించువాఁడును ప్రధానపుత్రుఁడు. అట్టిపుత్రునివలనఁ దండ్రి యిహపరలోకములందు గణనీయుఁ డగును. కావుననే యెల్లవారును బుత్రార్థులై యజ్ఞయాగాదిసత్కర్మముల నాచరించుచుందురు. పుత్రహీనులకు గతులు

లేవు. అందుచే సందఱును ఆత్మసంగళార్థమై పుత్రకాము లగుచుం దురు. క్రీతాదులగు నితరపుత్రులకంటె నౌరసుఁడే ప్రధానుఁడు. దేవా! నేనట్టిపుత్రుని యాచించుచున్నాను. నాయందుఁ గరుణించి నాయభీష్టంబు సఫలంబు సేయుము.

అని వేఁడుటయు దయామయుం డగు నిందుమౌళి ‹‹ ఓ దైత్య రాజా! ఔరసపుత్రుఁడు లభించుయోగము నీకు లేదు. నీవంటిపరాక్రమవంతుఁడును, దుర్జయుండును నగు అంధకుం డనునాకుమారుని నీ కొసంగెదను. నిర్విచారముగ నీవాతని కుమారునిగాఁ బరిగ్రహింపుము; ఆతనివలన నీవు సుఖవంతుఁడ వయ్యెదవు.'' అని యానతిచ్చి హిరణ్యాక్షున కంధకుని బుత్త్రినిగా నొసంగెను. హిరణ్యాక్షుండు పరమానందముతో నంధకుని వెంటఁబెట్టుకొనిపోయి పెంచుకొనుచుఁ గొంతకాలమున కాతఁడు సకలదేవతలను జయించి యీభూమండలమును రసాతలంబునకుఁ గొనిపోయెను.

అప్పుడు మహాబలవంతుఁడును, సత్వమయుండు నగువిష్ణుదేవుండు సకలమునిదేవతారాధితుండై వరాహరూపముం దాల్చి దంష్ట్రాప్రహారంబులచే ధరిత్రిభేదనంబు చేసికొనుచు రసాతలంబునకుం బోయి దంష్ట్రాగ్రంబుచే దైత్యగణోన్మూలనంబుచేసి మఱియు నశనిసమపదాఘాతంబులచే నిఖిలాసురసంహారంబు గావించి సుదర్శనచక్రంబుచే హిరణ్యాక్షునిమస్తకచ్ఛేదనంబు చేసి యాదైత్యరాజ్యమున కంధకు నభిషిక్తుం గావించి రసాతలంబునుండి భూమండలము నెప్పటియట్లుద్ధరించెను.

అనంతరము హిరణ్యకశిపుండు దానవరాజ్యమును యథానియమంబుగఁ బరిపాలించుచుఁ గ్రమంబుగ మూఢబుద్ధియై సకలలోకంబులను సంతసింపఁజేయ నారంభించెను. ఆతఁడు బ్రహ్మదేవుని నారాధిం

చి ప్రసన్నుం జేసికొని «మహాత్మా! నేను నిత్యమృత్యుభయాకులుం డనై యున్నాను. స్వర్గమందుగాని, భూమియందుగాని, రాత్రిగాని, పగలుగాని, శస్త్రాస్త్రపాశాదులచేఁగాని, అశనిపాతంబుచేఁగాని, తరు పర్వతజలాగ్నులచేఁగాని, మఱియెట్టిశత్రుకర్మంబులచేఁగాని నాకు మృత్యువు లేకుండునట్లనుగ్రహింపుము." అని ప్రార్థించుటయు విరించి భయవిస్మితుండై మనంబున విష్ణుదేవునకుఁ బ్రణామంబు చేసి «దైత్యేంద్రా! నేను నీయెడల సంతుష్టుండనైతిని. నీయభీష్టంబు సఫలంబు చేయుదును. నీవు తొమ్మిదికోట్లతొంబదియాఱువర్షములు దానవరాజ్యంబుఁ బాలింతువుగాక!" అని యనుగ్రహించెను.

అసురేశ్వరుండును పూర్ణకాముండై కృతార్థుండనైతినని సంతోషించి త్రైలోక్యవినాశంబు గావింప నిశ్చయించి యాక్షణంబ పోయి సకలధర్మోచ్ఛేదంబు గావించుచు మహారణంబుచేసి సకలదేవతలను విజితులం గావించెను. అప్పు డింద్రాదిదేవత లసురభీతులై క్షీరసాగరంబుకడకుం బోయి యనేకవిధంబుల స్తోత్రంబు సేయుచు విష్ణుదేవు నారాధింపఁదొడంగిరి. వారిప్రార్థనంబుల కుపేంద్రుండు మేల్కాంచి యనేకవిధంబుల వారి నాశ్వాసించుచు «విబుధవరులారా! నేను సూర్యచంద్రాగ్నిసదృశం బగుసింహమూర్తిం దాల్చి సూర్యాస్తమయసమయంబున దనుజపురంబుఁ బ్రవేశించి తీక్ష్ణనఖంబులచేతను, భీషణదంష్ట్రలచేతను రాక్షసగణవినాశంబు చేసెదను" అని యానతిచ్చుచునే నారాయణుండు సింహావతారంబెత్తి దైత్యనగరంబు సొచ్చి కొంతకాలము దానవులతో రణంబుచేసి యసంఖ్యదైత్యనిర్మూలనంబు గావించెను. మఱియు ముఖ్యులగు నసురులను సంహరించుటకై యచ్చటనే పరిభ్రమించుచుండెను. రక్కసులందఱు నావిష్ణుదేవుని సేవల సింహమాత్రముగనే భావించిరి. కాని యందుఁ బ్రహ్లాదుండనువాఁడు

సత్త్వమును గ్రహించి తండ్రిని సమీపించి "అసురేంద్రా! ఇది కేవల సింహము గాదు. విష్ణుదేవుఁ డీరూపముతో దానవసంహారంబునకు వచ్చియున్నాఁడు. కావున నీతనితో రణంబు చేయుట శ్రేయము గాదు. భగవానుం డగునయ్యనంతునిశరణంబు గోరుటయే యుచితము. అట్లు చేయకున్నచో సర్వనాశంబు కాఁగలదు. చూడుము! ఆసింహము సాధారణమృగేంద్రమువలె లేదు. లోకభీకరాకారముతో విజృంభించుచున్నది. ఎంతపరాక్రమవంతుఁడైనను దానితో క్షణమైనను యుద్ధము చేసి బ్రిదుకఁజాలఁడు. కావున నమ్మహాదేవునిఁ బ్రిసన్నుం గావించుకొన్నచోఁ జిరకాలమువఱకును రాజ్యపాలనంబు చేయవచ్చును" అని ప్రిబోధించెను.

ఆమాటలకు రాక్షసేంద్రుిండు రోషపరవశుండై "ఓరీ! నీవు భయపడుచుంటివా! మహావీరులకు భయపడుట యుచితము గాదు" అని మందలించి మహావీరులగు రాక్షసనాయకులను బిలిపించి మీరా సింహమును బంధించిరండని యాజ్ఞాపించెను. రాజునాజ్ఞానుసారముగా దైత్యయోధులందఱు నత్యుత్సాహముతో నామృగేంద్రిమునాక్రమింపఁబోయి యగ్నిప్రివిష్టంబులగు శలభంబులంబోలి నిమిషమాత్రింబున భస్మీభూతులై పోయిరి. ఆఘోరవార్త నాలకించి మహావీరుండగు హిరణ్యకశిపుం డించుకంతయుఁ జలింపక స్వయముగఁ బోయి యానృసింహము నాక్రమించి యుద్ధము సేయ నారంభించెను. శస్త్రపాణి యగునారక్కసుఁడు నఖపాణియగునానృసింహునితో నొక్కకల్పాంతంబువఱకును మహారణంబు గావించెను.

అంతకాలమైనను నృసింహరూపి యగునమ్మృగేంద్రము చెక్కుచెదరకపోరాడుచుండుటంగాంచి దానవనాథుండు బహుశస్త్రకలితంబులగు ననేకబాహువులందాల్చి దశదిశలనాక్రిమించి యానృసింహు

నిపై నవిరామశస్త్రవృష్టిం గురియింపఁదొడంగెను. కాని యాతని మహాప్రయత్న మంతయును విఫల మయ్యెను. ఆయాస మధికమగుటచేఁ బోరాడుట యాతనికిఁ గష్టమయ్యెను. ఆతనియస్త్రశస్త్రంబు లన్నియువినష్టంబులై పోయెను. ఇఁక నాతఁడు శూలమాత్రసహాయుండై విజృంభించుచుఁ దుదకుఁ బర్వతసారం బగునృసింహుని బాహుమధ్యంబునం బడిపోయెను. అప్పుడు భగవానుం డగునృసింహమూర్తి యాదనుజేంద్రునికంఠమును దనబాహుమధ్యంబున నిరికించి నిశితనఖాగ్రంబులచే నాతని హృత్పిండమును జీల్చివైచుటయు నయ్యసురేశ్వరుండు నిహతుండై పడిపోయెను. ఇట్లు నృసింహదేవుండు రాక్షసేశ్వరసంహారంబు చేసి ప్రసన్నుండై తనకుఁ బ్రణతుండైనప్రహ్లాదుని దానవరాజ్యంబున కభిషిక్తుం గావించెను.

ఒకప్పు డంధకుండు భ్రాతృగణంబుతోఁ గూడివిహరించుండ వారాతనిం గాంచి “ రాజ్యాధికారములేని నీకు రాజ్యముతో సంబంధ మేమున్నది? మూఢుం డగుహిరణ్యాక్షుండు మహాతపంబు చేసి మహాదేవుని యనుగ్రహంబు గాంచియు కలహప్రియుండవు, అంధుఁడవు, వికృతాకారుఁడవు నగునిన్నుఁ బుత్రునిగాఁ బడసెను. అన్యజాతుండ వగునీవు దైత్యరాజ్యమున కెట్లధికారి వగుదువు?” అని తగవుపెట్టిరి. అంధకుం డామాటలాలించి నిరుత్తరుండై యతివిచారముతో నింటికిం బోయి తల్లి కెల్లసంగతులం దెలిపి యామె నూఱడించి యర్ధరాత్రిసమయంబున నగరంబు విడిచి నిర్జనారణ్యమునకుం బోయి యెకపాదంబుననిలిచి యూర్ధ్వబాహుండై యయుతవర్షంబులు దేవాసురదుష్కరం బగుమహాతపంబు గావించుచుండెను. ‘

ఆతఁడాహారమును విసర్జించి యగ్నిని బ్రజ్వలింపఁజేసి తనశరీరమునందలిరక్తమును మాంసఖండములను గోలఁదికోలఁదిగా నందు

హోమము చేయుచుండెను. ఇట్లు మంత్రపూర్వకంబుగ రక్తమాంస
హోమంబు సేయుచుండుటయుఁ గొంతకాలమున కాతఁ డస్థిమాత్రా
వశిష్టుం డయ్యెను. ఆతనిశరీరమం దొక్కరక్తబిందువైనను మిగులకుం
డఁబోయెను. తుదకాతఁడు తనయస్థిపంజరమును సమూలముగ హో
మము చేయుటకుద్యుక్తుం డగుటయు దేవతలందఱు నాతని సాహ
సముం గాంచి నీతివాక్యంబులచే నాశ్వాసింపఁదొడంగిరి. అప్పుడు
పద్మాసనుం డాతనికి సాక్షాత్కరించి దానవేంద్రా! నీకేమి కావల
యునో కోరుకొమ్మని యానతిచ్చెను.

దీనుం డగునంధకుం డప్పుడు విరించికిఁ బ్రణతుండై "దేవా!
నాయన్నలగుప్రహ్లాదాదులు నిర్దయులై నారాజ్యము నపహరించి
నారు. వారందఱును నాకు దాసులుగావలయును. దివ్యచక్షులచే
నాయంధత్వము దూరము గావలయును. ఇంద్రాదిదేవతలుగూడ నాకు
సామంతులై పన్నులఁ జెల్లించుచుండవలయును. దేవదానవయక్షగం
ధర్వమానవోరగాదులవలన నాకు మృత్యువు లేకుండవలయును.
దానవారి యగునారాయణునిచేఁగూడ నాకు మృతి లేకుండవలయు
ను." అని ప్రార్థించెను. పద్మాసనుం డాదారుణవాక్యంబు లాలించి
శంకితుండై "రాక్షసేశ్వరా! నీయభీష్టంబు లన్నియు సిద్ధించుఁగాక!
మరణమే లేకుండఁజేయుట యసంభవము. మరణమునకు నీయిచ్చవ
చ్చిన హేతువేదియైన నిరూపింపుము. ఏజీవికైనను మరణము గలుగ
కుండ వరంబిచ్చుట యెట్టివానికైనను సాధ్యము గాదుగదా! యము
నకెప్పటికైన వశీభూతులుగాని జీవులు జన్మించుట దుర్లభము. మఱి
యు నీవంటిసత్పురుషులు చిరజీవనముదుఃఖహేతువని యెంచి యట్టి
వాంఛితమును త్యజించుచుందురు." అని బోధించెను.

ఆలోకపితామహుని యనునయవచనంబు లాలించి యప్ప

డంధకుండు " దేవా ! నాతల్లియగు గౌరీదేవి భూతభవిష్యద్వర్తమాన
కాలములందలి రమణీమణులం దెల్ల నగ్రగణ్యురాలు. మఱియు మనో
వాక్కాయంబులకగమ్యురాలు. అట్టిజీవదుర్లభయగు దేవీమూర్తిని
నేనెప్పుడు కామింతునో యప్పుడే నాకాత్మవినాశంబగుఁగాక !" అని
చెప్పుటయు విరించివిస్మితుండై యట్లే యగు నని యనుగ్రహించి
" అసురేంద్రా ! లెమ్ము ! నీసకలాభీష్టంబులును సిద్ధించినవి. నీవు
యుద్ధరంగములందు సర్వదా పరాక్రమశాలివై విజృంభింపఁగలవు"
అని వరంబిచ్చెను. ఆమాట విని యస్థిమాత్రావశిష్టుం డగునంధ
కుండు " పితామహా ! ఈదేహముతో నేను శత్రుసైన్యమునఁ బ్రవే
శించి విజయం బెట్లు సాధింపఁగలుగుదును? నాయందనుగ్రహించి
భవత్కరస్పర్శంబుచే నాదేహమునకు బలమును, పుష్టిని గల్గింపుము."
అనిప్రార్థించెను. బ్రహ్మదేవుం డాతనిదేహమును స్పృశించి పరిపుష్టం
బును బ్రబలంబును గావించి దేవగణసహితంబుగా నంతర్హితుం
డయ్యెను.

దృఢశరీరుండును, బలయుతుండు నగునంధకుం డప్పుడు జాతనే
త్రుండును, సౌభాగ్యశాలియునై ప్రహృష్టహృదయముతో నిజనగ
రంబునకుఁ బోయెను. నతిగర్వితుం డగునాతండు తిరిగివచ్చుటం గాంచి
భీతులై ప్రహ్లాదాదు లాతనికి రాజ్యము నర్పించి యాతనికివశీభూతు
లును, భృత్యులునైరి. అనంతర మంధకుండు సర్వసన్నాహంబు గావిం
చుకొని విజయార్థియై నాకంబునకుం బోయి దేవతలనందఱును బరాజి
తులం జేసి దేవేంద్రునిచేఁ గప్పము గట్టించుకొనియెను. మఱియు
నాగయక్షరాక్షసగంధర్వమానవాదులను, గిరీంద్రవృక్షలతాదులను,
సింహశార్దూలాదిమృగంబులను, సచరాచరంబగు త్రైలోక్యంబును జ
యించి తనయాజ్ఞానుసారంబుగఁ జేసికొనియెను; స్వర్గమర్త్యపాతాళ

ములందలి శృంగారవతులగు రమణీమణుల నపహరించి తెచ్చి రమణీయంబులగు పర్వతోపవనంబులను నదీతటంబులను వారితోఁ గలసి సవిలాసముగ విహరించుచుండెను.

ఆదానవేంద్రుండు నిరంతరమును మహిళామండలమధ్యగతుండై క్రీడించుచు, వారుపానము చేసివిడిచిన దివ్యాసవంబుల నాస్వాదించుచు మదమత్తుండై కాలము గడపుచుండెను. అతనికి రసమయంబులగు సుగంధఫలమూలము లిచ్ఛానుసారంబుగ లభించుచుండెను. ధూపమాల్యానులేపనాదులచే నాతఁడు నిత్యసుఖభోగంబులం గాంచుచుండెను. మయకల్పితంబులగు నుత్తమమందిరంబులును, వాహనాదులును గలిగి యాతఁడు సౌభాగ్యశాలియై విహరించుచుండెను. ఈవిధముగా నాతఁ డయుతవత్సరములు నిశ్చింతుఁడై గడపివైచెను.

ఆతఁ డొక్కనాఁడైన నెట్టిపుణ్యకార్యమును గావింపలేదు. తనకుఁ బరలోకసుఖకారణము లగుకుమారులనుగూడఁ గుతర్కబోధనాదులచేఁ బరమనాస్తికులం గావించి నిరంతరము వేదవిహితధర్మములకు వినాశంబు గూర్చుచు వేదబ్రాహ్మణదేవగురుధిక్కారంబు చేయుచుండెను. మందభాగ్యుఁడును, మందబుద్ధియు నగు నాతఁ డీవిధముగా దుష్కర్మంబులచేఁ దనదీర్ఘాయువును నిష్ప్రయోజనంబు గావించుచు నొకప్పుడు సర్వసేనాసహితుఁడై మందరాచలంబునకుంబోయి యనేక కోటివర్షంబు లచ్చట నివసించి యుండెను. ఆపర్వతమునందలి స్వర్గరామణీయకమును దిలకించుచు మధుపానమత్తుండై యాతఁ డాయచలోపవనంబుల సేనాసహితముగ విహరించుచుండెను. ఆగిరీంద్రంబునం దాతఁడు తనయిచ్ఛానురూపంబగు నొకనగరమును నిర్మాపఁజేసెను. ఆనగరము శత్రుదుర్గమంబును దుర్జయమునై యుండెను.

అయ్యంధకునకు దుర్యోధనుఁడు, విఘసుఁడు, హస్తి యనుమువ్వురుదానవశేఖరులు మంత్రులై యుండిరి. వారొకప్పుడు మందరాచలసానుదేశంబున విహరించుచు నొకయతిలోకసుందరీమణి యగుతరుణీమణిం గాంచి సత్వరంబుగ దానవాధీశ్వరుచెంతకుంబోయి " అసురేంద్రా! ఈపర్వతంబున నొకగుహామధ్యంబున నత్యంతరూపవంతుండును, నిమీలితనయనుండు నగునొకమునీంద్రుం గాంచితిమి. వ్యాఘ్రచర్మాంబరుం డగు నాతనిమస్తకమర్ధచంద్రాలంకృతమై యుండెను. అతఁడు సంపూర్ణయౌవనముచే విరాజిల్లుచుండెను. అతనిసకలాంగములును ఫణిఫణాలంకృతములై యుండెను. కపాలమాలికాధరుండును, జటాధారియుఁ, దిశూలహస్తుండును, బాణతూణీరధరుండును, మహాధనుష్మంతుండును, ఖడ్గత్రిశూలపాణియు, కపర్దియు, అక్షసూత్రధారియు నగునమ్మునీంద్రుఁడు తపోమూర్తియై వెలుంగుచుండెను. ఆతనికిఁ గొంతదూరంబున వానరసహితుండును, ఘోరముఖుండును, కరాళుండును, సర్వాయుధధారియు, సూక్ష్మకరుండును, నగునొకపురుషమూర్తి యుండెను. తెల్లనివృద్ధవృషభముకూడ నచ్చట విరాజిల్లుచుండెను. ఆమునీంద్రునివామభాగంబున త్రిలోకసుందరి యగునొకరమణీమణిం గాంచితిమి. సువర్ణమణిమయాలంకారిణియు, శుభ్రవసనధారిణియు, శుభలక్షణసమన్వితయు నగుతత్తరుణీమణి జగతీరత్నమే యని కీర్తింపఁదగినది. ఆమెం గాంచినకన్నులే ధన్యములు. ఆయువతి యమ్మునీంద్రునిభార్యయై యుండును " అని వర్ణించి చెప్పిరి.

దైత్యేంద్రుం డమ్మాట లాలించి కామపరవశుండై తనమంత్రుల నాక్షణంబ యమ్మునిచెంతకుం బంపించెను. వారును తపస్విచెంతకుం బోయి ". మునీంద్రా! నీవెవ్వరితనయుఁడవు. నీవిటనుండుటకు నిమిత్తమేమి? ఈనారీరత్న మెవ్వరు? మాదానవేంద్రుం డెల్లవి

విషయములం దెలిసికొనఁ గోరి మమ్ము నీకడ కంపించెను. ఈభస్మలిప్తాంగముతో, ఈవికారాకారముతో, ఈకపాలమాలికలతో ధనుర్బాణతూణీరములను, ఖడ్గత్రిశూలములను ధరించుట యసంగతముగా నున్నది. జటామండలమున జాహ్నవియేమి, లలాటమునఁ జంద్రఖండమేమి, ఒడలినిండ విషాగ్నిదీప్తంబు లగుసర్పభూషణము లేమి—ఇట్టి నీకు రమణీరత్నసంగ మవిధేయముగాదా? వృద్ధవృషభారోహణంబును, నిత్యమును దానిని దర్శించుచు సంధ్యావందనంబు చేయుటయు నీకు ధర్మముగాదు. నీభోజనముగూడ విరుద్ధముగ నున్నది. నీచేయుకార్యంబు లన్నియును విపరీతముగనే యగపడుచున్నవి. ఇట్టినీభార్యను బరిగ్రహించుట మారాజున కయుక్తము గాదు. మాప్రభుండు సకలలోకంబులవారిచేతను రత్నపతి యని పొగడఁబడుచున్నాఁడు. కావున నీవుమాఱుమాట చెప్పక రమణీరత్నమగు నీకాంతను మారాజున కర్పింపుము. మాయాజ్ఞానుసారంబుగ నీవీయస్త్రశస్త్రంబులను బరిత్యజించి విశుద్ధవర్తనంబునఁ దపంబు చేసికొనుచుండుము. అవిలంఘ్యంబగు మాశాసనము మీరినచో నీకిఁక రక్షణోపాయంబు లేదు." అని నియమించిరి.

అప్పుడు మహాదేవుండు మందహాసంబు చేయుచు "దానవవీరులారా! నేను నాతల్లిదండ్రుల నెఱుఁగను. నేనీగుహాంతరంబున నతిఘోరంబును, అనన్యాచరితంబు నగుపాశుపతవ్రతంబు చేసికొనుచుంటిని. నేను కేవల యజ్ఞుండను. విరూపుఁడను. నేనీవస్తువులను ధరించుటకుఁ గారణ మేమియును లేదు. కాని వీనిని నేను విడువఁజాలను. శాంతమతియుఁ, దరుణీమణియు సుందరియు నగునీమెనాభార్య. సిద్ధిస్వరూపిణి. ఈమెప్రభావముచేతనే నేనెల్లయెడల నిరాఘాటముగా విహరించుచున్నాఁడను. మీరు రాక్షసులు. 'కావున మీరాజు తన

కీర్తనమైన వస్తువు నెట్లయినను బరిగ్రహింపవచ్చును. ఈనామాటలను మీప్రభువుతో విన్నవింపుఁడు" అని యుత్తరంబిచ్చెను.

దైత్యామాత్యు లాగంభీరవచనంబుల నాలించి విస్మితులై యమ్మునీంద్రునకుఁ బ్రణామంబు చేసి యాతనివీడ్కొని త్రైలోక్య వినాశంబునకుఁ గృతప్రతిజ్ఞుండైన యంధకుచెంతకుం బోయి నిశ్చయముగా «మహారాజా! ఆమునీంద్రుండు నవ్వుచు మీతో నిట్లు చెప్పుఁడనియెను. 'ఓరాక్షసేశ్వరా! నీశౌర్యధైర్యములు నిశ్చలములైనవి. నీవు కృపణుండవు. క్రూరుఁడవు. కృతఘ్నుండవు. పాపాచరణుఁడవు. సత్త్వహీనుఁడవు. మఱియు రాక్షసుఁడవు. యమునకు భీతులగు దానవులకును, పర్వతరాజసారంబగు మద్బాహుయుగళంబునకును సామ్యంబెక్కడ? ఈనాదారుణశస్త్రములెక్కడ, మృత్యువునకుఁగూడ భయంకరమగుయుద్ధమెక్కడ! వానరవక్త్రుండగు నీనందికేశ్వరునకును నిశాచరులకు నెంతయంతర మున్నది! రూపవతి యగు నీరమణీరత్నము దానవబలంబునకు సాధ్యమగునా? మీప్రభుం డెట్లును మత్సమానుండు గాఁజాలఁడు. సామర్థ్యము గలదేని మీరాజు ససైన్యముగ వచ్చి నాతో యుద్ధము చేయువచ్చును. నాయస్త్రములు భీకరాశనిసదృశంబులు. మీదేహములో కోమలకమలసన్నిభంబులు. ఇఁక నన్నడుగవలసినపనిలేదు. మీయిష్టము వచ్చినట్లు చేయవచ్చును" అని నిస్సంశయముగా వచించెను. ప్రభూ! ధ్యానశీలుండును, తపస్వియు నగునాతనితో రణంబు చేయుట మనకుచితముగాదు. అతని మాటలనుబట్టి చూడఁగా నిన్నాతఁడు లక్ష్యము చేయుట లేదని తోఁచుచున్నది. నీవైనను ప్రాజ్ఞుఁడవు. విచక్షణుఁడవు. అట్టినీకు మేము బోధింపఁదగినవారము గాము. అయినను ప్రభుభక్తిప్రేరితులమై మా తోఁచినరీతి వచించితిమి. మమ్ము క్షమింపఁగోరెదము" అనివిన్నవించిరి.

ఆమాట లాలించి యంధకాసురుం డాజ్యాహుతిం గాంచిన యగ్నిదేవునింబోలి క్రోధప్రజ్వలితుండై పోయెను. ఆసన్నమృత్యువులగువారికి హితంబగుసత్యవాక్యముకూడఁ గుటిలంబును దీక్ష్ణంబునై తోఁచునుగదా! వరగర్వితుం డగునాతఁ డప్పుడు కరాళఖడ్గపాణియై తూలుచు నటనుండి, బయలుదేఱెను. సురాపానాతిరేకంబున నాతని కన్నులు ఘూర్ణితములై యుండెను. ఆతఁడట్లు క్రమంబుగ గుహాముఖంబునకుం బోయి యచ్చటఁ ద్రిలోకసౌందర్యరూపిణి యగుగౌరీదేవిం గాంచెను. ఇంతకుఁ బూర్వమాతనికి మహాదేవుని సకలాయుధంబులను హరించి యాతని బరాజితునిం గావింపవలయు నని కోరిక యుండెను. ఇప్పు డాతనికి గౌరీహరణాశ ప్రబలమయ్యెను. అందుచే నాతఁడనేకవిధములఁ బ్రయత్నించెను గాని నందీశ్వరరక్షితం బగుగుహాముఖంబునఁ బ్రవేశింపఁజాలకపోయెను. కాని దీపశిఖామోహితం బగు శలభమునుం బోలి యాతఁడు సతీమోహాంధుఁడై మాటిమాటికిని గుహాముఖంబుఁ జేరుచు నందీశ్వరునిచే అశనిప్రస్తరవృక్షాచలభుజంగశస్త్రాదులవలనఁ బీడింపఁబడుచు నివృత్తుం డగుచుండెను.

అప్పుడు నందీశ్వరుండు క్రుద్ధుండై నీవెవ్వండ వెందునిమిత్తమై యిటకు వచ్చితి వని ప్రశ్నించుటయు నంధకుండు సమస్తమునెఱింగించి తనతో యుద్ధము చేయఁగోరెను. ఆసమయమందే సింహబలుండగునందీశ్వరుం డాతని నాక్రమించి సకలాయుధంబుల బలవంతముగ లాగికొనుటయు నంధకుండు విజితుండై శుష్కకంఠుండై పలాయితుం డయ్యెను. అనంతరము విఘసప్రముఖులగు మంత్రులు ప్రహ్లాదాదిదానవగణంబులతోఁ గలసి వచ్చి నందికేశ్వరునిపైఁ బడుటయు, నాతఁడువారినందఱ నొక్కక్షణకాలములోఁ బరాజితులం గావించెను. తరువాత విరోచనుండును, బలియు, సహస్రబాహుం డగు

బాణుండును, భగజుండును, సుభంజుండును, శంబరుండును, వీర్యవంతుండగువృత్రుండును, మున్నగుదానవులు నందీశ్వరునితోఁ బోరి పలాయితులై పోయిరి.

విజయుం డగునందీశ్వరుం గాంచి సిద్ధగంధర్వాదులు జయధ్వనులం గావించిరి. రణరంగమంతయు వసామాంసదుర్గంధమును, రక్తకర్దమంబు నై పోయెను. మాంసాశనంబులగుజంతుగణంబులు రణక్షేత్రమున నిరంతరవిహారముఁగావించుచుండెను. భేరుండములు నృత్యము చేయుచుండెను. దానవుండొక్కఁడైనను రణరంగమున నగపడుట లేదు. అందఱును భయభ్రాంతులై పోయిరి.

అంత భగవానుండగుశంకరుండు దాక్షాయణిం గాంచి సాంత్వన వచనంబులతోఁ "దేవీ! పూర్వము పాశుపతవ్రతంబువలన సంపాదించిన ప్రభావం బంతయు, దైత్యవిజయంబుకొఱకు వినష్టంబై పోయినది. పూర్వసంచితం బగునాపుణ్యంబంతయును దివారాత్రములు నీతోడి సంయోగమువలన సంక్షయమైపోయినది. కావున నేను మరల నతినియమంబున ఘోరారణ్యమునకుం బోయి మహాపాశుపతవ్రతంబు గావింపవలయును. నీవుపుత్రసమానుం డగునీనందీశ్వరునిచే సంరక్షింపఁబడుచు నేను వచ్చువఱకును నిర్భయముగా నిర్విచారముగా నిందే యుండుము. మఱియెచ్చటికిని గదలవలదు." అని బోధించి యాక్షణం బ కదలి యొకమహారణ్యంబున సురాసురదుస్సాధ్యం బగు పాశుపత వ్రతంబును సహస్రవర్షంబు లాచరింప సంకల్పించి వ్రతంబు చేయుచుండెను.

శుభశీలగుణసంపన్నయు, పతివ్రతయు, నగుపార్వతిదేవి యా మందరాచలంబున నేకాకినియై యుండి యాదైత్యేంద్రుండు మరల నేతెంచునో యని శంకించుచు శంకరాగమనంబును బ్రతీక్షించుచు,

నందికేశ్వరుండు తన్నెల్లవిధంబుల సంరక్షించు మన్నను నతికష్టముతోఁ గాలక్షేపము చేయుచుండెను. ఆసమయంబున మదోద్ధతుండగునంధకుండు కామపీడితుండై ప్రధానులగు దానవయోధులతోఁ గూడి వచ్చి గుహాముఖంబును సమీపించి యచ్చట నందీశ్వరునితోఁ బంచశతవత్సరంబులు నిద్రాహారంబుల విడిచి మహారణంబు గావించెను. దానవప్రయుక్తంబులగు ఖడ్గకుంతగదాశూలంబులు మరనారాచాదివివిధాయుధంబులచే గుహాముఖంబంతయు నాచ్ఛాదితంబై పోయెను. దానవాస్త్రంబులచే విభిన్నదేహుండై నందీశ్వరుండు మూర్ఛిల్లెను.

అప్పుడా రాక్షసు లందఱును గుహాముఖంబును దెరచుటకు మహాప్రయత్నముంగావించిరిగాని యాకార్యము వారికి సాధ్యపడలేదు. భయంకరులగు దానవవీరు లెట్టయెదుట ముమ్మరులై సలిపియుండుటం గాంచి భవాని భీతచిత్తయై సఖీసహితంబుగ బ్రహ్మావిష్ణులను ధ్యానింప నారంభించెను. అప్పుడు విరించియు, విష్ణుదేవుండును మహేంద్రుండును స్త్రీరూపధారులై యటకు విచ్చేసిరి. దేవసేనలును స్త్రీమూర్తులతో వచ్చియుండిరి. ఆసమయంబున సిద్ధులు గుహ్యకులు, నాగులు యక్షులుమొదలగువారందఱు స్త్రీరూపధారులై గుహామధ్యంబునఁ బ్రవేశించి యుండిరి. రాజాంతఃపురంబునఁ బురుషప్రవేశము తగదుగదా — ఆకపటరమణీమణుల యతిలోకసౌందర్యముచేతను, వారి సుందహాసనిస్వనంబులచేతను గుహాయంతయు మనోజ్ఞశోభామయంబయ్యెను.

అప్పుడాకాంతలందఱును ప్రళయకాలమేఘ గర్జనంబులంబోని శంఖభేరీనినాదములం గావించుచు దశదిశలను విదారితంబులుగాఁ జేయుచుండిరి. అంతనందికేశ్వరుండు మూర్ఛనుండి లేచి వివిధాయుధంబులచే దానవవీరులను బ్రహరింప నారంభించెను. అప్పుడు

దండహస్తయై బ్రాహ్మీశక్తియు, శంఖపద్మగదాచక్రధనుర్ధారిణియై వైష్ణవీశక్తియు, సహస్రనేత్రయు, సహస్రధారాకలితవజ్రహస్తయునై దుర్జయ యగునైంద్రీశక్తియు, ఆశ్లే ఆగ్నేయశక్తియు, దండహస్తయై యమశక్తియు, ఖడ్గశాపహస్తయై నిరృతిశక్తియు, చాపహస్తయై వారుణీశక్తియు, ప్రళయానలసదృశగదాహస్తయై కౌబేరీశక్తియు, నఖహస్తయగుగారుడీశక్తియు, వివిధాయుధంబులతో నితరదేవీగణంబులును గుహాగర్భమునుండి మహారణాభిలాషచే సంకులరణక్షేత్రమునకు వచ్చి యపారం బగుదానవసైన్యముం గాంచి విస్మితలై పోయిరి.

ఆదానవసేనామధ్యంబునఁ గొందఱు ప్రచండపరాక్రముం డగు నందీశ్వరుం గాంచినంతనే భయభ్రాంతులై పోయిరి. ప్రధానవీరులు మాత్రమాస్త్రమండలము నెదిరించి తెగించిపోరాడ నారంభించిరి. గౌరీదేవి మహాపరాక్రమనిధియగు నందీశ్వరుని సేనానాయకుం గావించి సఖీగణంబులతోఁ గూడి రణక్షేత్రంబున వీరవిహారము సేయుచుండెను. అంధకుండును దనసైన్యమును మోహరించి మహారణంబు గావించుచుండెను. ఇంతలోఁ బ్రళయార్కసహస్రనిభతేజుం డగుశంకరుండు పాశుపతవ్రతంబును సహస్రవర్షసంపన్నంబు గావించి క్రోధమూర్తియై యటకు విచ్చేసెను.

అప్పు డమ్మహిళాగణసహితంబుగా గౌరీదేవి యద్దేవునకుఁ బ్రణామం బాచరించి మహారణంబున విజృంభించి క్షణకాలంబున సమస్తదానవయోధులను బరాజితులను, బలాయితులను గావించివైచెను. అప్పుడు భగవానుం డగుశివుండు పరమాదరంబున గౌరి నాలింగనంబు చేసికొని గుహామధ్యంబునఁ బ్రవేశించి యానారీగణంబును స్వస్థానంబులకుఁ బంపివైచెను. అంతవీరవరుం డగునందీశ్వరుండు పార్వతీపరమేశ్వరులను భక్తిపూర్వకంబుగఁ బూజించి వారియనుజ్ఞం గైకొని

యెప్పటియట్ల గుహాద్వారంబున నిలిచి యుండెను.

అనంతరము కొంతకాలంబున శంఖునిచెంతనుండి విఘసుం డను మంత్రి శంకరునికడకు దూతయై వచ్చి యద్దేవునకు నమస్కరించి "మునివర్యా! మాదైత్యేంద్రునిమాటలు చెప్పుచున్నాను వినుము. నీవీనారీరత్నము నేమి చేసికొందువు? కావున నీమెను విడువుము. నీకుఁ దగినవస్తువుల నీవుపభోగింపుము. ఈత్రిలోకంబులం గలరమణీయవస్తువు లన్నియు నాయొక్కనికే భోగ్యము లైనవి. మునులతో విరోధపడుట యుచితము గాదు; కాని నీవట్టివాఁడవు గావు. దానవగణంబునకుఁ బగమశత్రుండ వగుకపటమునివలె నగపడుచున్నావు. కావున నిన్నువధించినను బాపము గలుగదు. సామవచనంబులచే నీవు లొంగనియెడల నిన్నుఁ జంపి నీభార్యను నేనపహరింపఁ దలఁచితిని" అని విఘసుండు తనప్రభువాక్యములం దెలుపుటయుఁ ద్రిలోచనుండు క్రోధపరిజ్వలితుండయ్యును శాంతముగా నద్దూతం గాంచి "ఓయీ! నీవు చెప్పినదంతయును సత్యమే. రక్షించుకొనుటకు శక్తిలేనివానికి రమణీమణి యగుభార్యయు, విశాలంబగునైశ్వర్యమును నేల? కావున నీవు నీరాజునొద్దకుం బోయి నామాటలుగా నిట్లు చెప్పుము. బలవంతులగురాక్షసయోధులు యుద్ధార్థులై వత్తురుగాక! వారియిష్టానుసారము వీరవిహారముం గావింతురుగాక! అశక్తులకు జీవయాత్రానిర్వహణమే కఠినతమం బగుచున్నదని యాలోచించి యిట్లు చెప్పుచున్నాను. నేనును కర్తవ్యకార్యములం దెట్టిలోపమును గలుగకుండ నిర్వర్తించుకొని సిద్ధముగా నుండెదను." అని పలికెను.

• అంతవిఘసుం డమ్మహాదేవునికడ సెలవు గైకొని సింహనాదంబు చేయుచు నతిత్వరితంబుగ నసురేంద్రునొద్దకుం బోయి నమస్కరించుటయు నింగితజ్ఞుం డగుదానవేంద్రుం డతఁడు చెప్పకుండఁగనే

సర్వంబును గ్రహించి గదాహస్తుండై లేచి యాక్షణంబ సేనాసహితంబుగఁబోయి యభేద్యంబగు నాగుహాద్వారమును మరల ముట్టడించెను. దానవవీరులు నందీశ్వరునిమీఁదను, గౌరిమీఁదను శరవర్షములు గురియింప నారంభించిరి. అసురసైన్యం బంతయు నాగుహాముఖంబును భేదించుచు, ఫలపుష్పశోభితంబగు నయ్యచలోపవనంబును బెకలించుచు, మందరాచలశృంగంబుల భేదించుచు ననేకవిధంబుల విజృంభింపనారంభించెను. అప్పుడు శూలపాణి కుపితుండై ప్రమథగణంబులను, భూతంబులను, ససైన్యంబుగ దేవగణంబులను విష్ణుదేవుని స్మరించుటయు, రథాశ్వవృషభోష్ట్రగర్దభసింహశార్దూలమృగశరభవిహంగమీనభుజంగాదివాహనారూఢులై ప్రమథులు శివసాన్నిధ్యంబుఁ జేరెంచి ప్రణామంబు గావించిరి. శివుండును నందీశ్వరునకు సేనానాయకపట్టముం గట్టించి వారినందఱను రణంబునకుఁ బురికొల్పెను. అట్లు మహేశ్వరప్రేరితు లగుప్రమథులు విజయాభిలాషులై యతిఘోరంబుగఁ బోరాడుచు సకలలోకప్రళయంబు గావింప విజృంభించుచుండిరి. అప్పు డద్భుతవిక్రముం డగువిఘసుండు క్షుధాన్వితుండై దానవేంద్రునియాజ్ఞానుసారంబుగా బ్రహ్మేంద్రనారాయణసూర్యచంద్రాదిదేవగణంబులను, భూతగణంబులను దనకరాళవదనంబున గ్రసించివైచెను.

అప్పుడు నందికేశ్వరుండు రణరంగంబు విడిచి గుహామధ్యంబుఁ బ్రవేశించి మహాదేవునకు నమస్కరించి «మహాదేవా! మనసేనలన్నియును విఘసునిహృదయకుహరంబునఁ బడిపోయినవి. నేనొక్కండనుమాత్రమే యెట్లో తప్పించుకొని వచ్చితిని. ఇఁక నిప్పు డేమిచేయవలయునో నాకేమియుం దోఁచుట లేదు. అజేయుం డగుదానవేంద్రుఁ డిప్పుడు దైత్యసేనాసహితుండై పరమానందంబున వీరవిహారము

చేయుచున్నాఁడు. మహావేగుం డగువిఘ్నుండు వాయువేగమునో వేగం బులఁ జరింపఁగలఁడు. దేవా! నీవు సజీవుండవే. కృష్ణు డేమి చేయ వలయునో యానతీయవలయును. ఆవిఘ్నాసురుండు సామాన్యుఁడు గాఁడు. మున్ను హిరణ్యకశిపుని నఖాగ్రంబులచే నవలీలగఁ దునుమా డినవిష్ణుదేవుఁడుగూడ నాతనికి వశీభూతుఁడై పోయినాఁడు. ఆదానవుం డింతటితో నూరకుండువాఁడు గాఁడు. ఈబ్రహ్మాండ మం తయు నాహరింపవలయు నని నోరు తెఱచుకొని చూచుచున్నాఁడు. పూర్వ కాలంబున సప్తర్షులు నీతనిపైఁ గోపించి నిత్యమును దానవాదిప్రాణిత గ్గమును భక్షించుచు జీవించుచుండు మని శపించిరి. అప్పు డవిఘ్ను నుండు భయభక్తివినమ్రుండై మునులారా! నాయందనుగ్రహించి శాపమోక్షణోపాయముం బ్రసాదింపుఁ డని ప్రార్థించెను. దయాళుర గుఋషులప్పు డాతని ననుగ్రహించి బదరికాశ్రమంబున నరనారాయ ణులు నీచేఁ బరాజితులై బాణముష్టిఘాతంబులచే నీవదనంబును విదా రితంబు గావింతురు. అప్పుడు నీవు నిష్పాపుండవై పరమపదంబు గాం తువని యానతిచ్చిరి. అదిమొదలుగా నీతఁడు దానవమానవాదిజీవు లను ప్రత్యహమును భక్షించుచున్నాఁడు. సూర్యచంద్రులను గూడ నీతఁడు మ్రింగివైచుటచే నిప్పుడు జగమంతయు నంధకారబం ధురమై యున్నది. దైత్యగురుం డగుశుక్రుండును మీకుఁ బ్రతికూ లుండై రణనిహతు లగురాక్షసులను సంజీవనీమంత్రబలంబునఁ బునర్జీ వితులం గావించుచున్నాఁడు. ఈసంగ్రామమున జననియగుభవానిని బోఁగొట్టుకొనుటకంటె నెల్లవిధముల సంఘమరణమైనను నయమే యని భావించుచున్నాను. మహాదేవా! బాగుగ నాలోచించి దీనికిఁ బ్రతి విధానం బాలోచింపవలయును." అని విన్నవించెను.

అంత శూలపాణి యగుదేవుండు కుపితుండై చాలసేపు

ధ్యానించి సోమాఖ్యం బగుసామగానముం గావింపనారంభించెను. అప్పు డద్దేవుని పరిహాసమువలన నంధకారము విగతంబై త్రిభువనంబులు నాలోకమయంబు లయ్యెను. ఆసమయంబున నందీశ్వరుండు మరల దానవులతోడి యుద్ధమున నుపక్రమించుటయు నాక్షణంబ విశ్రుతవదనుం డగువిఘసుండు యోధప్రధానుండును, మునిశతాధికమహిముండును, శమదమాదిగుణసంపన్నుండునగు నందీశ్వరుని శరశూలఖడ్గసహితంబుగా మ్రింగివైచెను. భగవానుం డగుశర్వుం డాఘోరకృత్యముం గాంచి విస్మితుండై జీర్ణవృషారోహణంబు గావించి యావిఘసున కభిముఖుండై ధనుర్గుణంబు సారించి వజ్రకల్పంబు లగుశరంబుల సంధించి గిలనవిఘాతోగ్గిలనదివ్యమంత్రంబులను జపింపఁదొడంగెను.

అంతలో వీరవరుం డగునందీశ్వరుండు దనసైన్యముతో విష్ణుదేవసహితముగా నారాక్షసుని వదనకుహరమునుండి వెలువడుటయు, నావెంటనే బ్రహ్మేంద్రచంద్రాద్యాదిసకలదేవతాగణంబులు బహిర్గతులై విజయోత్సాహముతో మరల మహాఘోరయుద్ధంబు గావింప నారంభించిరి. అప్పుడు భగవానుం డగుశుక్రుండు రణనిహతులగు రాక్షసులను మరల బ్రదికించుచుండుటయుఁ బ్రమథగణంబు లాతని బశువుంబోలి బట్టి బంధించి భూతపతి కర్పించిరి. ఆక్షణంబయాతండు శుక్రుని గ్రసించివైచెను. అట్లు దానవగురుండు వినష్టుం డగుటయు నసురవీరులు దేవగణంబులచే విజితులును, విధ్వస్తులును, విదళితులు నై పోయిరి. రణరంగమున భూతబేతాళాదులు నృత్యము చేయ నారంభించెను. మఱియు సమరాంగణమంతయుభీషణకబంధగృధ్రజంబుకవృకసమాకీర్ణమై యతిదారుణముగ నగపడుచుండెను. అయినను మహావీరు లగుప్రహ్లాదాదిదానవప్రధానవీరులుమాత్రము చాలసేపు మహారణంబు గావించి తుదకు హరిహరబ్రహ్మేంద్రాదులచేఁ బరాజి

తులై దేవభయంబునఁ స్వర్గమర్త్యలోకంబులఁ బరిత్యజించి పాతాళగిరి గుహాజలధిగర్భంబులఁ బ్రవేశించి దాఁగి యుండిరి.

ఈరీతిగాఁ దనసైన్య మంతయు దేవతలచే విధ్వస్తంబై పోవుట యు నంధకుండు క్రోధపరవశుండై నందీశ్వరునిపైనఁ బడి యతిదారుణంబుగ రణవిహారంబు చేయుచుండుటయు విష్ణుదేవుండు తనభీషణ గదాఘాతంబులచే నాదానవేంద్రుని వజ్రదేహమును జూర్ణముచేయ నారంభించెను. అయినను మహాధైర్యశాలి యగునంధకుండు సుస్థిరుండై విజృంభించుచుండుటయుఁ ద్రిదశనాథుండు కుపితుండై తీవ్రబాణంబులచే నాతని ఛేదింపఁదొడంగెను. అప్పుడు దానవేంద్రుం డించుకంతయును జలింపక క్రోధోజ్జ్వలుండై శస్త్రాస్త్రంబులచేతను, తరుపర్వతాదులచేతను దేవగణంబులఁ బ్రహరించుచుఁ గ్రమంబుగ సకలదేవతలను బరాజితులం గావించి భయంకరగర్జనంబులచే మహాదేవు నాహ్వానించుచు నమ్మహారణంబునఁ దనయస్త్రశస్త్రంబులెల్ల సంక్షయంబు లగుటచే మాయారణంబున కుపక్రమించెను. అప్పు డాతఁ డనేకాయుధంబులను, తరుపర్వతాదిప్రహరణసాధనంబులను గల్పించి వానిచేఁ బార్వతీపరమేశ్వరులను బ్రహరింప నారంభించెను. దేవగణంబుల కవధ్యుండును, వరగర్వితుండును, మహాసత్త్వుండును, మతిమంతుండును, వీరవరుండు నగునాదానవవీరుండు నందీశ్వరునిఁ బరాజితునిం గావించి యనంతంబు లగుమాయాజాలంబుల విస్తరింపఁజేయుట యు దేవతలందఱును భీతులై యొక్కపెట్టున నాతనిపై శరవర్షముం గురియింప నారంభించిరి. ఆశరాఘాతములచే నంధకునిదేహము శతసహస్రశోణితధారాపూరితమైపోయెను.

ఆరక్తబిందువులనుండి యసంఖ్యులగునంధకాసురు లుత్పన్నులై భూమండలము పట్టఁజాలనంతటి మహాదానవసైన్యముగాఁ బరిణ

మించుచుండెను. పశుపతి యది గాంచి ప్రళయభైరవమూర్తియై శూలాయుధముచే వారిని సంహరింప నారంభించెను. కాని వారి రక్త బిందువులనుండికూడ ననేకులగునంధకాసురు లుదయించి నిమిషము లో నెప్పటియట్లు మహాసైన్యమైపోవుచుండెను. అప్పుడు శంకరుండు విష్ణునందీశ్వరులతో మంత్రాలోచనంబు గావించి కరాళవదనయు, భీకరాకారిణియు, నజేయయు, విషభుజంగలోమయు, బహుభుజలతా సమాక్రాంతదిఙ్మండలయు, నగునొకశక్తిని సృజించెను. మఱియుఁ దనదక్షిణాంగమునుండి విషజ్వాలాభీలం బగుసర్పద్వయమును బుట్టించెను. అనంతర మమ్మహాదేవుని కర్ణమునుండి దేవీమూర్తి వెలువడియెను. ఆమెచరణములు రణరంగమంతయు నాక్రమించెను. దేవతలందఱు నప్పుడమ్మహాదేవిని స్తోత్రము చేయ నారంభించిరి.

అప్పు డద్దేవి శంకరప్రేరితయై దానవసైన్యమును జంపి రక్తమాంసములను భక్షింప నారంభించెను. ఆమె యొక్కరక్తబిందువైనను భూమిపైఁ బడకుండఁ గ్రోలుచుండుటచే మఱియొక్కదానవుఁడైనను జనించుట లేదు. క్రమముగా దానవసేనయంతయును దేవీగర్భమున విలీనమైపోయెను. ఇఁక నొక్కయంధకుఁడుమాత్రమే మిగిలెను. అతని దేహమునఁగూడ నొక్కరక్తబిందువైనను లేదు. అయినను నాతఁడు కులక్రమాగత మగుక్షత్రధర్మమును మఱవక యభిమానముతో యుద్ధము చేయుచుండెను. అశనిసదృశంబులగు జానుచరణబాహుప్రముఖాఘాతంబులచే నాతఁడు శంకరుని నొప్పించుచుండెను. అప్పుడు శివుండు కుపితుండై యాతనిపైఁ ద్రిశూలమును బ్రయోగించుటయు నది యాతనిగుండెలలో గ్రుచ్చుకొని భేదించివైచెను. అప్పు డంధకుండు గ్రుచ్చుకొన్నశూలముతోఁగూడఁ బైకెగసి ఛత్రముంబోలి యాకసమున నిలిచి యుండెను. రక్తశూన్యంబగు నాతనిదేహము

సూర్యకిరణపరితప్తుండై శుష్కుండైనను నాతఁడు ప్రాణములనుమాత్రము విడువక యట్లే నిలిచియుండెను.

ఈరీతిగా మహారణము పరిసమాప్తం బగుటయు దేవతలు ప్రీతులై మహాదేవుని యథావిధిగఁ బూజించి యనేకవిధంబుల స్తుతించుచు నాతనిచే ననుజ్ఞాతులై నిజనివాసంబులకుం జనిరి. మహాదేవుండు గుహామధ్యంబునఁ బ్రవేశించి యానందమయి యగుపార్వతిని, విఘ్నవదనముఖ్యుం డగునందీశ్వరునిఁ గాంచి పరమానందభరితుండై విహరించుచుండెను.

## —♦ శుక్రపునర్జననము. ♦—

ఆమహాయుద్ధమునందు దానవులను మరల బ్రతికింపకుండ భూతేశ్వరుం డగుమహాదేవుండు శుక్రాచార్యుని మ్రింగివైచెనుగదా. అయినను భార్గవుండు శశితుషారశీతలంబును, మహాతాపనివారణంబు నగు*మృత్యుంజయమంత్రమును జపించుచుండుటచే శివజఠరమధ్యంబునఁగూడ నాతనికి వినాశము లేకుండఁబోయెను.

---

*ఓమ్ నమస్తే దేవేశాయ, సురాసురనమస్కృతాయ, భూతభవ్యమహాగేవాయ, హరిపింగళలోచనాయ, బలాయ, బుద్ధిరూపిణే, వైయాఘ్రవసనచ్ఛదాయారణీయాయ, త్రైలోక్యప్రభవేశ్వరాయ, హరాయ, హరినేత్రాయ, యుగాంతకరణాయానలాయ, గణేశాయ, లోకశంభవే, లోకపాలాయ, మహాభుజాయ, మహాహస్తాయ, శూలినే, మహాదంష్ట్రిణే, మహేశ్వరాయ, కాలాయ, కాలరూపిణే, నీలగ్రీవాయ, మహాదేవాయ, గణాధ్యక్షాయ, సర్వాత్మనే, సర్వభావనాయ, సర్వగాయ, మృత్యవే, మృత్యుహరాయ, పారియాత్రసువ్రతాయ, బ్రహ్మచారిణే, వేదాంతగాయ, పశుపతయేవ్యయాయ, శూలపాణినే, వృషకేతవే, హరయే, జటినే, ముండినే, శిఖండినే, లగుడినే, మహాయశసే, భూతేశ్వరాయ, గుహావాసినే, వీణాపణవతూణవతేమరాయ, దర్శనీయాయ, బాలసూర్యనిభాయ, శ్మశానచారిణే, భగ

అనంతరము శుక్రుండు శివగర్భంబునుండి శుక్లరూపంబున వెలువడి పుత్రార్థిని యగుపార్వతిచే గ్రహింపఁబడి త్రిసహస్రవర్షంబులకు మరల సత్కీయుండును, అమరుండును, వేదనిధియు, మృతసంజీవనీప్రభృతిసకలవిద్యాపారంగతుండునై జన్మించి రెండవశంకరుండునుంబోలి విరాజిల్లుచుండెను.

## —♦ అంధకసిద్ధి. ♦—

ఒకప్పుడు మహాదేవుండు విహారంబు చేయుచు శూలారోపితదేహుండై యాకసంబున ఛత్రాకృతిని నిల్చి యాశివుని ధ్యానంబు చేయుచు జీవంబుల నిల్పుకొని విశీర్ణగాత్రుండై యున్నయంధకాసురునిం గాంచెను. అప్పుడా రాక్షసేంద్రుండు మహాదేవుండును, విరూపాక్షుండును, చంద్రార్ధశేఖరుండును, అమృతుండును, శాశ్వతుండు

---

పతే, ఉమాపతయే, అరిందమాయ, భగస్యాక్షిపాతినే, పూష్ణోదశననాశనాయ, క్రూరకర్త్రే, పాశహస్తాయ, ప్రళయకాలాయ, ఉల్కాముఖాయ, అగ్నికేతవే, మునయే దీప్తాయ, విశాంపతయే, ఉన్మాదాయ, వేపనకాయ, చతుర్థకాయ, లోకసత్తమాయ, వామనాయ, వామదేవాయ, వాగ్దాక్షిణ్యాయ, వామలోభిక్షవే, భిక్షురూపిణే, జటినే, స్వయంజటిలాయ, శక్రహస్తప్రతిస్తంభకాయ, వసూనాంస్తంభకాయ, ఋతవే, ఋతుకారాయ, కాలాయ, మేధావినే, మధుకరాయ, చలాయ, వానస్పత్యాయ, వాజసనే, నిత్యమాశ్రమపూజితాయ, జగద్ధాత్రే, జగత్కర్త్రే, పురుషాయ, శాశ్వతాయ, ధ్రువాయ, ధర్మాధ్యక్షాయ, త్రివర్త్మనే, భూతభావనాయ, త్రినేత్రాయ, బహురూపాయ, సూర్యాయుతసమప్రభాయ, దేవాయ, దేవాతిదేవాయ, చంద్రాంకితజటాయ, నర్తకాయ, లాసకాయ, పూర్ణేందుసదృశాననాయ, బ్రహ్మణ్యాయ, శరణ్యాయ, సర్వదేవమయాయ, సర్వతూర్యనినాదినే, సర్వబంధమోచనాయ, బంధనాయ, సర్వధారిణే, ధర్మోత్తమాయ, పుష్పదంతాయ, త్రిభాగాయ, ముఖ్యాయ, సర్వహరాయ, హిరణ్యశ్రవసే, ద్వారిణే, భీమాయ, భీమపరాక్రమాయ ఓం నమో నమః.

ను, స్థాణుండును, నీలకంఠుండును, పినాకియు, వృషభారూఢుండును, మ
హాక్షేయుండును, పురుషుండును, సర్వకామదుండును, కామారియు,
కామదహనుండును, కామరూపుండును, కపర్దియు, విరూపుండును,
గిరిశుండును, భీముండును, స్రగ్వియు, రక్తవాసుండును, యోగియు,
కాలదహనుండును, త్రిపురఘ్నుండును, కపాలియు, గూఢవ్రతుండును,
గుప్తమంత్రుండును, గభీరుండును, భావగోచరుండును, అణిమాదిగుణ
శాలియు, త్రైలోక్యైశ్వర్యదాయకుండును, వీరుండును, వీరహంతుండు
ను, ఘోరుండును, విరూపుండును, మాంసలుండును, పటుండును, మహా
మాంసుండును, వసోన్మత్తుండును, భైరవుండును, పరమేశ్వరుండును,
త్రైలోక్యడామరుండును, లుబ్ధుండును, లుబ్ధకుండును, యజ్ఞసూదనుం
డును, షణ్ముఖానురక్తుండును, ఉన్మత్తుండును, కృత్తివాసుండును, గజ
చర్మవసనుండును, క్షుబ్ధుండును, సర్పభూషణుండును, దాతయు, ఆలం
బుండును, బేతాలుండును, శాకినీపూజితుండును, అఘోరుండును, వై
త్యఘ్నుండును, ఘోరఘోషశాలియు, వనస్పతియు, భస్మాంగుండును,
జటిలుండును, శుద్ధుండును, భేరుండసేవితుండును, భూతేశ్వరుండును,
భూతనాథుండును, పంచభూతాశ్రితుండును, ఖగుండును, క్రోధియు,
నిష్ఠురుండును, చండుండును, చండీశుండును, చండికాప్రియుండును,
చండతుండుండును, గరుత్మంతుండును, నిస్త్రింశుండును, శరభోజనుండు
ను, లేలిహానుండును, మహారౌద్రుండును, మృత్యుండును, మరణాగోచ
రుండును, మృత్యుమృత్యుస్వరూపుండును, మహాసేనుండును, శ్మశానా
రణ్యవాసియు, రాగస్వరూపుండును, విరాగుండును, రాగాంధుండును,
వీతరాగుండును, శతార్చియు, సత్వుండును, రజుండును, తముండును,
ధర్ముండును, అధర్ముండును, వాసవానుజుండును, సత్యుండును, అస
త్యుండును, సద్రూపుండును, అసద్రూపుండును, అహేతుకుండును,

అర్ధనారీశ్వరుండును, భానుకోటిప్రభాశాలియు, యజ్ఞుండును, యజ్ఞపతియు, రుద్రుండును, ఈశానుండును, వరదుండును, శివుండు ననునీయష్టోత్తరశతమూర్తుల నేకాగ్రచిత్తంబున ధ్యానించుచుండెను.

భగవానుండగు కపర్ది యతిలోకంబగు నాతనితపంబునకు సంతుష్టుండై యాతని శూలాగ్రమునుండి దించి యమృతవర్షంబున నయ్యంధకుని సకలాంగకములను దనియించి సాంత్వనవచనంబులతో "దైత్యేంద్రా! నీయమనియమాదులును, శౌర్యధైర్యాదులును మెచ్చువచ్చినవి. ఓసువ్రతా! నీయభీష్టముం దెలుపుము. నన్నారాధించుభక్తులందఱును సకలపాపవిముక్తులై సకలాభీష్టసిద్ధు లగుదురు. ఇంతవఱ కెవ్వరు నిట్టికఠోరతపంబు చేసినవారు లేరు. కావున నీవు వరదానంబునకుఁ బాత్రుఁడవు. అసురేశ్వరా! నీవిట్టికష్టస్థితియందుండియు, త్రిసహస్రవర్షంబులు జీవంబుల నిల్పియుంటివి. ఇట్లు తపంబుచేఁ బుణ్యోపార్జనంబు గావించిననీవు చిరసుఖివయ్యెదవు" అని యానతిచ్చుటయు దైత్యనాథుండు పరమానందభరితుండును, కంపమానకళేబరుండును, కృతాంజలియునై "మహాదేవా! అవివేకముచే నేను పూర్వము నిన్నెఱుంగఁజాలనైతిని. రణరంగమున లోకగర్హితంబులగుకటువచనంబులచే నిన్నునొప్పించితిని. కామమోహితుండనై పార్వతీదేవింగూర్చి యనేకంబులగుదుష్టవాక్యంబులఁ బ్రయోగించితిని. అట్టినా యపచారంబుల నెల్ల క్షమింపుము. సాధుజనంబులు దుఃఖితులయెడల దయాళురుగదా—కృపణులును, దీనులును, భక్తులును దయకుఁ బాత్రులు. దేవా! నేను కృపణుఁడను; దుఃఖితుఁడను; మఱియు నిభక్తుఁడను. కావున నీకు క్షంతవ్యుఁడను. నన్నుద్ధరింపకున్నచో నీదివ్యనామము కళంకితము గాఁగలదు. జగజ్జనని యగుపార్వతీదేవియు నాయెడలఁ గ్రోధమును విడిచి కృపాకటాక్షంబులచే నన్నలరించుఁ

గాక! నేను మీక్రోధమునకుఁ బాత్రుఁడను గాను. సహూనులపైఁ గదా కోప ముపయోగింపవలసినది! నేను నికృష్టుఁడను, కామవర్జితులగు మీరుదారులు. దేవియును సర్వగుణవిభూషితురాలు. మీతో నాకెట్టిపోలికయును లేదు. నాయందు కోపమును విడువుఁడు! నే నెన్నఁడు నిఁక నిట్టియపరాధమును గావింపను. కామక్రోధాదివర్జితుండును, జరామరణరహితుండును, సంగ్రామదక్షుండును, మహాబలశాలియు నగునందీశ్వరునివలెనే నేనును మీకుఁ బుత్రతుల్యుఁడను. నాశరీరంబును, కుందేందుచంద్రకాంతపారముక్తాహారసన్నిభం బగుఁగాక! నానయనములు నిరంతరదేవీచరణకమలసందర్శనంబున ధన్యంబు లగుఁగాక! ఆ దేవియే నాకుఁ బరమగురుస్వరూపిణి యగుఁ గాక! నాకాత్మశాంతి లభించుఁగాక! నేనెప్పుడును, మీయెడలను, సకలదేవతలయెడలను, ప్రమథగణంబులయెడలను నిర్వైరుండనై నిరంతరయోగచింతారతుండనై మెలంగుచుండెదంగాక! నాకిఁక నెన్నఁడును విరుద్ధం బగువాసన జాతిస్మరణంబు లేకుండుఁగాక!” అని ప్రార్థించి యద్దానవేంద్రుండు మౌనియై పార్వతీపరమేశ్వరుల నేకాగ్రచిత్తంబున ధ్యానింపఁ దొడంగెను.

అప్పుడు రుద్రదేవుండు ప్రసన్నకటాక్షములం బరగించినంతనే యంధకున కాకస్మికముగాఁ దన పూర్వజన్మవృత్తాంతం బంతయును స్మృతిగోచరం బయ్యెను. తోడనే యాతని మనోరథంబు లన్నియుఁ బరిపూర్ణంబు లగుటయు నంధకుండు పార్వతీపరమేశ్వరులకుఁ బ్రణామం బాచరించి వారలచే నాఘ్రాతమస్తకుండై సంతుష్టుండును, జరితార్థుండు నయ్యెను. చంద్రశేఖరప్రసాదమువలన నాతనిసర్వాభీష్టములును సిద్ధించెను.

## —♦ రురుదానవసంహారము. ♦—

“ అశేషధాత్రియు, పతివ్రతయు, సత్యవ్రతయు, తపోన్వితయు నగుపార్వతీదేవి సర్వశక్తియయ్యును దన్నుఁదా నేల రక్షించుకొనఁజాలకుండెను? ఆమెను స్వయంభు వగుశంభుం డేల రక్షింపవలయును? సతీశిరోమణియు, పూజనీయయు నగు కాళికాదేవిప్రభావము గూడ సామాన్యమైనది గాదనియు, శివలింగమువలెనే యద్దేవియుఁ బూజ్యతమ యనియు వినియుంటిమే. అట్టిచో నామెకు స్వసంరక్షణశక్తి యేల లేకుండఁబోయినది? నీ వెఱిఁగినంతవఱకు మాయీసంశయమును నివారింపవలయును.” అని మునులు ప్రార్థించుటయు సూతుం డిట్లు చెప్పందొడంగెను.

మునివరులారా! ఎవ్వఁ డెవ్వ డట్టిశుభాశుభకర్మంబులం గావించునో యాతని కవ్వ డట్టిశుభాశుభఫలంబులు ప్రాప్తించుచుండును. ఒకానొకప్పుడు కృతఘ్నుం డగు రురుండను నసురుండును మలయాచలంబునఁ ద్రిలోకసుందరియు, స్తనభారవినమ్రయు, మత్తగజేంద్రగామినియు, పూర్ణేందువదనయు నగుదాక్షాయణిం గాంచి కామశరనిర్భిన్నహృదయుం డయ్యెను. ఇఁక నాతఁడు మనసు కుదురుపఱచుకొనఁజాలక యేవిధముగా నామెను బొందఁగలనను విచారముచేఁ బరితపింపనారంభించెను. పిమ్మట నాతఁడు దాక్షాయణీలాభముకొఱకు సూర్యప్రచండకిరణపరితప్తుం డగుచుఁ బదివేలవత్సరంబులు తపంబు గావించెను. అప్పు డాతని కేవస్తువునందును మమత్వంబు లేకుండెను. ఆతఁ డనాహారియై గ్రీష్మంబునఁ బాషాణంబుంబోలె జడత్వముఁ గాంచియుండెను. కొంతకాలమునకు బ్రహ్మదేవుం డాతనికిఁ బ్రత్యక్షమై “ ఓదైత్యేంద్ర! నీ వేల యీఘోరతపంబు గావించుచుంటివో నిస్సంకోచముగ నాయెదుట వచింపు” మనియెను. ఆ

మాటలు విని యారాక్షసేంద్రుండు ధ్యాననిమీలితనయనంబులతో
ఇనె ,, ఓలోకపితామహా! పరమానందముతో దాక్షాయణీదేవి నాకు
భార్యాత్వము నంగీకరింపవలయును. మహాదేవుం డగు శంకరుండు
చిరకాలము నాకు వశుండు గావలయును. దేవతలు క్రుద్ధులయ్యును
నా కెట్టియునిష్టమును జేయఁజాలకుండవలయును. స్త్రీలు కేవలము
ముగ్ధలును, బలహీనలును, నస్థిరధైర్యలును, పరాక్రమమును బ్రక
టించుటయం దసమర్థలును వీర్యవిహీనలు నై యుందురుగదా! అట్టి
స్త్రీలవలన నా కెన్నఁడు నెట్టిభయంబును లేకుండవలయును.” అని
యెను. భగవానుం డగుపద్మసంభవుం డావాక్యముల నాలకించి నవ్వు
చు ,, ఓదుష్టదానవా! నీకోరిక యెన్నఁటికిని ఫలించునది గాదు. పా
ర్వతి జగన్మాత. లోకత్రయంబునందును కాలత్రయంబునందును
బూజ్యురాలు. భగవంతుం డగుశంకరునకుఁగూడ నామె యనాయా
సంబుగ లభియింపలేదు. అట్లామె శంభునకు సులభముగనే వశ్యురా
లై నయెడల నితరరమణీమణు లగు జాహ్నవిని, సంధ్యాదేవిని, ఇందు
లేఖను నాతఁడు మస్తకమున నేల ధరియించియుండును? ఆమె దుర్ల
భురాలుగావుననే యాతఁ డితరకాంతల నెవ్వరిని బ్రేమింపకుండఁ గేవల
మామెనే యారాధించి తుద కర్ధాంగిని జేసికొనెను. కాఁబట్టి యట్టిదు
ర్లభవాంఛితమునుగోరి చెడిపోవకుము. నీకు బ్రదుకునందిచ్ఛయున్నచో
సుందరీమణులగు నచ్చరలతో విహరింపుము. అద్దేవి భయంకరకాళ
రాత్రి; ఆత్రిపురారి మహోగ్రుఁడు. తఱచు దురాశచే నామెను
సందర్శింప నేఁగుచుందువేని నీవు చెడిపోవుదువు.” అని యానతిచ్చి
ప్రజాపతి యంతర్హితుం డయ్యెను.

అనంతర మాదైత్యేశ్వరుండు మఱియొకసారి మహాఘోరం
బగు తపంబు శంభునిగూర్చి సేయ దొడంగెను. ఆతనితపోగ్నికీలలచే

మలయపర్వతము దారుణంబుగ దగ్ధంబు గాఁజొచ్చెను. భగవానుం
డగు పినాకియుఁ దత్తప్తాగ్నిదంతవ్యాప్తమానుండై భార్యాసహితంబుగ
భయంబుచే నటనుండి పలాయనుం డగుచుండెను. అప్పుడు గౌరీదేవి
స్వామి నుద్దేశించి "నాథా! ఏల యీభయపడి పాఱిపోవుట? స్వకీ
యపరిత్రాణంబుచే నియ్యనలజ్వాలల శమింపఁజేయు శక్తి గలిగియుండి
యు నీస్థలంబును విడిచిపెట్టిపోవుట యెందులకు?" అని పలికెను.
చంద్రశేఖరుండు పార్వతీవచనంబుల నాలించి "ప్రియా! ఈరుద్రుడా
వత్సరుండు నిన్నుఁ బొందు నాశచే నిట్టిఘోరతపంబు గావించుచున్నాఁ
డు. ఈతపంబువలన నాతనికి సచరాచరంబగు నీవిశ్వము నంతను ద
హింపఁగలుగు సామర్థ్యంబు చేకూరినది. నే నీవిషయమున నీకేమియుఁ
జెప్పఁజాలకున్నాను. దీని కేమైనఁ బ్రతివిధానంబు గావింపఁగలవేని
యతిశీఘ్రముగఁ దత్ప్రయత్నముసేయుము. ఓసుశీలా! నేను బద్ధాం
జలినై ప్రార్థించుచున్నాఁడను. నీ వనుగ్రహించి యీచరాచరప్రపం
చమును నన్నును, నిన్నును రక్షించుకొనుము. నే నిట్లు ప్రార్థించితి
నని నాపైఁ గోపింపకుము. నీ వాతాపసునియొద్దకుం బోయి నీయసా
ధారణసౌందర్యముచే నాతని విమోహితునిం గావించుటకుఁ బ్రయ
త్నింపుము. అట్లయినచో నాతనికి నియమభంగము గాఁగలదు.
తపఃప్రభావముగూడఁ దొంటికంటె ననేకాంశములఁ దగ్గిపోఁగలదు."
అని చెప్పెను. గౌరియు నమ్మాటల నాలించి యసమ్మతాశంకచే
నించుక భీతిల్లెను. కాని యంతలోనే క్రుద్ధురాలై ధైర్యమును దెచ్చు
కొని వింధ్యాచలమునుగూర్చి పోయెను. అచ్చట నైరావతసదృశం
బగు నొకగజరాజంబుతో నతిప్రకాండం బగునొకసింహ మతిదారు
ణంబుగఁ బోరాడుచు హస్తిరక్తమాంసంబులయందు దోఁగాడుచు
నుండెను. దేవి యాభయంకరసింహంబును సంహరించి గజేంద్రరక్త

లిప్తం బగువానిచర్మంబును కటిస్థలంబునధరియించెను. సింహశోణిత ముచే నామెకేశపాశ మశోకపల్లవజాలంబుం బురుడించుచుండెను. సింహచర్మాచ్ఛాదితం బగునామెయుదరం బతిస్థూలమై యామెయా కారమున కధికవికారముం గల్పించెను. అప్పు డాదేవి యత్యుగ్రంబు గ హుంకరించుచు రురుదానవుండు తపంబుసేయుచున్నగుహను సమీ పించి పదప్రహారంబులచేతను ముష్టిఘాతంబులచేతను కవాటార్గళభేద నంబుఁ గావించి ప్రళయకాలమేఘగర్జనముంబోని రౌద్రవికటాట్టహాస ముం గావించుచు సందర్శనమాత్రంబున విభ్రమితహృదయుం డగునా దైత్యాధముం గాంచి ‹‹ ఓపూర్వసురేంద్రా! నీవింతకాలమునుండి యు నెవ్వతెనుగూర్చి కఠోరతపంబును గావించుచుంటివో యాగౌరీ దేవి యిదిగో వచ్చి నీయెదుట నిలిచి యున్నది! ఏమి చేయవలయు నో యాజ్ఞాపింపుము. ఏతత్క్షణంబుననే నీయానతిని నిర్వర్తింపఁగలను. ఇంకను నేల యాయాసపడియెదవు. నీకోరిక యేమో తెల్పుము. సంకోచింపనలదు. ఓరాక్షసేశ్వరా! ఇంకను నధికతపంబు గావించిన నేమిఫలము? అత్యుత్తమం బగునీమనోరథంబును సఫలంబు గావింపు కొనుము.'' అనియెను.

రురుం డప్పలుకు లాలించి కన్నులఁ దెఱచి యొక్కసారి యా దేవీమూర్తిని సందర్శించి తోడనే సంజ్ఞాశూన్యుండై పడిపోయెను. కొంతసేపటి కాతఁడు ధైర్యముఁ దెచ్చుకొని ‹ ఓకాళరాత్రిస్వరూపిణీ! ఇట్టివికృతాకారమును ధరించిన నీ వెన్నఁడును గౌరివి కావని తోఁచు చున్నది. గౌరీదేవి చారుమూర్తి. ఆమెముఖము చంద్రబింబమువం టిది. ఆమెశరీరము కాంచనగౌరమైనది. ఆమెబాహుద్వయము మృ ణాళసదృశము. ఆమెకును నీకును నెట్టిపోలికయును లేదు. నీవసత్య మును బలుకుచున్నావు. పొమ్ము.పొమ్ము. నేను నిన్నుఁ బిలువలేదు.

నేను నాతపోగ్నిచే నీమూఁడులోకములను దహింపఁజేయుచున్నాను. ఇందువలన నీకేమినష్టము ? నీవు నీస్థానమునకు మరలిపొమ్ము. నాచే సేవింపఁబడకుండ బోఁ దలంపవేని నిన్నీక్షణంబుననే యమాలయం బున కనిపెదను.'' అని పలుకుచు నద్దానవుండు గదాధరుండై లేచి యోగసిద్ధయు గిరిరాజపుత్త్రికయు నగు నద్దేవిని బ్రహారించెను. దేవి యుఁ గ్రోధమూర్తియై ముష్టిఘాతంబులచే నయ్యసురుని నొప్పించెను. క్రమంబుగ వారిరువురకును ఘోరయుద్ధము సంప్రాప్త మయ్యెను. కొంతసేపటి కారాక్షసుండు పాషాణవృష్టిచేతను వృక్షజాలంబులచేతను పర్వతసమూహంబులచేతను జలాగ్నివర్షంబులచేతను విషజ్వాలాభీలం బు లగుసర్పంబులచేతను నద్దేవిని బీడింపందొడంగెను. క్రూరకర్ముం డును, క్రూరజంతుభక్షకుండును నగునద్దానవుండునయిత మాపార్వతీ దేవిచే నఖదంతవిదారితగాత్రుం డగుచుండెను. అయిన నాతఁడు తన రుధిరబిందువులచే నాత్మస్వరూపు లగు ననేకకోట్లదానవులను సృష్టిం చుచు నతిపరిభావసంయుక్తం బగుమహాసైన్యముగ నొనర్చెను. ఉమాదేవి యాసేనం గాంచి తనదేహమునుండియు వికృతరూపిణులగు భయంకరస్త్రీమూర్తులను సృజియించెను. వారందఱును మహాసైన్య ముగ నేర్పడి యొకచోఁ జేరి శత్రుసైన్యమును భక్షింపనారంభించిరి. క్షణకాలమున దానవసైన్య మంతయు నిశ్శేషమైపోయెను. దానవరుధి రమెల్ల నాస్త్రీమూర్తులచేఁ బానముసేయఁబడుటచే మరల నూతనదా నవసృష్టి కవకాశము లేకుండఁబోయెను. పిమ్మటఁ బవిత్ర యగు కాళీదేవి దానవమాయను దానవరుధిరమునుగూడ నాస్వాదించివైచి మాయావియు నద్భుతదర్పుండు నేకాకియు నగు నారురుదానవుని తో ఘోరతమం బగుయుద్ధమును గావింపందొడంగెను. అంతట నా సురద్వేషి కుపితుండై ప్రచండవాయురూపమును ధరియించి [illegible]

మునుండై బ్రహ్మలోకపర్యంతమును త్రిభువనంబులఁ దిరుగుచు క్షణ
కాలంబున మరలఁ బాతాళతలంబునఁ బ్రవేశించి యంతలో స్వర్గం
బున కెగసి యిచ్చవచ్చినరీతిని బరిభ్రమింపఁజొచ్చెను. మఱియు నద్దా
నవుండు కాలానలస్వరూపమును బొల్చి నలుదిక్కులఁ జరియింపఁదొ
డంగెను. అదియంతయుఁ గాంచి యద్దేవి క్షణమ్మై యాతని నెల్లయి
నఁ బట్టుకొనుటకై యతిస్థూలం బగునాకారమును ధరియించెను. ఆ
భయంకరవిశ్వమూర్తి ప్రళయకాలప్రచండప్రభాకరసహస్రశోభము, న
ప్రమేయంబును నై యుండెను. లోకేశ్వరుం డగు బ్రహ్మదేవుండు
నయిత మామూర్తిరోమకూపంబు లపరిమాణంబునైన గ్రహింపఁజాల
కుండెను. అట్టిభీషణమూర్తి యిదివఱకెన్నఁడును జనియించియుండ
లేదు. ఇఁక నెప్పటికైన జనియించు నని చెప్పుటకూడ నసంభవము.
ఆమెయుదరంబున బ్రహ్మాండంబులు బదరీఫలంబులవలె, నండంబుల
వలె, జలబిందువులవలెఁ బ్రకాశించుచుండెను. సంహారకర్త లగు
రుద్రాదులును పాలనకర్త లగు శివాదులును నయ్యుదర మాధ్యంబున
జలశీకరంబులవలెఁ గాన్పించుచుండిరి. అతివ్యమూర్తిచే నాక్రాంతుం
డై యద్దేవద్వేషి యొక్కయుగైనఁ గదల్పఁజాలక చేష్టావిరహితుం
డై యుండెను. అద్భుతప్రచండపరాక్రమవంతుం డగు నారాక్షసుం
డు గౌరీభుజాకృష్టగాత్రుండై నంతమాత్రముననే మూర్ఛితుం డయ్యె
ను. ఆసమయంబున కాత్యాయనీదేవి వజ్రసదృశంబులగు నఖాంకు
శంబులచే నాదైత్యునిమస్తకంబును ఛేదించి వానిచర్మంబుచేఁ దన
శరీరమునిండఁ గప్పుకొనియెను. బుద్బుదసంకలితంబు లగుదానవరక్త
ధారలచే సంసిక్త యగు నద్దేవీమూర్తి యతిలోకభయంకరమై యుం
డెను. ఆగౌరీదేవి యతిహృద్యం బగునాదైత్యరక్తంబును బానముచేసి
మాంసభక్షణంబునుగావించి యటనుండి కపాలహస్తయై వెడలిపోయెను.

అసంఖ్యప్రమథగణపరివేష్టితుండై భగవానుం డగుపినాకి తన ప్రాణేశ్వరి రాకకొఱకు మిగుల నాత్రముతోఁ బ్రతీక్షించుచుండెను. అంతట భగవతి యగుగౌరీదేవి యానందోన్మాదముతో స్వామిసమీపమునకుం బోయెను. ఆమెను గాంచినంతనే శంభుండు సంతుష్టచిత్తుండై చటాలున లేచి యామె కెదురేఁగి యద్దేవి నాలింగనంబుచేసికొని యామెచే నివేదితం బగు దానవరుధిరము నంకతలంబున నిడుకొని యిచ్ఛానుసారంబుగఁ బానంబుచేసి యున్మత్తుండై మరలఁ బార్వతిచేఁ గూడఁ గంఠస్ఫూర్తిగ రుధిరపానమును జేయించెను. దేవిచేఁ ద్రాగఁబడి యవశిష్టంబై యున్న దైత్యరక్తమును బరమప్రీతితో మరల నాశంకరుండు పానమొనర్చెను. ఆసమయంబున నద్దేవదేవుండు, గజసింహదానవశోణితంబులచే సంసిక్తంబులై యున్న సకలాంగకంబులతోడ నొప్పునద్దేవిం గౌఁగిలించుటచేఁ దాను నారక్తగాత్రుండై పూచినమోదుగులచే నిండిన హిమవద్గిరిరాజముంబోలి ప్రకాశించుచుండెను. అప్పుడు విశాలాయతలోచన యగుపార్వతీదేవి యద్భుతఖేలనార్థమై గజసింహచర్మంబులను మహాదేవునికి సమర్పణంబు గావించెను. పరమేశ్వరుండును సింహచర్మమును గటిప్రదేశంబున ధరియించి గజచర్మమును సర్వాంగంబులయందును గప్పుకొనియెను. దేవి యగుగిరిరాజపుత్త్రి యాదానవచర్మమును మేనం దాల్చి సఖీగణంబులతో విహరింపఁదొడంగెను. ఆసమయంబున సురసిద్ధసాధ్యగణంబులును దానవమానవగణంబులును ఋషిగణంబులును కిన్నరగణంబులును బద్ధాంజలులై యద్దేవిని స్తుతియింప నారంభించిరి. బ్రహ్మదేవుం డద్దేవిని పూజించి త్రిలోకరక్షణార్థం బామెను బ్రార్థింపందొడంగెను. అనంతర మాగౌరీదేవి భయంకరరూపమును బరిత్యజించి శరచ్చం

త్రిరేఖామనోజ్ఞమూర్తిం దాల్చి పరమానందముతోఁ బరమేశ్వరుని తో విహరించుచుండెను.

## —♦ బాణపరాజయము. ♦—

సూతుఁడు మునులతో నిట్లు చెప్పఁగా వా రాతనితో "ఓ సూతనందనా! ఈప్రపంచము శివాత్మకంబును, శక్త్యాత్మకంబునై యున్నది. మాయాసాధ్వసంబులచేతను, గుణదోషంబులచేతను, వీని లో నేశక్తి యధికమైనది? ఈసంశయము నివారింపవలయును." అని యడుగుటయు రోమహర్షణాతనయుండు వారిం గాంచి యిట్లనియెను. "ఋషివరులారా! ఈలోకమున స్త్రీలయందే గుణదోషములును, మాయాసాధ్వసంబులును విపులముగా నున్నట్లు ప్రత్యక్షముగ నే గోచరించుచున్నది. దీనిరహస్యమును దెల్పెదను వినుండు. స్త్రీపురుష భేదము గల సకలప్రాణులయంగములయందును డెబ్బదిరెండువేల నాడులుండును. వానిలో గర్భసంస్థితం బగునాడి యతిజఘన్యమైనది. దానినుండియే పురుషుఁడు జన్మించుచుండును. ఆనాడి యుండుటవల ననే స్త్రీలు గర్భధారిణు లగుదురు. స్త్రీపురుషసంయోగమువలన స్త్రీలనుండియే పురుషులు జనించుచుందురు. అట్లు స్త్రీలనుండిపుట్టు పురుషులు గుణదోషములచే స్త్రీలకంటె నధికు లెట్లు గాఁగలరు? లోకమునందు స్త్రీలు పురుషులచే నాచ్ఛాదిత లయ్యును ప్రధానలై యున్నారు. ఇవ్విషయంబున స్త్రీమాయావిజృంభితంబును, అనురూపంబును, బవిత్రంబును, శ్రోత్రసుఖావహంబును నగునొకయితిహాసంబును వచించెద నాకర్ణింపుఁడు.

తొల్లి భగవానుం డగుహరుండు బాణాసురనగరంబున దేవాసురగణపరివృతుండై రమణీయం బగుశోణనదీతీరంబున గంధర్వాప్స

రోగణంబులు నృత్యగీతంబులు గావించుచుండ, స్వేచ్ఛావిహారంబు
సల్పుచుండెను, మునిగణంబులు చేరి మహాదేవునకుఁ బ్రణామార్చన
స్తవంబు లర్పించుచుండిరి. ప్రముఖులందఱు సత్యోత్సాహముతో
గంతులువైచుచుండిరి. మహర్షులు హరఘోషములఁ గావించుచుండిరి.
సిద్ధగణంబులు శంకరునియాసక్తి సత్యోత్సాహముతోఁ జూచుచుం
డిరి. కుతార్కికులు వినష్టు లగుచుండిరి. శత్రువుల మొగంబులు వాడి
పోవుచుండెను. మహాత్మగణంబు లభిముఖంబుగ నిలిచియుండిరి. బిభీషి
కలు నశించుచుండెను. మహాదేవునియందు సద్భావము గలభక్తులకు
సంసారదోషంబులు నశించుచుండెను. ప్రజలందఱు సమ్మహాదేవుని
సందర్శించి పరమానందము నొందుచుండిరి. అప్పటినృత్యగీతాదిస్త్రీ
విచేష్టితంబులం గాంచి మునులును సిద్ధగణంబులునుగూడ నధీరు లగు
చుండిరి. ఋతువు లన్నియు నొక్కచోఁ జేరి స్వకాలోచితంబు లగు
లతాపల్లవకుసుమఫలాదులను వర్ధిల్లఁజేయుచు నాప్రదేశంబున కధిక
తరరామణీయకంబును గల్పించుచుండెను. మందానిలంబులు పుష్ప
కేసరంబులచే సువాసితంబులై యేతెంచుచుండెను. భృంగంబులు
ఝుమ్మన రొదసేయుచు నిటునటు సంచరించుచుండెను. కోకిలలు శా
ఖాపల్లవంబులచాటునఁ గూరుచుండి కుసుమభారవినమ్రంబు లగువృ
క్షంబుల మ్రాకులతరవయాఘ్నల నాస్వాదించుచుఁ బాడుచుండెను.
ఆకోకిలధ్వను లతిమధురములై యవ్వనోపవనంబులయందున్న యెల్ల
వారికిఁ గామోద్దీపకంబు లగుచుండెను.

చంద్రశేఖరుం డప్పుడు దుర్జయుం డగుకామదేవునిచే సున్మా
దితుండై హృష్టచిత్తంబుతో నందీశ్వరునిం బిలిచి ‘‘ ఓ వానరాననా !
నీ వీక్షణంబునఁ గైలాసంబునకుం బోయి కృతస్నానయు, నలంకృత
యు నగుగౌరీదేవిని నా చెంతకు శీఘ్రముగఁ దీసికొనిరమ్ము.” అని

యాజ్ఞాపించెను. నందీశ్వరుండును పరమేశ్వరుని యానతి నౌదలం దాల్చి కైలాసంబునకుఁ బోయి పార్వతీదేవిని సందర్శించి ప్రణమిల్లి "ఓ దేవీ! భగవానుం డగుత్రిలోచనుండు బాగుగ నలంకరించుకొనిన నిన్ను సందర్శింపఁగోరుచున్నాఁడు. కావున నీ విప్పుడే సుసజ్జితవై మనోవేగమున తదాంతికంబునకు రావలయును. ఆలస్యమైనచో నాతఁడు నన్నసమర్థునిఁగను, మిథ్యావాదిగను భావింపఁగలఁడు" అని విన్నవించెను. భగవతి యగుపార్వతి యమ్మాట లాలించినంతనే యలంకరించుకొనుట కారంభించెను. నందీశ్వరుండును దేవి కీవార్త నెఱింగించి మరలి మనోజవంబునఁ బ్రభుసన్నిధికిం బోయెను. అంతఁ డొక్కఁడే వచ్చుటం గాంచి రుద్రుండు దేవి నతిరయంబునఁ దీసికొని రా మరల నాజ్ఞాపించెను. నందికేశ్వరుండు వల్లె యని సులోచన యగు గౌరిచెంతకు మరలఁ బోయి ప్రభునియాదేశము నిట్లు విస్పష్టముగ వాక్రుచ్చెను. "ఓ దేవీ! అలంకృతవును, మనోహారిణివి యు నగునిన్ను శీఘ్రముగఁ గొనితేర శంకరుం డత్యుత్సాహముతో నాజ్ఞాపించుచున్నాఁడు" అని మనవిచేసెను.

నందికేశ్వరుండు మహాదేవు నెడఁబాసి గౌరిచెంతకుఁ బోయిన సమయమున శంభుదేవునిసన్నిధినున్న యచ్చరలు మహేశ్వరునికామాతురత్వముం గాంచి తమలోఁ దా మిట్లాలోచించుకొనిరి. "భగవానుండగు పినాకి కామారి యయ్యును గామపీడితుండై యున్నాఁడు. కావుననే మాతృప్రముఖంబగు దివ్యనారీగణంబునకు జ్యేష్ఠస్వరూపయు, నతిలోకసుందరీమణియు నగుపార్వతీదేవిని సందర్శింప నుత్సుకుం డగుచున్నాఁడు. ఆదేవిరూపవిలాసంబులు సర్వోత్కృష్టంబులుగదా! కావుననే కామదేవుం డామె నవలంబంబుగఁ జేసికొని మహాదేవునిఁ దనకుసుమశరంబులచే వేధించుచున్నాఁడు. కానిచో మహాకాలుని కని

ష్టంబుఁ గావించుట కాతఁ డెట్లు సమర్థుఁ డగును?" అని యనుకొను
చు "నారాయణిగాక మఱియేరమణీమణి యిమ్మహాదేవుని స్పృశిం
చుటకు సమర్థురాలు గాఁజాలును?" అని ప్రశ్నించుకొనిరి. కుంభాం
డతనయయు, మాయాచతురయు నగు చిత్రలేఖ యమ్మాటల నా
లించి తటాలున లేచి "నేను గౌరీరూపమును ధరించి యీపరమేశ్వ
రుని స్పృశింపఁగలను. ఆదేవి సఖులరూపంబుల నింకెవ్వ రైనను ధరి
యింపవచ్చును. కాని నందీశ్వరునిరూపము నింకెవ్వరుధరింపఁజాలు
దురు?" అని పలికెను. ఆమాటలు విన్నంతనే నారాయణోరుసంభవ
యగునూర్వశి వైష్ణవయోగావలంబనంబున నందికేశ్వరరూపముం దా
ల్చెను. ఆమెరూపపరివర్తనముం గనుఁగొని తక్కినయువతు లందఱు
ను దమరూపములను మార్చుకొనుట కారంభించిరి. ఘృతాచి కాళికా
రూపంబును, విశ్వాచి చండికారూపంబును, ప్రమ్లోచ సావిత్రిరూపం
బును, మేనక గాయత్రీరూపంబును, సహజన్య జయారూపంబును,
పుంజికస్థలి విజయారూపంబును, క్రతుస్థలి వినాయకరూపంబును గ్ర
మంబుగ ధరించిరి. వారిరూపంబులు కృత్రిమంబు లని యనుమానిం
చుటకు గూడ నశక్యంబులై యవికలభావంబునఁ బరివర్తితంబులై
యుండెను. తక్కినయచ్చర లందఱును మాతృకారూపంబులం దాల్చిరి.

పిమ్మటఁ జిత్రలేఖ వైష్ణవయోగంబునఁ జిత్రకళానైపుణ్యంబు
మెఱయ నత్యద్భుతంబుగఁ బార్వతీమనోహరాకృతిని ధరియించెను.
అప్పు డామెచరణద్వయము రక్తాంగసన్నిభంబును, మృదులంబును నై
దివ్యత్వంబును, నసాధారణత్వంబును గాంచియుండెను. అమితసౌభా
గ్యమయంబు లగుగుల్ఫములును నంగుళులును మనోజ్ఞంబులై చరణ
శోభను ద్విగుణీకృతంబు నొనరించుచుండెను. నఖకాంతులు చంద్ర
ప్రభల నీనుచు దిగంతముల వ్యాపించుచుండెను. దివ్యనూపురఘణ

ఝణత్కారములు నలుదెసల వ్యాపించుచుండెను. హ్రస్వంబులును వర్తులంబులును సూక్ష్మంబులు నగు జంఘలు మిగుల రమణీయంబులై యుండెను. ఆదివ్యరూపంబు స్వర్ణకాంత్యుజ్జ్వలమై దివ్యమణిభూషణాలంకృతమై, దివ్యవసనాచ్ఛాదితమై, శశికోటిసంకాశమై, పుష్పమాలికాసుశోభితమై, యతిలోకరమణీయమై, వర్ణనాతీతమై సాక్షాద్గౌరీరూపంబుం బోలియుండెను.

అప్పుడు నందికేశ్వరరూపమును ధరియించినయాపార్వతి సమయమునుచూచి యీశ్వరుని దర్శించి తనకటాక్షబాణంబులచే నాతని వివశుంగావించి ‘దేవదేవా! మాతృగణసహితంబుగ గౌరీదేవిం దోడ్కొనివచ్చితిని. కృపాకటాక్షంబులచే ననుగ్రహింపవలయును.’ అని విన్నవించుటయు రుద్రుండు పరమానందభరితుండై శయ్యనుండి లేచి పార్వతీదేవి కభిముఖంబుగ నేడడుగులు ముందు నడచెను. అప్పుడు బ్రహ్మాదిదేవతలును, దేవదానవమునిగణంబులును, ఋషీశ్వరులును, సిద్ధులును, స్తోత్రపాఠములు సేయుచుం బార్వతి కభిముఖంబుగ నడువనారంభించిరి. ఆసమయంబునం బినాకపాణి యగు శివుండు పార్వతీకరగ్రహణంబుం గావించి, శయ్యామందిరమునకుం దోడ్కొనిపోయి, పర్యంకమునం జేర్చి యామెతో ననేకవిధంబులం గ్రీడించుచుండెను. మాతృకారూపంబులం దాల్చినయచ్చరలు రుద్రదేవునికి నలువంకల నిల్చి నృత్తగీతంబు లొనర్చుచు, నాదంపతుల శ్రోత్రంబులం దనియించుచుండిరి. దేవీరూపముం దాల్చినచిత్రరేఖయు నీశ్వరునితోం గలిసి మధురగళరవంబులు సేయుచు నుత్సాహమును వర్ధిల్లంజేయుచుండెను. వేయేల? ఈకృత్రిమమాతృకాగణంబును, కపటగౌరీదేవియుం దమతమచేష్టలయందు చాపల్య మించుకంతయుం గానరాకుండం బ్రవర్తించుచుండిరి.

ఆసమయంబున శంకరారాధనాతత్పరులగు నందీశ్వరాదిప్రమథ
గణంబులు మాతృకాగణసహితంబుగ నచ్చటికి విచ్చేయఁజొచ్చిరి.
అత్యద్భుతాలంకారవిభూషిత యగు గౌరి సఖీజనపరివృతయై వియన్మా
ర్గంబున భర్తృసన్నిధానమున కరుదెంచెను. దేవీస్తవంబులఁ గావించు
చు వచ్చుచున్న నంది, భృంగి, లంబోదర, దండి, మహాకాళాదులు
దేవీద్వయము నాకస్మికముగఁ గాంచి విస్మితులై పోయిరి. వారిలో
సత్యదేవి యెవ్వతెయో యెవ్వరును నిర్ణయింపఁజాలకుండిరి. ఆమూ
ర్తిద్వయమునందు నెంతమాత్రమును భేదము గానవచ్చుట లేదు.
ఉభయపక్షంబులయందున్న నందీద్వయంబునకును, మాతృగణద్వ
యంబునకును, ప్రమథగణద్వయంబునకును నెట్టివ్యతిక్రమమును గా
న్పించుట లేదు. అప్పుడు మహాదేవునిపార్శ్వంబునకు వచ్చి నిల్చియు
న్న పార్వతీదేవి దివ్యనారీగణంబులతోఁ గ్రీడించుచున్న భర్తృవ్యతిక్ర
మమును గ్రహించి పరిహాసింపనారంభించెను. ఆనందముచే మత్తిల్లి
యున్న యప్సరోగణంబులు కిలకిలారవంబును గావింపఁబోడంగెను.
భూతప్రేతపిశాచయక్షరాక్షసగణంబులుగూడ నానందకోలాహలంబు
నొనర్పంగడంగిరి. బాలేందుశేఖరుం డగుశివుం డది యంతయు నాల
కించి యంతయుం గాంచి పరమానందభరితుం డయ్యెను. అప్సరోగ
ణంబులక్రియాకలాపంబులుగూడ నట్టే యాతనికిఁ బ్రీతికరంబు ల
య్యెను.

పిమ్మట నూర్వశియుఁ, జిత్రలేఖాప్రభృతులును స్వస్వరూపము
లం దాల్చి స్వచేష్టితంబుల నెప్పటివలెఁ గావింపఁజొచ్చిరి. మహాదే
వుం డింతవఱకును రమణీగణంబులచే వంచితుండై యీమణ్మాత్రిం
బగు సంతోషంబును గాంచియుండెను. ఇప్పుడు దేవిం గాంచినంతనే
ఖారంవఱను దమకాఁట్యమునుండి విముక్తులైరి. సద్భావశాలిని

యగు గౌరీదేవి యప్పుడు భర్తృసహితయై నదీతటంబునకుఁ బోయి యత్యద్భుతంబుగ యథేచ్ఛంబుగఁ గ్రీడింపనారంభించెను.

బాణాసురదుహిత యగు నుషాదేవి యాసమయంబున నచ్చటికి వచ్చి భక్తితోఁ గ్రీడించుచున్న పార్వతీదేవిం గాంచి భర్తృసమాగమవాంఛ యుదయించుటయుఁ దనమనంబున 'అహా! ఈగౌరీదేవి వలె నిజరమణులతో రమించు రమణీమణులే ధన్యలు. వారిజన్మమే సాఫల్యముం గాంచునది.' అని భావించుకొని నియమాసక్త యగు నామె యుపవాసాదులచే విజితేంద్రియయై యుమాదేవి నారాధింప నారంభించెను. నగరాజనందన యగుభగవతి యామెయభిప్రాయము నెఱింగి యత్యంతప్రీతచిత్తయై పరమాదరంబున నామెకు సాక్షాత్కరించి 'కుమారీ! అనిందితం బగునీనదీతటంబున భర్తతోఁ గలిసి నేనెట్లు విహరించుచుంటినో యచిరకాలంబున నీవు నట్లే పతిసహితవై విహరింపఁగలవు' అని యానతిచ్చి యంతర్హిత యయ్యెను. అద్దేవివాక్యంబుల నాలించియు నయ్యుషాదేవి తనకంతసౌభాగ్యము లభించునని విశ్వసింపఁజాలక చింతించుచు 'నేనుమందభాగ్యురాలను. ఇట్టిసుఖ మెన్నఁటికైన లభించునను నాశ నాకు లేదు.' అని నిరుత్సాహయై చింతించుచుండ దేవి యామెయింగితమ్ము నెఱింగి మరల దర్శనంబిచ్చి 'ఓమానినీమణీ! ఈకార్తికమాసంబునకు సప్తమం బగు వైశాఖమాసంబున శుక్లపక్షద్వాదశీదివసంబున భయంకరనిశాసమయంబున నుపవాసాలసవు, నంతఃపురనిద్రితవు నగునిన్ను స్వప్నావస్థయం దెవ్వఁడు రమియించునో యాతఁడే నీభర్త యగు నని దేవతలచే నిశ్చయింపఁబడియెను. నీ వాతనితోడనే కలసిమెలసి సుఖంబుగ నుందువు. చిన్నతనమునుండియు విఘ్నదేవు నారాధించుచున్నపుణ్యముచే నీమనోరథ మచిరకాలముననే సఫలంబు గాఁగలదు." అని భో

ధించుటయు నక్కన్యారత్నంబు లజ్జావశంబున నేమియు మాటాడకేక
క మనంబున 'నట్లే యగుఁగాక' యని యనుకొనుచుఁ దనయభీష్ట
దేవతం గూర్చి ప్రార్థించుకొనుచు సుఖంబున నుండెను.

భగవానుం డగు రుద్రుండు క్రీడావసానంబగుటయు నటనుండి
దేవీ, గణ, దానవసహితంబుగ నంతర్హితుండయ్యెను. సకలస్త్రీగణం
బులును మహాదేవునియపూర్వక్రీడానుభవంబును గాంచి సంతుష్టచిత్తం
బులతో గజాశ్వరథారూఢులై నిజావాసంబులకు నిర్గమించిరి. సిద్ధ
యోగినులును గగనమార్గంబున వెడలిపోయిరి.

అనంతరము కొంతకాలంబునకు బాణాసురుండు మహాదేవుని
సన్నిధికిం బోయి యయ్యుమాకాంతునిం బూజించి కృతాంజలిపుటుం
డై దురదృష్టవశంబున నైనగర్వంబుతో విచారసూచకంబుగ 'ఓవృ
షభధ్వజా! తగినయుద్ధములు లభియింపనప్పుడు పర్వతసారం బగునా
యీ బాహుసహస్రంబు వలన నేమిప్రయోజనము గలదు? పూర్వము
వీనిబలముచే యముని భటునిఁగాఁ జేసికొంటిని; అనలుని వశీకృతు
నిఁ గావించుకొంటిని. వరుణుని గోరక్షితునిఁగాఁ జేసివైచితిని; కుబే
రుని గజాధ్యక్షునిఁగను, నిరృతిని పుష్పమాలాకరునిఁగను నొనర్చితిని.
ఆఖండలుండు పరాజితుండై నాకుఁ గప్పములను గట్టుచున్నాఁడు. ఇఁక
నాకెచ్చట మహారణము లభించునో యనుగ్రహించి యానతీయవల
యును. నీవు సర్వజ్ఞుఁడవు. నీ కవిదితం బగునది యేదియును లేదు.
సముత్కృష్టాదృంభితంబు లగు నాయీబాహువులు మహాహవరంగము
న శత్రుకరవినిర్ముక్తంబు లగుశస్త్రాస్త్రసమూహములచే జర్జరితములై
భూపతితములైనఁ గావలయును. కాదేని శస్త్రసహితముగ శాత్రవ
కరములను సహస్రధా ఖండింపనైన ఖండింపవలయును." అని వేఁడు
కొనుటయు రుద్రుం డాతనివచనములకుఁ గుపితుండై మహోస్ఫారముగ

నట్టహాసమును గావించుచు "ఓదానవాధమా! నీవు గర్వాంధుండ
వై తివి. అచిరకాలముననే నీకు ఘోరతరం బగు మహాసంగ్రామము
లభింపఁగలదు. ఆరణంబునఁ బర్వతంబులవంటి నీసహస్రబాహువులు
మ శత్రుశస్త్రంబులచే గడ్డికాడలవలె విచ్ఛిన్నంబులై భూపతితంబు
లు గాఁగలవు. అప్పుడు నీగర్వంబు భంగంబు నొందును. నీయాయు
ధాగారంబునఁ బ్రతిష్ఠితంబై యున్న మానుషశిరస్సహితం బగు మ
యూరధ్వజము పవనోద్ధూతంబు గాకుండఁగనే యెప్పుడు భూతలపతితం
బగునో యప్పుడు నీకు మహాసంగ్రామంబు సంప్రాప్తించు నని గ్ర
హించి సేనాసహితంబుగ యుద్ధయాత్ర గావింపుము. ఇప్పటి కింటికిఁ
బొమ్ము. ఓ దుర్మతీ! ఆసమయంబున మఱియు ననేకంబులగు మ
హోత్పాతంబు లుత్పన్నంబులు గాఁగలవు." అని యానతిచ్చెను.
బాణాసురుం డవ్వాక్యంబు లాలకించి దివ్యకుసుమాంజలులచే నద్దేవు
నర్చించి సెలవు గైకొని తనరాజధానికిం బోయి ముందుగ నాయుధా
గారంబునం బ్రవేశించి, యచ్చటఁ గుండలుం డనుతనమంత్రిం గాంచి
జరగినవృత్తాంతమంతయు వర్ణించి చెప్పెను. మఱికొంతసేపటికి మ
యూరధ్వజము నిర్నిమిత్తంబుగ నేలపయిం బడెను. దానిం గాంచి
బాణుండు మహాదేవునివాక్యంబులం దలంచి సంతుష్టహృదయుండై
నిలుపోపక శీఘ్రంబున యుద్ధసన్నద్ధుండగుచుండెను. అతఁడు తనలో
నిట్లు తలపోసెను. "ఎవ్వఁ డెచ్చటనుండి యేల నాతో యుద్ధమునకై
రాఁగలఁడు? రణప్రియుండును, బహుశస్త్రాస్త్రవేదియు నగునేయోధా
గ్రేసరుండు నాబాహుసహస్రంబును తృణసమూహమువలె ఛేదించు
టకు సమర్థుం డగును? సునిశితాస్త్రంబులచే నేనాతనిమస్తకచ్ఛేదనం
బుఁ గావించెదను." అని యాతఁడు నిరంతరమును దలపోసికొను
చుండెను.

ఇట్లుండ నాతనికిఁ గాలస్వరూపం బగువైశాఖమాసము కాల క్రమంబున సమాగతం బయ్యెను. అందొకనాఁడు బాణతనయ సుస్నాతయై మంగళాచరణంబు గావించి విష్ణుదేవు నారాధించి రాత్రిసమయంబున సువర్ణశోభితం బగునంతఃపురంబున నిదురించియుండెను. ఆసమయంబునఁ బార్వతీమాయచే శ్రీకృష్ణపౌత్రుం డగుననిరుద్ధుం డామెచెంతకుఁ గొనితేఁబడియెను. అక్కుమారుం డారమణీమణి సుందరాకారంబునకు ముగ్ధుండై బలవంతముగ నామె నుపభోగించెను. అనంతరము నిమేషములో గౌరీసఖు లాతని మరల ద్వారకకుం గొనిపోయి విడిచిరి. పిమ్మట నుషాకన్య మేల్కాంచి శయ్యవదలి సఖులచెంతకుం బోయి వెక్కి వెక్కి యేడ్చుచు సర్వవృత్తాంతమును వారి కెఱింగించి మానభంగశంకచే దేహత్యాగంబు గావించుటకై కృతనిశ్చయ యయ్యెను. అప్పుడు సఖు లామె నూఱడించుచు "కుమారీ! నీశీలమునకు భంగము కలిగెననియు దోషము సంప్రాప్తించె ననియు సంశయింపకుము. పార్వతి నీకిట్టి భర్తృసమాగమమునే విధించియుండెనుగదా! నీ వాపూర్వవృత్తాంతమును స్మృతికిఁ దెచ్చుకొనుము. నీసకలసంశయములను వదలిపోఁగలవు." అని ప్రబోధించిరి.

అప్పు డుషాకన్య మనసు కుదురుపఱుచుకొని ప్రహృష్టచిత్తయై చిత్రలేఖం గాంచి మధురవచనంబులతో "సఖీ! పార్వతీదేవి యీతనినే నాకుఁ బతిఁగాఁ జేసియున్నమాట నిజమే. కాని నేనాతని నేయుపాయముచే రహస్యముగాఁ బొందఁగలుగుదును? నాహృదయమును హరించిపోయిన యాసుందరాకారుఁ డేకులమువాఁడో యెవ్వఁడో యించుకంతయు నే నెఱుంగను. అట్టివానిని గ్రహించి తెచ్చుట కెద్దియైన నుపాయ మాలోచించి నాయుత్కంఠ నపనయింపుము." అని వేఁడికొనుటయుఁ జిత్రలేఖ "రాజకుమారీ! నీవు స్వప్నములోఁ

గాంచినయాతఁ డెవ్వఁడో నాకెట్లు దెలియఁగలను? అట్టివా నాతనిఁ
గొనితెచ్చుట యెట్లు పొసంగును?" అనియెను. ఆమాట లాలించి
యుషాదేవి హతాశయై రాగాతిశయముచే మరణోద్యుక్తురాలయ్యెను.
ఆమె యవస్థంగాంచి చిత్రలేఖ భయపడి యనేకంబు లగుసాంత్వన
వచనంబులచే నామెను బ్రబోధించి "సఖీ! ఏడుదినంబులలో నీపదు
నాలుగులోకంబులం గలసుందరాకారులగుపురుషమూర్తుల నొకపటం
బున లిఖియించి తెచ్చెదను. అందు నీమనోహరుం డెవ్వఁడో కనుఁ
గొని నాకుఁ దెలిపెదవేని వానిని నామాయాబలంబున నీసన్నిధికిం
దోడితెచ్చెదను. విచారింపకుము." అని యూఱడించెను.

అనంతరము యథోక్తసమయంబునకుఁ జిత్రలేఖ తననేర్పు
మెఱయఁ జిత్రపటంబులను దెచ్చి యుషాదేవికిఁ జూపెను. ఆమె యా
చిత్రరూపంబుల నేకాగ్రచిత్తంబునఁ బరిశీలించుచు నందు దేవదా
నవమానవరాజకుమారులఁ బరీక్షించుచు నొక్కచోఁ దనచిత్తచోరుని
మనోజ్ఞచిత్రముం గాంచి దానిని వ్రేలితోఁ జూపుచుఁ జిత్రలేఖ నుద్దే
శించి "ఆతఁడే యాతఁడు! ఈతనికులశీలప్రవర్తనంబులును, నామం
బును వర్ణించి చెప్పవలయు" నని ప్రార్థించెను. చిత్రలేఖ సర్వము
నామెకు నివేదించెను. అది విని ప్రేమానురాగనిమగ్నయగు నుషా
కన్య "సఖీ! ఎవ్వనివియోగముచే నే నొకనిముసమైనను దేహమునఁ
బ్రాణముల నిలుపుకొనఁ జాలకుంటినో అట్టిదుర్లభపురుషుని సులభ
ముగ గ్రహించుటకుఁ దగినయుపాయమేది? ఆతఁడు రాక్షసారాతి
యగుమురారిపౌత్రుఁడు. ఆతనితోడి సంబంధము మన కసంభవము
గదా! చూచిచూచి నాతండ్రి యాతండు నాకు విభుండగుట కంగీక
రించునా? ఒకవేళఁ బుత్రికాప్రేమచే నాతఁడ్రి దానికియ్యకొనుఁ
గాక! అభిమానధనుం డగు ననిరుద్ధుండు నన్నుఁ జేపట్ట సమ్మతించు

నా? ఎట్లు చూచినను నాకు మరణమే శరణ్యముగాఁ గానవచ్చుచు
న్నది." అని కన్నీరుమున్నీరుగా విలపింపసాగెను. స్నేహమయియగు
చిత్రరేఖ యతిమధురంబు లగువచనంబుల నామె నాశ్వాసించి యతి
త్వరితంబుగ నీయభీష్టంబును దీర్చెద నని మాట యిచ్చి, సెలవు గై
కొని దివ్యయోగంబుచే మనోవేగంబున ముహూర్తకాలములో ద్వార
కానగరంబునఁ బ్రవేశించెను. అటు కొంతసేపటివఱకు నందందు
వెదకివెదకి యామె క్రమంబున నంతఃపురోద్యానంబునఁ బ్రవేశించి
యనిరుద్ధుని సందర్శించెను. అక్కుమారుం డప్పుడు రమణీజ ంబుల
తోఁ గలసి మద్యపానంబుఁ గావించుచుండెను. చిత్రరేఖ తనమా
యాప్రభావంబుచే నంధకారపటంబున నాతని నాచ్ఛాదించి వివశుం
జేసి యొరు లెఱుంగకుండ శయ్యాసహితంబుగ నాతనిఁ దనశిరంబుపై
నిడికొని యొక్కనిమేషంబున బాణనగరంబునకుం గొనితెచ్చెను.

ఉన్మత్తభావంబున క్షణక్షణంబునకును నూత్నాభిలాషలచే ను
వ్విళ్లూరుచున్న యయ్యుషాకన్య సఖీసమానీతుం డగుచిత్తచోరు
నాకస్మికంబుగ సందర్శించి యంతఃపురసురక్షిత యయ్యును నవసమా
గమంబున కత్యంతభీతచేతస్కయై యుండెను. అంతం గొంతసేపటి
కనిరుద్ధుండును మేల్కాంచి విస్మితుం డయ్యును దనయెట్టయెదుట నతి
లోకరమణీయాకారముతో నొప్పారుచున్న యుషాకన్యం గాంచి యను
రాగంబు పొంగార నామె నుపలాలించి యభీష్టోపభోగంబులఁ దేలి
యాడుచుండెను. క్రమముగా నంతఃపురపాలకుల కివ్విషయం బంత
యుఁ దెలిసిపోయెను. వారు లోపలఁ బ్రవేశించి రాజకన్యాసహితుం
డై రెండవమన్మథుండుంబోలె వెలుంగుచున్న యయ్యనిరుద్ధకుమారు
నిం గాంచి క్రోధజ్వలితమూర్తులై యతిశీఘ్రంబున దానవేంద్రునిపా
లికిం బోయి, మహారాజా! ఎవ్వఁడో తరుణయువకుం డగునొకపురు

షుఁడు పరాక్రమవంతుండ నగునీయంతఃపురమున రహస్యంబుగఁ బ్ర
వేశించి రాజకన్యాసహితుండై విహరించుచున్నాఁడు. నీవు స్వయ
ముగ వచ్చి యాతనియౌద్ధత్యమునకుఁ దగిశిక్షం గావింపుము.' అని
విన్నవించిరి. బాణాసురుం డవ్వార్త నాకర్ణించి యతివిస్మితుండై
చటాలున నంతఃపురంబుం బ్రవేశించి యిందీవరశ్యాముం డగునొక
యువకుండు తనతనయతో విహరించుచుండుటం గాంచి నివ్వెఱపడి
క్రోధాతిరేకంబునఁ గొంతసేపేమియు మాటాడఁజాలక పిమ్మట స్వస్థ
తం గాంచి యట్టహాసంబుసేయుచుఁ గింకరులం గనుంగొని ॥ దానవ
వీరులారా! ఈయువకునిరూపవిలాసంబులును, ధైర్యసాహసంబులును
నలౌకికంబులుగాఁ దోఁచుచున్నవి. ఈమానవాధముఁడు నాకన్యను
హరించి నాకులాచారమును గూల్చివైచినాఁడు. కావున మీరీతని
నతిశీఘ్రముగ నిశితశరంబులచే విగతాసుం గావింపుఁడు. భటులారా!
దురాచారి యగునీపామరు నీక్షణంబ బంధించి కొంతకాలము కారా
గృహంబునఁ బడవేయుఁడు." అని యానతిచ్చెను. మఱియుఁ బాప
బుద్ధి యగుబాణాసురుం డప్పు డవ్వీరవరుని వధించుటకై దశసహస్ర
దానవసైన్యమును సమకూర్చెను.

అంతఃపురగతుం డగునయ్యాదవేంద్రుండు భీషణగర్జారవంబు
లతో ద్వారదేశాగతం బగుశత్రుసైన్యంబును గాంచి గదాహస్తుండై
వజ్రహస్తుం డగునంతకునింబోలి యంతఃపురభవనంబు వెలువడి గదా
ఘాతంబులచే సకలదానవసైన్యంబును గసిమసంగి మరల లోపలఁ
బ్రవేశించి ప్రసన్నవదన యగునుషాకాంతతో ముచ్చట లాడుచు
నామెం గౌఁగిలించుకొనియెను. దైత్యేశ్వరుం డగుబాణుం డవ్వార్త
నాలించి క్రోధావేశంబున ననిరుద్ధవధార్థము రణదుర్మదు లగు లక్ష
సైనికులను మరలఁ బంపించెను. మహావీరుం డగు నయ్యనిరుద్ధుండు

వారినిగూడ నవలీలగ నంతకాలయంబున కతిథులఁ గావించివైచెను. బాణదైత్యుం డిఁక నూరకుండఁజాలక యక్షణంబ లేచి శుద్ధాంతంబునఁ బ్రవేశించి మహాబాహుం డగు ననిరుద్ధకుమారునిఁ దనతో ద్వంద్వయుద్ధంబున కాహ్వానించెను. పిమ్మట యోధాగ్రేసరుం డగు కృష్ణపౌత్రుండు రణప్రాప్తం బగుఖడ్గంబుఁ గైకొని యద్దానవేశ్వరుని దశసహస్రాశ్వంబులను రథంబులను సైనికులను వినాశంబు గావించెను. అదియంతయు నవలోకించి యసురేశ్వరుండు కుపితుండై కాలాగ్నిసదృశం బగుశక్తి నాతనిపైఁ బ్రయోగించెను. వీరశిరోమణియగు ననిరుద్ధుండు శత్రువినిక్షిప్తం బగునాశక్తిని మధ్యపథంబుననే గ్రహించి దానినే యద్దానవనాయకునిపైఁ బ్రయోగించెను. బాణుం డాశక్తిచే నాహతుండై యక్షణమే రథోపరభాగంబున మూర్ఛాగతుం డయ్యెను. అది యంతయుం గనుంగొని మంత్రి భయప్రకంపితుండై జలసేచనవీజనాదులచే నాతనికిఁ జైతన్యంబుఁ గలిగించెను.

అప్పుడు బాణాసురుండు తేఱుకొని యటనుండి పలాయితుం డయ్యెను. దుర్జయుం డగుప్రద్యుమ్ననందనుం డప్పుడు చతుర్దిశలను దృష్టిక్షేపంబొనర్చుచుఁ బర్వతముం బోలి నిశ్చలుండై యుండెను. కాని మాయావి యగు నద్దనుజేశ్వరుం డదృశ్యుండై వివిధాస్త్రంబులచే ననిరుద్ధుని వేధించుచుఁ దుదకాతని నాగపాశబద్ధు నొనరించి రణనివృత్తుం డయ్యెను. పిమ్మట నాతఁడు తనమంత్రిం గాంచి 'ఓయమాత్యశేఖరా! అదురాత్ముండు నాకులాచారమును దూషితముం గావించెను. నీవు తత్క్షణంబ యాతని సర్వాంగకంబులతోఁగూడ మస్తకచ్ఛేదనంబుఁ గావించి రాక్షసులకుఁ బంచిపెట్టుము. వలదు. వలదు. కలుషాత్ముండగు నీతనిమాంసము క్రవ్యాదులకుఁగూడ భక్షణయోగ్యంబుగాదు. కావునఁ బాపాత్ముం డగు నాతని నగాధంబును

దృణసంకీర్ణంబును నగుకూపమధ్యంబున నిక్షేపింపుఁడు. ఇదియే యాతనికిఁ దగినశిక్ష." అని యాదేశించుటయు ధార్మికశ్రేష్ఠుం డగుకుంభాండుండు "దేవా! ఇది యుచితము గాదు. ఈతని వధించినచో నిశ్చయముగా మనమందఱమును నిహతులము గావలసివచ్చు నని తోఁచుచున్నది. ఈతఁడు సామాన్యమానవుఁడు గాఁడు. పరాక్రమంబున విష్ణుసదృశుండును సాహసంబున రుద్రసమానుండు నై యున్నాఁడు. ఈయవస్థలోఁగూడ నతఁడు పౌరుషమునుండి చలించుటలేదు. భుజంగసందష్టుండయ్యును, మనలనందఱను దృణప్రాయులనుగాఁదలంచుచున్నాఁడు" అని యసురేశ్వరునకు నచ్చఁజెప్పి యనిరుద్ధుని చెంతకుం బోయి "ఓదురాచారా! నీపేరేమి? నీవెవ్వనితనయుఁడవు? నిన్నెవ్వరిచ్చటికిఁ గొనితెచ్చినారు? సర్వవృత్తాంతమ్మును సవిస్తరమ్ముగ నెఱింగింపుము. ఓవీరశిరోమణీ! నీవు కృతాంజలిపుటుండవై దానవరాజేంద్రునకు నమస్కరించి స్తుతించుచు నేను నీచేఁ బరాజితుండ నైతి నని క్షమాప్రార్థనంబు గావింపుము. నీబంధమోచనంబున కిది యొక్కటియే మార్గంబు గాన్పించుచున్నది" అని వాక్రుచ్చెను.

అట్టియవమానకరవచనంబుల నాకర్ణించి "ఓరోరి పరపిండోపజీవీ! దురాచారా! దానవాధమా! నీవు క్షాత్రధర్మం బించుకంతయు నెఱుంగనివాసవలెనున్నావు. కావుననే నాకు నీవిట్లుపదేశించుచున్నావు. వీరగణంబులకు శత్రువులయెదుట దైన్యప్రకటనంబును, పలాయనంబును నొనర్చుట యపకీర్తికరంబులు. అట్టిపనులు మరణముకంటెను నీచములైన వని నేను భావించుచున్నాను. క్షత్రియజనంబులకు మరణక్షేత్రంబున శాత్రవాభిముఖంబుగ మరణించుటజీవించుటకంటెను శతగుణాధికప్రశంసనీయమైనది. శత్రువునెదుట నంజలి యొగ్గి దీనత్వమును బ్రకటించుట యెన్నఁడు నుచితము గాదు. అట్లు

జేసినను నాతనికి మృత్యువు దప్పనదిగాదు. దైవవశంబుననే మరణం
బు ఘటిల్లుచుండును. ఎవ్వండునుగూడ దైవవ్యతిరిక్తంబుగ నెవ్వరికి
ననిష్టంబు సేయంజాలఁడు. ఓ మందబుద్ధీ! నీవు నాకుఁ బరమశత్రుండ
వు. ఇవ్విషయమున నాకు నుపదేశించుటకు నీ కధికారము లేదు.
నోరు మూసికొని యూరకుండుము. దానవసహస్రమే కాదు. సచరా
చరం బగునీత్రైలోక్యంబునుగూడ నెవ్వనిసందర్శనమాత్రంబున భ
యప్రకంపితంబై యంజలియొగ్గి బహిర్ద్వారంబున నిల్చియుండునో
యట్టిమహావీరుఁడా, యితరులయెదుటఁ బరాజయము నంగీకరించుట?
ఈరాజేంద్రునిబాహుబలం బంతయును విచ్ఛిన్నం బైనపిమ్మట నీవు
స్వయముగ నాపరిచయమును గ్రహింపఁగలుగుదువు." అని యదువీ
రుం డగు ననిరుద్ధుండు ప్రత్యుత్తరం బిచ్చి మౌనావలంబనంబుం గా
వించెను. బాణాసురుండును మంత్రిప్రార్థనమును మన్నించి యనిరు
ద్ధుని వధింపక విడిచి యంతఃపురమునకుంబోయి యొడలు తెలియ
కుండ మద్యపానంబు గావింపఁదొడంగెను.

విషాభీలం బగు నాగపాశముచే బద్ధుండై యున్నయనిరుద్ధుండు
తనప్రాణేశ్వరి యగునుషాకన్యను దలంచుకొనుచు నుత్తలపడుచుండె
ను. అతని కీసర్పవిషబంధంబుకంటె సతీవియోగవిచారమే దుర్భరముగా
నుండెను. ఆదుఃఖము నాతఁడు సహింపఁజాలక భగవతి యగుదుర్గా
దేవిం దలంచుకొని ॥ ఓదేవీ! నేను నాగపాశబద్ధుండనై యితరు లె
వ్వరు నెన్నఁడు ననుభవించి యెఱుంగని దుస్సహక్లేశము ననుభవించు
చున్నాను. దయామయి వగునీవు శరణాగతుండ నగు నాకు సాక్షా
త్కరించి యీదారుణవిపత్సముద్రమునుండి నన్నుద్ధరింపుము." అని
ప్రార్థించుటయు భిన్నాంజనప్రభాశాలిని యగు కాళీదేవి ప్రసన్నయై
జ్యేష్ఠమాసంబునఁ గృష్ణపక్షంబునఁ జతుర్దశినాఁటినిశీధసమయంబున

సదృశ్యరూపంబుతో నచ్చటి కేతెంచి యతిదారుణంబులగు ముష్టిప
ద్ఘాతంబులచేఁ గారాగారమునకడ్డముగనున్న లోహదండములను
జూర్ణీకృతంబులుగఁ జేసి భయంకరసర్పశరంబులను భస్మంబు గావించి
నిమేషమాత్రంబున ననిరుద్ధుని విపద్విముక్తునిగా నొనర్చి కన్యాంతః
పురంబునకుం జేర్చి యాక్షణంబుననే యంతర్హిత యయ్యెను. సంత
షితుం డగు ననిరుద్ధుం డప్పుడు మరలఁ బ్రియాసమాగమంబుఁ గాంచి
యానందసాగరతరంగములం దేలి యాడుచుండెను.

ఇట ద్వారకానగరంబున ననిరుద్ధునిగానక యంతఃపురస్త్రీజనం
బులును, జననీజనకబంధుమిత్రాదులును దుస్సహదుఃఖనిమగ్నులగు
చుండిరి. ఆసమయంబున దేవర్షియగునారదుం డచ్చటి కేతెంచి శ్రీ
కృష్ణదేవుని సందర్శించి యెల్లవృత్తాంతము నాతనికి సవిస్తరంబుగ నెఱిం
గించెను. ఆవార్త విన్నంతనే యబ్జనాభుం డెంక నిలువఁజాలక యాక్ష
ణంబుననే గరుడు నాహ్వానించి బలదేవప్రద్యుమ్నసహితంబుగ గరు
డవాహనారూఢుండై బయలుదేఱి ముహూర్తమధ్యంబుననే బాణ
నగరంబునఁ బ్రవేశించెను. అట నవ్వీరమూర్తులకు ముందుగ వైశ్వా
నరునితోడను, యమునితోడను, హరునితోడను, త్రిముఖునితోడను
త్రిపాదజ్వరంబుతోడను, గుహునితోడను, వివిధాకారులగుప్రమథ
వీరులతోడను నతిదారుణంబగుమహారణంబు జరిగెను. మఱియు భీష
ణమూర్తులును, దిగంబరలును, నిర్లజ్జలు నగునేకస్త్రీజనంబులతోఁ
గూడ వారికి మహాహవంబు సంఘటిల్లెను. అనంతరము బాణాసురుని
తో సంగ్రామంబు గలిగెను. అప్పుడు విజృంభించి పైఁబడుచున్న
మాహేశ్వరంబులును, దారుణంబులు నగుజ్వరాములను గోవిందుం
డవలీలగ స్వకీయంబు లగుజ్వరాదులచే నడంచివైచుచుండెను. గరు
త్మంతుండు సహస్రమూర్తులం దాల్చి సాగరోదకంబులఁ బానముచేసి

వచ్చి భీకరానలజ్వాలలఁ జల్లార్చుచుండెను. మఱియు నాతఁడు సునిశి
తంబును, సుదృఢంబు నగు తనచంచుపుటంబుచేఁ గుమారునివాహ
నం బగుమయూరమును జీల్చివైవందొడంగెను. ఆఘోరయుద్ధంబున
రుద్రదేవుండు పుత్త్రసహితంబుగను, గణసహితంబుగను, విష్ణుదేవుని
చేఁ బరాజితుండై పోయెను.

అప్పుడు బాణాసురుండు మంత్రిచే సన్నద్ధంబు గావింపఁబడిన
యుత్తమాశ్వము నధిరోహించి పరాక్రమంబు దీపింప శ్రీకృష్ణునితో
ద్వంద్వయుద్ధమునకుం దలపడియెను. భగవానుం డగు వాసుదేవుం డా
సమయంబునఁ ద్రిలోకభీకరంబగుసుదర్శనచక్రముం గైకొని యారాక్షసే
శ్వరునిసహస్రబాహువులను తృణంబులవలె ఖండించి మస్తకచ్ఛేదంబు
గావింపుట కుంకించుచుండెను. అదిచూచి భక్తవత్సలుం డగుపార్వ
తీశ్వరుండు వివిధంబులగుస్తోత్రపాఠంబులచే విష్ణుదేవుని స్తుతించుచు
బాహుద్వయమును బైకెత్తి “ఓదేవా! దేవకీనందనా! నీయుద్దిష్టం
బగుకార్యము సంపన్నం బైనది. ఇఁక నీబాణాసురుని బ్రాణావశిష్టు
నిగా విడిచిపెట్టుము. నీచక్రాయుధము నుపసంహరింపుము. పూర్వ
కాలంబున నేను నీకు రణరంగంబున మహాబలంబును, చక్రాయుధం
బును, జయంబును బ్రసాదించి యుంటిని. కావున నీవిప్పుడు నా
మాట విని మహారణంబునుండి నివృత్తుండ వగుము. నీవు భక్తవత్స
లుండవు. సాక్షాత్పరమాత్మస్వరూపుండవు. సర్వభూతహితవ్రతుండ
వు. మద్భక్తుం డగునీబాణాసురునకు నేనమరత్వమును బ్రసాదించి
యుంటిని. ప్రభూ! నీవు నాయెడల సంతుష్టుండవైతివేని నావచనం
బులసత్యత్వమును నిలుపుము.’ అని ప్రార్థించుటయు విష్ణుదేవుండును
జక్రాయుధంబు నుపసంహరించి రణస్థలంబు విడిచి దానవాంతఃపురం
బునకుఁ బ్రవేశించి యనిరుద్ధు నాశ్వాసించి మణికనకసమూహంబుల

తోడను, జితరేఖాసహిత యగునుషాదేవితోడను మనుమని వెంటఁ
బెట్టుకొని బయలుదేఱిపోయి మార్గమధ్యంబున వరుణదేవుని బరాభూ
తుం గావించి కొంతకాలంబునకు ద్వారకానగరంబునఁ బ్రవేశించెను.

శ్రీకృష్ణుం డరిగినపిదప బాణాసురుండు విఖండితబాహుసహా
స్రుండై యొడలెల్ల రక్తధారలందోఁగుచుండఁ బ్రాణావశిష్టుండై బాధ
పడుచుండుటయు నందికేశ్వరుం డాతనిం గాంచి జాలిపడి "బాణే
శ్వరా! దుస్సహంబులగు గాయంబులచే నీకాయంబంతయును శోషి
ల్లియున్నది. ఈబాధను నీవు భరింపఁజాలవు. భక్తవత్సలుం డగుపర
మేశ్వరునిసన్నిధికి నీవిప్డే పోయి నీనైపుణ్యంబు మెఱయ నర్తనంబు
గావించి యాతని కానందంబు గావింపుము. భగవానుం డగుశంక
రుండు నృత్యప్రియుండు గావున నాతఁడు నీనృత్యంబునకు మెచ్చి
నీకాక్షణంబుననే బాధోపశమనంబు గావింపఁగలఁడు." అని బోధిం
చెను. బాణుం డాక్షణంబుననే పరమేశ్వరునిసన్నిధికిం బోయి యాలీఢ
ప్రత్యాలీఢాదిపదక్రమభేదంబు లేర్పడఁ దాండవించుచు భ్రూఁయు
నాదివిక్షేపంబులచేతను, కరవిన్యాసశిరఃకంపాదులచేతను నభినయిం
చుచు, ముఖవాద్యాదులచే గానము చేయుచు భూతలం బంతయు
రక్తసిక్తంబు గావింపం దొడంగెను. భక్తవత్సలుండగుభవానీప్రియుం
డసాధారణంబును గరుణరసమయంబు నగునయ్యసాధారణనర్తనకుం
గాంచి ప్రసన్నుండై "దనుజేశ్వరా! నేను నీయెడల సంతుష్టుండ
నైతిని. వరప్రార్థనంబు గావింపుము." అని యనుగ్రహించెను.

బాణుండును బరమానందభరితుఁడై "మహాదేవా! నాబా
హువ్రణబాధ యీక్షణంబుననే యుపశమించుఁగాక. నాకభయం
బగుగాణాపత్యలాభంబుఁ బ్రసాదింపవలయును. ఉషాపుత్రుండు నా
రాజ్యంబున కధీశ్వరుండు గావలయును. దేవగణంబులతో నాకెట్టి

శత్రుత్వమును లేకుండవలయును. నాకుఁ బరమపవిత్రంబగు విష్ణుభక్తి లభించుఁగాక. కల్పాంతంబున విష్ణుదేవునిచే మరణించునట్లును మరల ఋజుస్త్రమోడూషితంబగు దానవజన్మము నాకుఁ గలుగకుండునట్లు నను గ్రహింపుము. అని ప్రార్థించెను. శివుం డాతనిమనోరథంబు లన్నియుఁ గ్రమంబుగ సిద్ధించున ట్లనుగ్రహించి యంతర్హితుం డయ్యెను. బాణాసురుండు గాణాపత్యలాభంబుగాంచి పరమానందంబుతోఁ గాలక్షేపము సేయుచుండెను. కొన్నాళ్ళ కుషాగర్భంబున విశ్వజితుం డనుతనయుం డుదితుండగుటయు శ్రీకృష్ణానుమతంబున దానవప్రధానులందఱును బాణరాజ్యంబున కాతని నభిషిక్తుం గావించిరి. ఆతనివంశంబున నుదయించినరాజులందఱు ననిరుద్ధసంతతిగాఁ బరిగణింపఁబడుచుండిరి. ఉషాచిత్రలేఖలును, విశ్వజితుండును, అనిరుద్ధుండునుగూడఁ గల్పావసానంబున శివసాయుజ్యంబుఁ గాంచిరి. మునివరులారా! గురుగణంబులకు గురుస్వరూపుండును, దిగ్లోచనుండు నగుశంకరుని యీదివ్యచరిత్రమును మీకు సవిస్తరంబుగ వినిపించితిని. కామారణ్యనివాసులుం డగునమ్మహాదేవుండుగూడఁ గామపీడితుండు గాక తప్పినదిగాదు.

## —♦ కామతత్వము. ♦—

అని సూతుండు చెప్పుటయు మునివరు లెల్లరును విస్మితులై «సూతనందనా! వాయ్వగ్నిజలమాయామనోహంకారప్రకృత్యాత్మకుండును, హృదయస్థుండును, అంగుష్ఠమాత్రపురుషమూర్తియు నగు మహాదేవునిగూడ ముగ్ధునిం గావింపఁజాలిన యీకామదేవుం డెట్టివాఁడో సవిస్తరంబుగఁ దెలిపి మమ్మనుగ్రహింపవలయును.” అని ప్రార్థించుటయు సూతుం డిట్లు చెప్పందొడంగెను.

మహర్షిశేఖరులారా! బ్రహ్మవిష్ణుశివాత్మకంబును, సర్వభూతాత్మకంబును, ద్విలింగంబును, విశ్వమూర్తియు నగుదివ్యశక్తియే కామస్వరూపము. బ్రహ్మయైనను, విష్ణుండైనను, శివుండైనను, సూర్యచంద్రులైనను నాతని విడిచి యేకార్యంబును జేయఁజాలరు. సంకల్పమే కామము. యజ్ఞము, శిక్ష, స్వాధ్యాయము, జ్ఞానదానములు, శ్రుతి, స్మృతి, అశుచి, పరపీడనము, స్వర్గము, మోక్షము, పరిగ్రహము, స్నేహము, వైరము మొదలగున వన్నియుఁ గామదేవుని ప్రభావంబుచేతనే కలుగుచుండును. ఆతఁడే మనోభవుఁడు. అష్టవిధంబులగుదేవజాతులును, మానవులును, బంచవిధంబు లగుతిర్యగ్జాతులును గూడఁ ద్రికాలంబులయందును గామప్రభావంబుచేతనే యుద్భవించుచు, వర్ధిల్లుచు, విలయంబుఁగాంచుచు నుండును. ఇట్లు చతుర్దశభేదంబులం గాంచియున్నజీవులలోఁ బరస్పరాసక్తంబులగు నఖిలమిథునహృదయంబులయందును గామదేవుండు బహురూపంబులతో విరాజిల్లుచుండును. ఈజగంబున రమణీయంబులును, నిస్సారకుసుమోపమంబులు నగువిషయాభిలాషలుగల బ్రహ్మేంద్రోపేంద్రరుద్రాదులయందును, దేవదానవమానవగంధర్వోరగాదులయందును గామదేవునిప్రభావ మవ్యాహతంబుగఁ గొనసాగుచుండును. ఈజగంబున నాతనికి భిన్నంబైన దేదియును లేదు. బంధువులు, ఆచార్యులు, రక్షకులు, నాయకులు, దాతలు, గురువులు, కల్పకములు, సోదరులు, తల్లిదండ్రులు, యముఁడు వైతరణి, నరకము, నందనము మొదలగున వన్నియు జీవులసంకల్పసంభవంబు లగుకామస్వరూపములే. కామతత్త్వంబును సంపూర్ణంబుగ వర్ణించుట కెవ్వరికిని సాధ్యంబు గాదు.

కేవలంబును, బుద్ధిగమ్యంబును, ఆనందమయంబును, అమృతస్వరూపంబును, దివ్యంబును, అర్కేందుప్రభవంబును, తమోవినాశ

తంబును, శాశ్వతంబును, జ్ఞానానందస్వరూపంబు నగువానిని దత్త్వవే
త్తలు బ్రహ్మముగా నిర్దేశించి యున్నారు. ఆబ్రహ్మమునుండియే
బ్రహ్మేంద్రోపేంద్రాదులును, మానవులును, క్రిమికీటకాదులును,
పశుపక్ష్యాదులును సంభవించుచున్నవి. వానివికారములే కామస్వ
రూపములు. ఎవ్వఁడు జీవులహృదయస్థుండై జాగ్రదవస్థయందును,
నిద్రావస్థయందును వివిధకర్మంబులఁ గావించుచుండునో యాతఁడే
బ్రహ్మంబనియుఁ దత్కర్మసమూహం బంతయుఁ గామస్వరూపం
బనియుఁ బెద్దలు చెప్పుదురు. బ్రహ్మవివర్తస్వరూపం బగుమాయాశ
క్తియే కామకారణం బగుచున్నది. ప్రియాప్రియరూపంబులును,
ఇష్టానిష్టంబులగు రసగంధాదులును విషయమూలంబున నెవ్వనిచే నను
భూతంబు లగుచుండునో యాతఁడే పరమాత్మ. విరూపుం డగువా
తఁడు కర్తయు కర్మయు నగుచున్నాఁడు. అందు, గర్మంబు నశిం
చును గాని కర్తయెన్నఁటికిని నశింపఁడు. చిత్రకారుఁడు చిత్రసహస్రం
బుల విలిఖించునట్లే పరమాత్ముండు భిన్నభిన్నంబు లగుజీవసహస్రం
బుల సృజించుచుండును. అతఁడేకమాత్రుం డయ్యును భోజ్యభో
క్తృభేదంబులచే ద్వివిధంబుగఁ దోఁచుచుండును. కాని తత్త్వజ్ఞులగు
వారు కేవలమాత్రనిభోక్తృస్వరూపమునే దర్శించుచుందురు. ఈజగం
బునఁ గానవచ్చుచున్న భిన్నస్వరూపంబులును, భిన్నవ్యవహారంబులు
నుగూడఁ బరమేశ్వరవ్యతిరిక్తంబులు గానేరవు. ఈవిషయంబున సంశ
యింపంజనదు. నిరాకారంబును, మహాఘోరంబును, స్వసంవేద్యం
బును, బరంబును, ధ్రువంబును, దివ్యత్త్వ నగుబ్రహ్మమునుండియే
విశ్వంబును, గామంబును, నిచ్ఛాజ్ఞానక్రియాశక్తులు నుత్పన్నంబు
లయ్యెను.

బ్రహ్మసంభవుం డగుకామదేవుండు దేవయుగంబున శుక్లవర్ణుం

డును, చతుర్భుజుండును, శంఖచక్రగదాపద్మధరుండును, చతుర్ముఖుం
డును, సువర్ణమణికుసుమాలంకృతుండునునై లక్ష్మి, సరస్వతి, రతి,
ప్రీతి, కీర్తి, శాంతి, పుష్టి, తుష్టి, గరుత్మంతుఁడు మున్నగువారిచే
బరివృతుండై విరాజిల్లుచుండెను. అతఁడు కృతయుగంబున శ్యామ
సుందరుఁడును, పూర్ణేందువదనుండును, దివ్యలావణ్యలోచనుండును,
కుంచితాసితకుంతలుండును, మణిహేమభూషితుండును, పాశాంకుశధ
నుర్బాణహస్తుండును, రక్తాక్షుండును, క్షీరసాగరనిలయుండును నై
లక్ష్మి, భద్ర, సుభద్ర, రుక్మిణి, రతి మొదలగు వారితోఁ గలసి ప్రద్యు
మ్న నామంబున జగత్ప్రియుండై విలసిల్లుచుండెను.

ఒకప్పుడు దేవతలు చంద్రశేఖరుని తపోభంగంబు గావించుటకై
యామన్మథుని జంద్రప్రభానగరికిం బంపించిరి. ఆక్షణంబుననే మద
నుండు పుష్పశరాదులచే సన్నద్ధుండై మహాదేవుని సమీపించుటయు
రుద్రుండు కన్నుదెఱచి యతనిం గాంచి 'నీవెవ్వఁడవు? ఎవ్వరిచే
నిటకుఁ బంపఁబడితివి?' అని ప్రశ్నించెను. 'నేనెవ్వఁడనో క్షణములో
నీకే తెలియఁగలదు.' అని కాముండు బదులుచెప్పెను. నీ వెందు
కొఱకిటకు వచ్చితివని త్రిలోచనుండు మరల నడుగుటయు నిన్ను
మోహింపఁజేయుటకై వచ్చితినని మీనకేతనుం డుత్తరం బిచ్చెను.
ఎట్లు నన్ను మోహితుం గావింపఁగలవని శంకరుండు మరలఁ బ్రశ్నిం
చెను. మద్బలంబుచే విముగ్ధుం జేసెదనని కుసుమశరుండు వాక్రుచ్చెను.
నీ బలం బెట్టిదని హరుండు మరల నడుగుటయు మారుండు తన
శాంతశరంబులం జూపుచుఁ బ్రసూనబాణంబులచేఁ బరమేశ్వరుని
వక్షోభాగమును భేదించుట కుద్యుక్తుండగుటయు భగవానుండు క్రోధా
తిశయంబున భీషణాకారుండై విజృంభించెను. ఆక్షణంబుననే యద్దే
వుని తృతీయనయనమునుండి మహాజ్వాలలు బహిర్గతంబులై సొక్క

నిమేషమధ్యంబునకనే యక్కామదేవుని దగ్ధుంగావించివైచెను. అప్పుడు ప్రజాపతితనయ యగురతి పతివియోగంబు సహింపంజాలక యనేక విధంబులఁ బరిదేవనంబు గావించుచు నమ్మహాదేవుని స్తుతింప నారంభించెను. పతిపరాయణ యగురతిదేవిస్తోత్రపాఠంబులకుఁ బార్వతీవల్లభుండు ప్రసన్నుండై 'ఓరమణీమణీ! నీవు మయునిమందిరంబునఁ బునర్జన్మంబు గాంచి శంబరాసురునిచే వంచితవై ద్వాపరయుగాంతంబున మరల భర్తృలాభంబు గాంచఁగలవు' అని యనుగ్రహించెను.

రుద్రదేవుని నేత్రానలంబుచే విదగ్ధుండైన కామదేవుండు మరల విష్ణుమందిరంబున రుక్మిణీగర్భంబునఁ బ్రద్యుమ్నుండై జనించెను. శ్యామసుందరుండును, సర్వభూతమనోహరుండు నగునక్కుమారుండు పుట్టినతోడనే మాయావి యగుశంబరాసురుం డాతని నెత్తికొనిపోయి మాయావతి కర్పించెను. పూర్వరతియగు మాయావతి యాబాలుని బెంచి పెద్దవానిం గావించెను. క్రమంబుగఁ బ్రద్యుమ్నుండు పెద్దవాఁడై యసమానంబులగు తనబలవిక్రమంబుల మెఱయించి మహారణంబున శంబరుని సంహరించెను. అప్పుడు శివానుగ్రహంబున మాయావతి యగురతికి మరలఁ బతిసమాగమంబు లభించెను. ప్రద్యుమ్నుండును బత్నీలాభంబు వడసి పూర్వస్మృతింగాంచి పరమానందంబున శంబరాసురుని సంపత్తినంతయుం గైకొని దారసహితుండై ద్వారకానగరంబునకు విచ్చేసెను. శత్రునిహతంబుగా మహావైభవంబుతో నట్లు వచ్చినకుమారుం గాంచి తల్లిదండ్రులగు రుక్మిణీకృష్ణులును, బంధుమిత్రపరివారజనంబులును బరమానందసాగరనిమగ్నులైరి. పిమ్మట శ్రీకృష్ణసాహాయ్యముచేఁ బ్రద్యుమ్నుండు శంబరనగరంబునఁ బట్టాభిషిక్తుండై యాదానవరాజ్యమును సక్రమంబుగఁ బరిపాలించుచుండెను.

అంతఁ గొంతకాలంబునకుఁ బ్రద్యుమ్నుండు ద్వారకానగరం
బునఁ బుష్పోద్యానంబునం దొకనాఁడు విహరించుచుండ శంబరుం
డనునొకదానవుండు తనమాయాబలంబుచే నాతని నపహరించి తన
సోదరుం డగునిశుంభుకడ కొనిపోయి 'ఓయీ! ఈపసివాఁడు
నీయాహారంబునకుఁ దీసికొని వచ్చితిని. నీవతిశీఘ్రంబుగ నీతని
భక్షించి యాఁకలిం దీర్చుకొనుము' అని యొప్పగించెను. నిశుంభుం
డాక్షణంబుననే ప్రద్యుమ్నుం బట్టుకొని క్రిందఁబడవైచి చంపుటకై
బలవంతముగ నాకసంబున కెగురవైచెను. వీరశ్రేష్ఠుం డగుకృష్ణనం
దనుం డట్లు క్షిప్తుండై క్షణకాలంబులోపలనే శైలాగ్రసంస్థితంబగు
నిశుంభనగరంబునం దొక్కచో నిపతితుండయ్యును బ్రాణంబులఁ
బాయక మెల్లగ లేచి యిటునటుఁ దిరుగుచు నట మనోహరాకారి
ణియు, లక్ష్మీనామయు నగు దానవరాజకన్యం గాంచి యుద్యానవన
విహారంబుచేయుచున్నయామెయెడ బద్ధానురాగుండై క్షత్రధర్మంబు
మెఱయ నక్కన్యకామణిం గైకొని వింధ్యాచలంబునకుఁ బలాయి
తుండై పోయెను.

దనుజేశ్వరుం డగునిశుంభుం డవ్వార్త నాలించి క్రోధావిష్టుండై
త్రిలోకసంచారు లగునసురవీరుల నలుదెసలకుం బంపి వెదకించి వారి
వలనఁ బ్రద్యుమ్నుం డున్నచో టెఱింగి ప్రబలసేనాసహితుండై య
చ్చటికిం బోయి దారుణసంగ్రామంబు చేసి తుదకు విష్ణునందనుని
విజితుం గావించి భార్యాసహితంబుగ నాతని నటనుండి వితస్తానదీ
తీరంబునకుంగొనిపోయి హిమాలయశృంగంబున వజ్రపంజరంబున నాగ
పాశంబులచే బంధించి బలిష్ఠులగు దానవభటసహస్రంబుల నటఁ గా
పుంచెను. విషమవిషజ్వాలాభీలంబు లగునాగపాశంబులచే నట్లు బ
ద్ధుండై దుస్సహయాతనల ననుభవించుచున్న ప్రద్యుమ్నుం డవ్వా

యుపాయాంతరముం గానక మహాబలయు, విష్ణుశక్తిస్వరూపిణియు నగు
దుర్గాదేవిని నిశ్చలభక్తిపూర్వకంబుగాఁ బ్రార్థింపఁ దొడంగెను.

భక్తవత్సల యగు పార్వతీదేవి యాతనిప్రార్థనంబునకు సంతుష్ట
యై యట సాక్షాత్కరించి పరమానుగ్రహంబుచే నాప్రద్యుమ్నుని
బంధవిముక్తునిం గావించుటకై యావజ్రపంజరంబునఁ బ్రవేశింపవల
యునని యెన్నియోవిధములఁ బ్రయత్నించెను. కాని యెంతమాత్ర
మును లాభము లేకపోయెను. అది యభేద్యంబు లగునస్త్రశస్త్రాదు
లచే నిర్మింపఁబడి యుండెను. లోపలఁ బ్రవేశించినఁ గాని, వెలుపల
నుండి యెట్లును దానిని భేదించుట యసాధ్యముగా నగపడుచుండెను.
అప్పు డద్దేవి మధురస్వరసమంచితం బగుమనోహరశారికారూపముం
దాల్చి యఖిలభూతహృదయాంతరములు నానందపల్లవితంబులగునట్లు
గా గానము చేయ నారంభించెను.

ఆమధురగానము నాలకించి శుంభతనయ యగు లక్ష్మీదేవి తన
యంతఃపురరక్షకుం డగు నొకదాసునిం బిలిచి "ఓయీ! ధీమం
తుండ వగునీవు రాజకుమారి నగు నాయెడలఁ బ్రేమగౌరవంబులు గల
వాఁడవు గాన నాకును నీప్రభువునకును వినోదార్థంబుగా నీశారిక నెట్లయినఁ
బట్టుకొని తెచ్చియిమ్ము!" అని యాజ్ఞాపించెను. కంచుకి యగునద్ద
నుజుండు దైత్యతనయయాదేశమును శిరంబునం దాల్చి యాక్షణంబు
ననే యవలీలగ నాశారికను బట్టుకొని తెచ్చి లక్ష్మీదేవి కర్పించెను.
లక్ష్మియు మహానందంబుతో నాశారికం గైకొని వినోదించుచుండె
ను. ఆశారికముద్దుపలుకులకు దానవేశ్వరుం డగుశుంభుండును సంతు
ష్టుండై దానికి వజ్రపంజరంబునం దొకచోఁ గోటరంబు గల్పించి యం
దాగోతవంక నుంచి పెంచుచుండెను. అట్టి యవకాశంబు తనంతన
లభించుటయు నమ్మాయాశారిక యొకనాఁడు కోటరమార్గంబున నులు

వుగ వజ్రపంజరమధ్యంబునఁ బ్రవేశించి తత్క్షణంబుననే యతిభీకరం బగుదుర్గామూర్తిం దాల్చి దేవదానవుల కభేద్యం బగునాపంజరంబును జీర్ణీభూతంబుగఁ జేసి యద్దేవి మరల నిందీవరశ్యామంబును, నతిలోకరమణీయంబు నగుగోపకన్యామూర్తిం దాల్చి యడ్డుపడినదానవవీరులనందఱను విదళింపఁదొడంగెను. యువతీమణి యగుకాళికయు నద్దేవికి సహాయంబు గావించుచుండెను. అప్పుడు బంధనిర్ముక్తుం డగు ప్రద్యుమ్నుండు పంజరద్వారసంస్థితం బగుశుంభునిగదం గైకొని తదాఘాతంబులచే దనుజవీరుల నురుమాడ నారంభించెను. ఇవ్విధంబుగా దైత్యసైన్యం బంతయు నిమేషమాత్రంబున సంక్షయం బగుటయు నెల్లవిషయంబులం దెలిసికొని శుంభనిశుంభులు విస్మితులై పోయిరి. తోడనే వారు క్రోధావేశంబున నచ్చటికి వచ్చి దుర్గాదేవిమాయామూర్తియగు గోపకాంతం గాంచి కామపరవశులై హితాహితజ్ఞానంబు లేక యియ్యిరువురు నారమణీమణి తనకుఁ గావలయును, తనకుఁ గావలయు నని వాదించుకొనుచు నద్దేవీమూర్తిని సమీపించిరి.

క్రిందుమీఁదెఱుంగక మదావేశంబునఁ బోరాటంబున కుపక్రమించుచున్న యాభ్రాతృద్వయముం గాంచి గోపకన్యామూర్తిం దాల్చియున్న దుర్గాదేవి “ఓదనుజవీరులారా! ఈప్రద్యుమ్నుండు మీతనయను క్షత్రధర్మానుసారంబుగఁ బరిగ్రహించి యున్నాఁడు. ఆవిధానముచేతనే మీలో నెవ్వరైనను నన్ను గ్రహింపవచ్చును. బలవిక్రమంబులచే మీలో నెవ్వం డధికుఁడో యాతనినే నేను వరించెదను.” అని చెప్పుటయు దానవసోదరు లందుల కంగీకరించి ప్రద్యుమ్నాంతికంబున మహాఘోరంబుగఁ జాలసేపటివఱకును బోరాడి యన్యోన్యగదాఘాతంబులచే నిరువురును మృత్యుముఖంబునఁ బడిపోయిరి. దుర్గాదేవి యట్లారాక్షసవీరులను వంచించి పత్నీసహితంబుగ

విముక్తం డగుప్రద్యుమ్నుని మరల ద్వారకానగరంబునకుం దోడ్కొని పోయి విడిచి యంతర్హితురాలయ్యెను.

ఆప్రద్యుమ్నునకు శంభాత్మజ యగులక్ష్మిగర్భంబున ధార్మిక శ్రేష్ఠుం డగువిష్వక్సేనుం డనుతనయుం డుదయించి క్రమంబుగ నాతం డు శంభనగరంబున కధీశ్వరుండై బహుకాలంబువఱకును దానవగ ణంబులను బుత్రులంబోలె భావించుచు ధర్మపాలనంబు గావించెను. మఱియును బ్రద్యుమ్నునకు మాయావతిగర్భంబున మయుండనుకుమా రుండు గలిగెను. నరకేసరి యగునక్కుమారుండు రిపుమర్దనుండై శంబరనగరంబున కధీశ్వరుం డయ్యెను.

## కామపరిభవము.

మునులారా! మత్స్యకూర్మాది దశరూపంబుల నవతరించిన ధర్మసంస్థాపకుండును, భవనాశకుండును, దుష్టశాసకుండును, భగవా నుండు నగువిష్ణుండుగూడఁ గామవశుండై యిప్పటికిని క్షీరాబ్ధితనయ యగులక్ష్మిదేవిని వక్షోభాగంబున నిల్పుకొని యున్నాఁడు. పూర్వకా లంబున దేవదానవులు జరామరణభీతులై యమృతంబుకొఱకు క్షీర సాగరమును మథింప నారంభించిరి. ఆసమయంబున నక్కలశపయో నిధినుండి లోకేశ్వరి యగుశ్రీదేవియు, ధన్వంతరియు, చంద్రుండును, పారిజాతంబును, ఉచ్చైశ్రవంబును, కామధేనువును, బహిర్గతంబు లయ్యెను. సురాసురు లంతమాత్రంబున సంతుష్టులు గాక యింకను సముద్రమును మథించుచుండఁ గాలానలసన్నిభంబును, లోకభీకరం బును, నగుకాలకూటమహావిషం బుద్భూతం బయ్యెను. మఱియు నమృతోత్పత్తిసమయంబున సుధాశీకరంబులనుండి యద్భుతదర్శనీయ లును, శరత్పూర్ణేందువదనలును, తటిత్సూర్యానలప్రభలును, నిండీ

వరశ్యామలును, స్వర్ణవర్ణగాత్రిలును, విచిత్రకాంతివిలసితలును,
నీలమణిసన్నిభలును, పద్మగర్భసవర్ణలును, నుత్పలాక్షులును నగు ననేక
రమణీమణు లుదయించి తమలావణ్యామృతసేచనంబున దశదిశలను
రసమయంబులుగఁ జేసివైచుచుండిరి. వారు జరామరణదుఃఖశోకాదుల
కమృతరూపలై దివ్యమణిమయంబు లగు కేయూరకటకాది విభూషణం
బుల నలంకృతలై కాముకులహృదయంబులఁ గరఁగించు మధురస్వరం
బుల మనోజ్ఞలై భ్రూభంగాపాంగవీక్షణాదులచే జగంబు నున్మత్తం
బుఁ గావించుచు విహరించుచుండిరి. కాముమిశ్రితం బగు నమృత
మూర్తులవలె వారందఱును గోచరించుచుండిరి. అనంతరం బమృతం
బుదయించుటయు సురాసురులు సాగరమథనకార్యమునుండి విముక్తు
లై సాగరోద్భూతంబు లగువస్తువులను బరిగ్రహింప నారంభించిరి.
అందఱికంటె ముందుగ శంకరుండు కాలకూటంబును శశాంకబింబును
బరిగ్రహించెను. దివాకరుండు తురంగమును, శచీపతి పారిజాతంబు
ను, విష్ణుండు కౌస్తుభంబును, ధన్వంతరి నందకమును గైకొనిరి. అమృ
తంబు నాకుఁ దమకుఁ దమకు నని వాదించుకొనుచు దేవదానవులు
మహాఘోరంబుగ యుద్ధంబు సేయనారంభించిరి. ఆహేతువున ప్రళయ
కాలంబు సమీపించినట్లు తోఁచుచుండెను. అప్పుడు ప్రభాకరసదృశ
ప్రభావంతులగు దైత్యగణంబులు విజృంభించి బలవంతముగ సుధా
పూర్ణకుంభంబు నపహరించిరి.

అప్పుడు విష్ణుదేవుండు మాయాప్రభావంబున మోహినీవేషం
బును ధరించి యసురవీరులకడ నున్న యమృతకలశంబును గైకొని
యెను. అది చూచి దేవత లందఱును బరమానందభరితులైరి.
ఆమోహినీమూర్తి యెల్లరహృదయంబులకు నాకర్షకంబై యుండుటచే
వందఱును నేకవాక్యంబుగా నీయమృతంబును నీవే మాకుఁ బంచి

పెట్టుమని ప్రార్థించిరి. ఆసమయంబున దానవవీరులు మనోహరాకారిణులగు నప్సరస్సుందరీమణులం గాంచి తమవశంబు గావించుకొనవలయు ననుకుతూహలంబుతో వారి నెత్తుకొనిపోయి మయదానవవినిర్మితంబును స్వర్గాధికసుఖకరంబును శస్త్రాస్త్రసంరక్షితంబును క్లేశవిరహితంబును నగునునినగరంబున బంధించివైచిరి.

అప్పుడు వారందఱును యుద్ధానకులై సకలదేవతలను బరాజితులం గావించికాని యీరమణీమణులను స్పృశింపకుందుముగాక యని సమయంబు చేసికొని మేఘగర్జనంబులం బోనిసింహనాదంబులు చేయుచు వివిధాయుధపాణులై మరల నాకసంబునకేతెంచి దేవతలపైఁ బడి యతిఘోరంబుగఁ బోరాడం దొడంగిరి. దేవవీరులును శత్రుసంహారంబు సేయంగోరి రణరంగంబున విజృంభించి దారుణంబులగు శస్త్రాస్త్రవర్షంబులచే నసురసహస్రంబులనుఱుమాడ నారంభించిరి. క్రమముగా సురశరానలంబుచేతను, మహాత్ముండగువిష్ణుదేవుని తేజోనలజ్వాలాసమూహంబునను రాక్షసులందఱును శలభంబులై పోవుచుండిరి. తుదకు హతశేషులగు నసురులు ప్రాణభయంబుచేఁ బలాయితులైపోయి పాతాళవివరంబునఁ బ్రవేశించిరి. మహాబలుండగువిష్ణుదేవుండును జక్రహస్తుండై వారినివెన్నాడి తఱుముచుఁ బాతాళంబునకుం బోయి యచ్చట నమృతసంభూతులగునప్సరస్సుందరీమణులం గాంచెను. వారును భీకరాకారుండగువిష్ణుదేవునిం గాంచి యించుక భీతిల్లిరి. రాకాసుధాకరవదనలును, లావణ్యవతులును, అతిలోకసుందరీమణులు నగునయ్యచ్చరల మనోజ్ఞవిలాసంబులకు భగవానుండగు నారాయణుండు కామవివశుం డయ్యెను. అక్కామినీమణులును భువనమోహనంబగునాదివ్యమూర్తిం గాంచిమదనబాణవినిర్భిన్నహృదయలగుటయు గోవిందుండు వారియింగితంబెఱింగి గాంధర్వవివాహం

బున నారమణీమణులఁ బరిగ్రహించి వారితోఁగలసి వివిధవిహారం
బులఁ గావించుచుఁ బరమానందంబునఁ గాలక్షేపంబు చేయుచుం
డెను. ఇట్లుండఁ గాలక్రమంబున నమ్మధుసూదనునిదివ్యతేజంబుచే
నా దేవకాంతలగర్భంబులనుండి మహాబలపరాక్రమసంపన్నులగు నసం
ఖ్యపుత్రగణంబులు సముద్భూతులైరి. మహారణవిశారదులగు నక్కు
మారులయసాధారణవిక్రమంబునకు జగంబంతయుఁ గంపించిపోవు
చుండెను.

పురుషోత్తముం డిట్లు మోహముగ్ధుండై యాత్మవిస్మృతిం గాం
చి సంసారంబు గల్పించుకొనియుండుటను జగద్విధాతయగు సరసిజా
సనుండు స్వర్గరక్షణంబుకొఱకుఁ జక్రాయుధు నెట్లయినఁ దీసికొని రా
వలయు నని మహాదేవుం డగుశంకరునిఁ బ్రార్థించెను. అప్పుడు భగ
వానుం డగుపినాకపాణి వృషభావతారముం దాల్చి పాతాళంబునఁ
బ్రవేశించి యతిభయంకరంబుగ ఱంకెలు వైచుచు నందందు విక్ర
మాటోపంబు దీపింప యథేచ్ఛావిహారంబు గావించుచుండెను. ఆ
భీషణనినదంబుల కంతఃపురంబంతయు సంచలించిపోవుటయు రణదు
ర్మదు లగువిష్ణునందనులందఱును గలసి యమ్మహావృషభంబును నిర్జిం
చుటకై యుద్ధసన్నద్ధులై పోయి వివిధంబులగు శస్త్రాస్త్రంబుల నొక్క
మ్మడిగ దానిపైఁ బ్రయోగింపఁదొడంగిరి. దేవదేవుం డగురుద్రుం
డప్పుడు రౌద్రాతిరేకంబున విజృంభించి ఖురశృంగదంతాఘాతంబు
లచే నిమేషమాత్రంబున నక్కుమారవర్గంబు నంతను విదారితంబు
గావించివైచెను. ఇట్లు వృషభరూపుం డగుమహాదేవునిచేఁ బుత్రసహ
స్రంబులు నిహతంబు లగుటయు విష్ణుదేవుండు క్రోధావేశంబున రణ
రంగంబున కేతెంచి దివ్యశరంబులచే నావృషభంబును బ్రహరింప
నారంభించెను. కాని వైష్ణవంబు లగునయ్యస్త్రంబుల నన్నింటిని;

గరళకంఠుఁడును గ్రసించినవాఁడై యుండెను. అఖిలోకంబుల నయ్యద్భుత
కార్యముం గాంచినంతనే కమలలోచనుం డావృషభంబు మహేశ్వ
రుండని గ్రహించి యాక్షణంబ యుచ్చైస్స్వరంబున స్తుతిప్రార్థనంబు
గావించెను. శంకరుం డప్పుడు ప్రసన్నుండై “దేవా! నీవిట్లాత్మవిస్మృ
తుండ వైతివేల? ఈజగంబున కంతకును నీవేక మూలకారణుండవు
గదా! ఇఁక నీవీస్థానమునందలి మమత్వంబును బరిత్యజించి వైకుంఠ
ధామంబునఁ బ్రవేశింపుము.” అని ప్రబోధించెను. ఆమాటలకు
మాధవుండును లజ్జితుండై “ఇట నాచక్రాయుధంబున్నది. శీఘ్రం
బుగఁ బోయి దానిం గైకొని వచ్చెదను.” అనియెను. మహాదేవుఁ
డాతని వారించుచు “ఓత్రివిక్రమా! ఆచక్రంబు దుష్టదానవమస్తక
చ్ఛేదనదీక్షితంబై యీపాతాళంబుననే యుండుఁగాక! నేను నీకింత
కంటెను ఘోరతరంబగు సుదర్శనాయుధమును బ్రసాదించెదను’ అని
చెప్పి కాలానలసదృశంబును, గోటిసూర్యప్రభాభాసమానంబు నగు
నొండొకచక్రమును సంకల్పమాత్రంబున సృజించి యాజనార్దనున
కొసంగెను.

కేశవుండును నతిలోకం బగునట్టి యాయుధలాభంబునకు సం
తుష్టుండై దేవగణంబుల నాహ్వానించి “ఓవిబుధవరులారా! ఈ
పాతాళనగరంబున మనోహరరూపయౌవనవతులగుసుందరీమణు లెం
దఱో యున్నారు. మీరందఱును బోయి మీయిచ్ఛవచ్చినరమణీర
త్నముం గైకొని యథేష్టభోగంబుల ననుభవించుచు విహరింపుఁడు’
అని యానతిచ్చెను. అమ్మాటలు విని యష్టవిధజాతు లగుదేవతలును
పాతాళంబునం బ్రవేశించుటకుఁ గుతూహలపడుచుండ, వారియింగి
తం బెఱింగి పరమేశ్వరుం డగుహరుండు క్రోధావేశవివశుండై “శాం
తులగుఋషులును, మదంశజు లగుదానవులును దక్క నన్య లెవ్వ

రీపాతాళంబునఁ బ్రవేశించినను తత్క్షణంబ నిధనంబుఁ గాంచెదరుగాక!'
అని శపించెను. అందువలన దేవత లందఱును తత్ప్రయత్నంబునుండి
నివృత్తులై స్వస్థానంబులకుం బోయిరి.

అనంతరము కొంతకాలంబున కొకప్పుడు చింతానిమగ్నుండై
యున్న శంకరునిం గాంచి పార్వతీదేవి 'దేవా! సర్వభూతంబులకును
స్రష్టవు, జగత్కారణుండవు, హరుండ వగునీవిప్పు డిట్లుండుటకుఁ గార
ణంబేమి?' అని ప్రశ్నించెను. అప్పలుకులు విని మహాదేవుండు, దేవీ!
నేను పాతాళనివాసిను లగుకామినీమణుల యలౌకికసౌందర్యమును
మనంబున భావించుచున్నాను. అట్టిమనోహరరూపంబు నే నింత
వఱకు నెందును సందర్శించియుండలేదు." అనుటయుఁ బార్వతి "నాథా!
ఎవ్వరిసౌందర్యముచే నీవంటివానిహృదయముగూడ చింతావిస్మయ
సాగరనిమగ్నం బగుచుండెనో యట్టి సుందరీమణులసౌందర్యము
లోకాతీత మైనదని స్పష్టముగనే గోచరించుచున్నది. నీవీదాసియెడల
ననుగ్రహించి యనుమతి నొసంగెదవేని యీమెకూడ నచ్చటికిఁ
బోయి యామనోహరరామణీయకమును సందర్శించి నయనేంద్రియం
బుల సార్థకములఁ గావించుకొనఁగలను.' అని ప్రార్థించి పతిచే నను
జ్ఞాతయై గౌరీదేవి యాక్షణంబుననే ముఖచ్ఛాయ దర్పణాభ్యంతరం
బునం బ్రవేశించినట్లు పాతాళంబునఁ బ్రవేశించెను. రసాతలనివాసు
లగునయ్యంగన లందఱు నీమెను దర్శించి "ఈపాతాళగహ్వరంబున
నాకస్మికంబుగ సూర్యోదయ మయ్యెనా" యని విస్మితలై పోయిరి.
అట్టియవస్థలో నమ్మదవతు లద్దేవికి నుచితసమ్మానంబు లొనర్పుటఁ
గూడ విస్మృత లై పోయిరి. పార్వతి వారి భావంబులం గ్రహించి
వారిరూపంబుల కచ్చెరు వంది 'ఓయువతీరత్నములారా! మీ రిందు
విషలతలవలె నున్నారు. మీరూపంబులు ఛిద్రిపుష్పఫలంబులవలె

దుర్బోధకంబు లగుకమలంబులవలె నిరుపయుక్తంబులై యున్నది. ఇట్టిమీదివ్యసౌందర్య మెవ్వరికిని ననుపభోగ్యంబై యున్నది. భగవానుం డగుప్రజాపతి పురుషోపభోగార్థమే స్త్రీలను సృజించియుండెను." అనియెను. ఆకామినీమణులు కొంతసేపటివఱకు కామె యెవ్వరని భావించుకొనుచుండి, తుదకుఁ బార్వతీదేవి యని గ్రహించి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యనేకవిధంబులగు స్తోత్రపాఠంబులఁ గావింపందొడంగిరి. దేవియు వారిస్తోత్రంబులకు సంతుష్టయై 'ఓకాంతావతంసములారా! పూర్వము దేవతలు మిమ్ము భార్యలనుగాఁ బడయుఁగోరి యిచ్చటి కేతెంచుచు మహాదేవునిచే శపింపఁబడి విఫలమనోరథు లై పోయిరి. ఇప్పుడు శంకరానుచరులును తత్పుత్రసమూహులు నగువా రెల్లరును మానవాకారంబుతో జనియించియున్నారు. విజ్ఞానవంతులును, మంత్రజ్ఞులును తాపసులును రూపయౌవనగర్వితులును నగువారలు మీకుఁ బతు లయ్యెదరుగాక! మీరు వారినిఁగూడి మీయలౌకికసౌందర్యమును సార్థకముగాఁ జేసికొనుఁడు." అని చెప్పి యంతర్హిత యయ్యెను. వారును దేవియాజ్ఞానుసారముగ భూలోకమునకుం బోయి సుఖించిరి.

పూర్వ మీవిధముగాఁ బ్రజాపతి యగువిష్ణుండుగూడ స్త్రీలంపటుం డయ్యెను. ఆతఁడు మహారణంబునఁ బ్రముఖు లగుదైత్యపతుల నిహతులం గావించి వారిస్త్రీరత్నంబుల నపహరించి పాతాళంబునకుం గొనిపోయి వారితో నచ్చట వినోదవిహారంబులఁ గావించుచుఁ గామోన్మత్తుం డగుచుండెను. అనంతర మద్దేవుండు త్రేతాయుగంబున శ్రీరామావతారంబు దాల్చి జానకిని భార్యగాఁ బరిగ్రహించెను. కాని యామెతో నాతని కెంతోకాలము సహవాసము లభియింపలేదు. అందుచే నైశ్వర్యమువలనఁ గాని, పుత్రసంతతివలనఁగాని యాతనికి

విషయతృప్తి గలుగదయ్యెను. కావుననే యాతఁడు కలియుగాంతం
బుగ మథురానగరంబున దేవకీవసుదేవులకు మరలఁ బుత్త్రుండై పుట్టి
బాల్యావస్థయందే గోపరమణీసహస్రంబులతోఁ గూడి బృందావనం
బున విహరించుచు దశలక్షపుత్త్రసంతానంబుఁగాంచెను. పిమ్మట నా
తఁడు రుక్మిణిం బెండ్లియాడి ప్రద్యుమ్నాదిపుత్త్రశతమును గాంచెను.
అయినను నాతని కిందిరియతృప్తి గలుగలేదు. అనంతర మాతఁడు
ప్రాగ్జ్యోతిషాధీశ్వరుం డగునరకాసురుని బలవంతముగ సంహరించి
యాతని కారాగృహంబుల నున్న పదియాఱువేలరాచకన్నియల నపహ
రించి తెచ్చి వారితోఁ గూడ కామోపభోగంబుల ననుభవించి తొం
బదివేలపుత్త్రులం గనియెను. అప్పటికిఁ గూడ నాతనికి స్త్రీవిషయ
వాంఛ తగ్గదయ్యెను. మఱియు నాతఁడు రాధ యను నొక గోపకామి
నిని బలవంతముగఁ బరిగ్రహించెను. అప్పటికిని నాతనిపరస్త్రీలంపట
త్వము శమింపక దినదినంబును వర్ధిలుచునేయుండెను. సకామయు,
ననురక్తయు నగురమణీమణి లభియించుట దుర్లభముగదా?

"ముక్తియందే విచిత్రసుఖ మున్నది." అనుమతము నమ్మ
తింపనివా రెల్లరును "ముక్తియం దెట్టిసుఖంబును లేదు. ముక్తి యను
నది సర్వజ్ఞానవివర్జితం బగు శిలావస్థవంటి దని చెప్పుదురు. మఱికొం
డఱు మోక్షావస్థయందు పురుషుండు స్వకీయప్రకృతిప్రాప్తుం డగు
నందురు. యువతీయువకులచిత్తంబులు పరస్పరాసక్తంబు లగు
నప్పుడు ధర్మంబునందుగాని ఫలంబునందుగాని దృష్టి యుండదు.
ధ్యానయోగమయుండును, శాంతిపరాయణుండును, గురువులకు గురుం
డును రక్తవర్ణుండును, చతుర్భుజుండును, వేదవేదాంగపారంగతుండును,
దీర్ఘాయుష్మంతుండును, పద్మసంభవుండును నగుబ్రహ్మదేవుండుగూడఁ
బార్వతీపరిణయకాలంబున నద్దేవదేవిపాదద్వయసందర్శనమాత్త్రంబున

శీలభ్రష్టుం డయ్యెను. ఆసమయంబుననే బ్రహ్మచారు లగువాలఖిల్యులు జనియించిరి.

## —♦ లింగపాతోపాఖ్యానము. ♦—

ఓ బ్రహ్మవిదులారా! ఇందీవరశ్యాముండును, మధురిపుండును భగవానుండు నగువిష్ణుండును, పద్మసంభవుండగు బ్రహ్మదేవుండును నెట్లు కామాభిభూతులైరో యాచరిత్రమును సవిస్తరంబుగ నెఱింగించితిని. ఇది యతినిగూఢమైనది.

సృష్ట్యాదియందు శ్వేతరక్తనీలవర్ణుండును, సర్వరూపధరుండును, దంష్ట్రియుతుండును, వివృతాననుండును, శాంతుండును, దాంతుండును, సంయమియు, విగతస్పృహుండు నగురుద్రుండు కేవలవిరాజితుండై యుండెను. తరువాత సత్త్వగుణప్రధానుం డగునారాయణుం డుదయించి సృష్టికొఱ కద్దేవునిచే నియోజితుం డయ్యెను. అనంతరము రుద్రుండు నిద్రితుండయ్యెను. నారాయణుండును మహాతపంబు గావించి తదవసానంబున సృష్టిగావింపవలయు నని యాలోచించుచుఁ బరిశ్రాంతుండై క్షీరసాగరమధ్యంబునఁ జాలకాలంబువఱకును యోగనిద్రాముద్రితుండై యుండెను. అక్కాలంబున రజోగుణంబుచే బ్రహ్మయు నావిర్భూతుండై సృష్టికార్యనియోజితుండై విధిక్రమంబున జగత్సృష్టిసేయ నారంభించెను. అందు ప్రప్రథమమునఁ బశుపక్ష్యాది పంచభేధంబులచే నొప్పారుతామసస్పృష్టియుఁ బిమ్మట రజోగుణవిశిష్టంబగు మానవసృష్టియు, ననంతరము విద్యాధరాద్యష్టవిధభేదంబును, సాత్త్వికంబును నగుదేవసర్గంబును నేర్పడియెను. అప్పుడు భగవానుం డగువిష్ణుండు వీనికి స్థానంబును, ధర్మంబును, జీవనంబును, పాలనంబును, నన్యోన్యభక్షణంబున నాహారంబు

ను గల్పించి యంతర్హితుండయ్యెను. ఏతత్క్రియాకలాపంబు సదను
ష్ఠితం బైనపిమ్మట సృష్టికాముం డగురుద్రుండు మేల్కాంచుటయు
సచరాచరం బగుసృష్టి యంతయు నాతనికి దృగ్గోచరం బయ్యెను.
వివిధంబు లగుజీవసమూహంబులచే నమ్మహాదేవునియూర్ధ్వమధ్యా
ధోభాగంబులు సమావృతంబులై యావగింజకైన నెడమీయనంత
దట్టముగ నిండియుండెను. ధాత్రియు నందు వివిధప్రాణిమిథునంబులచే
నిబిడీకృతంబుగాని స్థానం బేదియు సృష్టిలో లేకుండఁబోయెను. ఆ
సృష్టి యంతయు నానందమయంబై విలసిల్లుచుండెను.

ఏతాదృశనిరంధ్రం బగుసృష్టిం గాంచి మహాదేవుండు కుపి
తుండై "ఇఁక దీనితో నేమి ప్రయోజనం" బని లింగచ్ఛేదంబు
గావించివైచెను. ఆలింగము మహాజ్వాలామయంబును, ఘోరంబును
జగత్త్రయంబునకు స్తంభభూతంబును, ఆదిమధ్యాంతరహితంబును,
స్థూలతమంబును, ననుపమానంబును నప్రమాణంబును నై విరాజిల్లు
చుండెను. అంత రుద్రుండు ప్రశాంతక్రోధుండై యంతర్హితుం
డయ్యెను.

అనంతర మొకప్పుడు గర్వాన్వితు లగుబ్రహ్మవిష్ణువులు తేజో
మయం బగునాలింగమును దర్శించి దానితత్త్వము గ్రహింపఁ గోరి,
"ఈలింగం బెవ్వరిది? ఇది సాధారణంబు గా దని దర్శనమాత్రంబు
ననే తెలియనగుచున్నది. మనగర్వంబు భంగంబు నొందుటకే యిది
యావిర్భవించె నని తోఁచుచున్నది. ఏమైన నేమి? దీనియాద్యంతం
బులు పరిశీలించితీఱవలయును. అట్లు సేయనిచో మనమహత్త్వంబు
నకు లోపము వాటిల్లఁగలదు." అని నిశ్చయించుకొనిరి. అంతట
విష్ణుండు మూలాన్వేషణంబునకై పాతాళంబునకును, అగ్రదర్శంబున
కై పద్మసంభవుం డూర్ధ్వలోకంబునకును బోయి చూచిరి గాని వారి

యభీష్టము ఫలింపలేదు. ఆలింగం బాద్యంతంబులు లేక యంతట నొక్క-టేవిధంబుగ నగపడుచుండెను. వారట్లు బహుకాలంబువఱకును శ్రమపడి వెదకుచు దరిగానలేక యాయాయానంబుచే నవసన్నులై మరల యథాస్థానంబునకు వచ్చి చిరకాలంబున కైనను పుణ్యమార్గంబున కానంతించుచుం బరస్పరాలింగనం బొనర్చుకొనిరి. అప్పు డాకాశవాణి « దేవదేవులారా! జ్వాలామయం బగు నిది చంద్రశేఖరునిదివ్యలింగము. ఆకపర్ది దీనిని ఛేదించి పరిత్యజించియున్నాఁడు. దీనిని బూజించువారు సర్వాభీష్టసిద్ధు లగుదురు. ఈభూమండలంబున నీశివలింగమును బలిపుష్పాదులచే నర్చించువారికి భక్తవత్సలుం డగుపినాకపాణి సంతుష్టుండై యభిమతార్థంబులఁ బ్రసాదింపఁగలఁడు." అని బోధించుటయు విష్ణుదేవుండును, విధాతయు నిశ్చలభక్తిభావంబుల నాశివలింగమును యథావిధిగఁ బూజించి వివిధంబు లగు స్తోత్రపాఠంబులచే నమ్మహాదేవుని బ్రీతుని జేసి యసాధారణసిద్ధిలాభంబులం బడసిరి.

మఱియొకమహాకల్పంబున దేవత లమ్మహాదేవుని సందర్శించిరి. అప్పు డాతఁ డర్ధనారీశ్వరమూర్తిం దాల్చియుండెను. వేఱొకకల్పంబున నద్దేవదేవుండు గృహస్థుండై హిమాలయగుహాగర్భంబున నివసించియుండెను. అప్పుడు భూతసమూహంబు లాతని నలుగెలంకులఁ బరివేష్టించి నృత్యంబు గావించుచుండిరి. ఆసమయంబునఁ గృష్ణవర్ణ యగుపార్వతీదేవి గౌరవర్ణంబును బడయునుద్దేశముతో బ్రహ్మంగూర్చి తపంబుసేయం దలంచి యరణ్యంబునం బ్రవేశించి సతీసరోవరంబును జయంతీనామకమహాగహ్వరంబును, రాజవానం బనుగుహను సందర్శించి యచ్చోట లోకపితామహుం డగుబ్రహ్మదేవునిం బొడఁగాంచెను. మఱియు నందు సుప్రతిష్ఠితుండై యున్నవిష్ణుదేవుని సమగ్రంబుగ స్పృశించి మహామతి యగు నద్దేవి బ్రహ్మనుగ్రహంబునఁ గాంచన

వర్ణంబును గాంచి గౌరీమూర్తి యయ్యెను.

ఆ దేవి తపోవనంబునకుం బోవుసమయంబున స్త్రీలంపటుండగు నాథుని గనుపెట్టిచూచుచుండుటకై తనసఖియగు శుద్ధామహుసుముడు, వీరకుని నంతఃపురద్వారంబుకడఁగా వుంచి “ మహాదేవుం డితరకాంతల నిచ్చటికిఁ గొనితెచ్చి యుపభోగింపకుండునట్లు చూచుచుండుఁడు. జాహ్నవీప్రియుం డగు నాతనియెడల నాకెట్టివిశ్వాసమును లేకుండ నున్నది. ఆతనియనురాగము సంధ్యారాగమువలె క్షణచంచలమైనది. నన్నుఁ దనతోఁ గూర్పందలఁచి ప్రయత్నించిన కామునిగూడ నాతఁడు భస్మీభూతునిం గావించినాఁడు. మీరాతని జాగరూకులై చూచుచుండుఁడు. ” అని నియోగించియుండెను. వారును నిరంతరము నంతఃపురద్వారంబుకడ నప్రమత్తులై యుండి దేవియానతిని బాలించుచుండిరి.

ఆసమయంబున ఆడియను నొకరాక్షసుండు బ్రహ్మదేవునిం గూర్చి యతికఠోరంబగు తపంబు గావించి యాతని బ్రసన్నుం జేసికొని యమరత్వముం గోరుకొనియెను. పితామహుం డాతనికోరికకు విస్మితుండై యేమియుఁ జేయంజాలక ‘ ఓదనుజశేఖరా! కేవలమమరత్వము సాధారణముగ లభించునది గాదు. మఱియు నదియుందదుకు నీయుఁదగినదిగాదు. అది గాక నీయిచ్చవచ్చినవరంబులను గోరుకొనుము. అన్నియు నీకిచ్చెదను. అని యానతిచ్చెను. ఆదానవుం డప్పుడు మరల నమరత్వంబునకుఁ దగురీతినే ‘ ఓదేవా! చంద్రదేవతాకంబగు నక్షత్రం బుదయించినరౌద్రసమయంబున, నాఖండలుండు పుష్కలావర్తమేఘంబుల విడిచి లోకభీకరంబగువర్షపాతంబుఁగావించుచున్నకాలంబున, ప్రచండవాయువు లతిభీషణంబుగ వీచుచున్నప్పుడు ప్రళయకాలం బాసన్నంబైనవేళ నాకు మరణం బగుఁగాక. అంతవ

ఆకు నేనమరుండనై యుండవలయును. అని ప్రార్థించుటయుఁ బద్మ
సంభవుం డందులకు సమ్మతించి యంతర్హితుం డయ్యెను. అసురుండు
నాతఁడంత పరమానందంబున మద్యపానంబు గావించి హిమాలయం
బునకుం బోయి గౌరీశంకరగుహాలకు సమీపంబున విహరించుచు నటఁ
గాచుకొనియున్న గౌరీసఖి యగునుద్దామకుసుమను, వీరకునిఁ గాంచి
వారిమూలంబున మహేశ్వరుని స్త్రీలాంపట్యముం గూర్చి తెలిసికొని
తానారూపముతో లోపలఁ బ్రవేశింపఁజాలక సర్పరూపమున గుహాము
ఖ్యంబునఁ జొచ్చి యంతలోనే గౌరీమూర్తిం దాల్చి మహాదేవునిసన్ని
ధికిం బోయి 'చంద్రశేఖరా! పార్వతి యగునేను పద్మసంభవునిం
గూర్చి తపంబుసేసి యాతనిప్రసాదంబున గౌరి నైతిని. కనకకాంతు
ల చే విలసిల్లుచున్న నావంకకుఁ జూడుము. కామపీడితనై యున్న
నన్ను ననుగ్రహింపుము." అని పల్కుటయు విరూపాక్షుండు కన్నుదెఱ
చి చూచి సంతుష్టహృదయముతోఁ బ్రియురా లనుతలంపున నామెం
గౌఁగిలించుకొని బాహ్యాభ్యంతరరతులం దేలింపఁదొడంగెను. ఆసమ
యంబునఁ గృత్రిమాకారుం డగురక్కసుండు మహేశ్వరుని బ్రమందింప
ననేకప్రయత్నంబులం గావించెను. జుగుప్సాకరంబులును దుష్టంబు
లును నగువానివికృతకృత్యంబులం గాంచి శివుండు శంకించుటయు,
మాయావి యగునా రాక్షసుండు గౌరీరూపమును ద్యజించి నిజరూపం
బుం దాల్చి యుద్ధసన్నద్ధుం డయ్యెను. అప్పుడు శంకరుండు క్రుద్ధుండై
యకాలప్రళయంబుం గల్పించి యాసోఁకుఁజేని నిహతుం జేసెను.
ఆరాక్షసుండు మృతినొందునప్పుడు 'ఓరుద్రా! నాకొకయన్న గలఁడు.
వాఁడుకూడ, నావలెనే మాయారూపమును దాల్చి వచ్చి నిన్ను సంహ
రింపఁగలఁడు. ఆతఁడు నాకంటె బలశాలి. జాగ్రత్తతో నుండుము.'
అనిపలికి మఱిచచ్చెను.

అంతకుమున్న ఉద్దామకుసుమ గౌరిచెంతకుం బోయి ‘ దేవీ! నేను నీనాథునిఁ గాచుకొనియుండఁజాలను. వీరకుఁ డెవ్వతెనో యొక సుందరాంగిని నీనాథునిచెంతకుఁ బంపియున్నాఁడు. నీస్వామియు నామె రూపమునకు ముగ్ధుండై నాఁడు. నే నదియంతయుఁ జూడఁజాలక నీచెంతకు వచ్చితిని. దీనికిఁ బ్రతివిధానం బాలోచింపుము.’ అని చెప్పుటయుఁ బార్వతీదేవి క్రోధపరవశయై తత్క్షణంబ పూర్వాభిముఖంబుగ నుపసించి యాచమనంబుచేసి ‘ ఓరోరి! వీరక! నేనెఱుంగకుండ నానాథునకు రమణీమణులం గూర్చుచున్నావా? నాయాజ్ఞఁ బాలింపక ప్రమత్తుండవై వ్యతిరేకంబుగ మెలంగుచున్నావుగావున నీ వీయపరాధంబున జన్మమృత్యుజరాగ్రస్తంబగు భూమండలంబున జన్మింతువు గాక!’ అని శపించెను. అప్పు డద్దేవి హృదయంబున నుత్కంఠ, విస్మయము, దైన్యము, శంక మొదలగు భావంబులును, వీర, రౌద్ర, భయానకాదిరసంబులును నుత్పన్నంబు లయ్యెను. తపఃఫలసిద్ధిగాంచియున్నయామె యావెంటనే గృహంబునకు వచ్చి వినీతుం డగువీరకుని నిష్కల్మషుం డగుస్వామిని సందర్శించెను. అప్పుడు పుత్త్రసమానుం డగువీరకుండు దేవీచరణకమలంబులకుం బ్రణమిల్లి ‘ అమ్మా! నీవు ధన్యురాలవు. నీయదృష్టంబుననే నీస్వామిప్రాణంబులు నిల్చియున్నవి.” అని యాడిరాక్షసునిచరిత్రమంతయుఁజెప్పెను. అవ్వాక్యంబు లాలించి గౌరీదేవి కడు దుఃఖితయై యకారణంబున వీరకుని శపియించినదానికి లజ్జించుచు ‘ కుమారా! అజ్ఞానవశంబున నేను నిన్ను శపించితిని. నీవు భూమండలంబున శిలాదుం డనుబ్రాహ్మణునకుఁ బుత్త్రుండవు కమ్ము. అట పండ్రెండువత్సరంబు లున్నపిమ్మట నీకు శాపావసానంబు గాఁగలదు. మరల నీవాదేహంబుతోనే నాపుత్త్రత్వలాభము నొందెదవు. అని చెప్పెను. వీరకుం డట్లే విప్రజన్మము నొందెను.

అప్పుడు రుద్రుండు భవానిం గాంచి దైత్యవాక్యంబులం దలంచి శంకితుండై మాయామూర్తియను భవంబున నామెను వధించుటకై భీషణాకారముఁ దాల్చెను. క్షణక్షణంబునకు నాతని యాకృతి క్రొత్తక్రొత్తగ నగపడుచుండెను. అతఁ డట్లు సహస్రమూర్తులం దాల్చుటయు గౌరీదేవి యవలీలగ నామూర్తుల నన్నిటిని గ్రసించి వైచెను. పిమ్మట నామె తారారూపమును దాల్చి శంకరునిశంకల నెల్ల నపనయించి యానందింపఁజేయుటయు సురతప్రియయు, చిరవిరహాత్యంతయు నగునద్దేవితోఁ గలసి విహరించుచు నతృప్తుండై యున్మత్తవేషంబున సతీసహితుండై యద్దేవుండు దేవదారువనంబునఁ బ్రవేశించెను.

అతఁ డచ్చట ననేకవిధంబుల గౌరితోఁ గ్రీడించియు సంతుష్టుండు గాక కామావేశవివశుండై మునిపత్నులతో విహరింపవలయు నను కోరికచే దిగంబరుండై తుషారహారశీతాంశుశంఖసన్నిభం బగు భస్మంబుచే సర్వాంగంబుల నలందుకొని, మయూరపింఛంబులఁ దాల్చి, దండోపరిభాగంబున రజ్జుబంధితంబు లగుఖట్వాంగాదికంబులచే సన్నద్ధుండై చంద్రఖండంబువలె మెఱయుచుండుకపాలంబును జేతఁబూని లావణ్యమందహాసవిలాసాదులచే నగపడినయువతుల కెల్ల మదనోన్మాదమ్ముం గల్పించుచు నభినవతరుణమూర్తిం దాల్చి విరాజిల్లుచుండెను. అప్పు డాతనివదనమండలము సుస్నిగ్ధంబులును, కుంచితంబులును, కజ్జలసన్నిభంబులు నగుకుంతలంబులచే నావృతంబై షట్పదకులసంకలితం బగు శ్వేతకమలకుసుమంబుంబోలి యొప్పిమీరుచుండెను. సూక్ష్మంబును, వినీలంబును, సుందరంబు నగుభ్రూయుగంబును, విలోలనీలతారకావిలసితం బగు విశాలనయనద్వయంబును, సానురాగచంచలకటాక్షప్రసారంబును గల యద్దేవుని దివ్యమూర్తి మునిపత్నులకు

దర్శనీయంబై యుండెను. దివ్యసుందరపీనదేహుండును, ద్విభుజుండు ను, చారుకుండలుండును, దక్షిణావర్తరోముండును, మదమాతంగ గమనుండును, ఆరక్తపాణిపాదాధరుండును, సుగంధకుసుమమాలికా లంకృతుండును, నగునక్కామవైరి భస్మలిప్తాంగులగు ప్రమథగణంబు లచేఁ బరివేష్టితుండై యవ్వనమధ్యంబున విహరింప నారంభించెను.

వనవిహారసమయంబున నద్దేవదేవుం డానందవిహ్వలుండై పర మోచ్చకంఠస్వరంబున గానము చేయం దొడంగెను. ఆదివ్యగానము దోషవిరహితంబులగు దశవిధగీతవిశేషంబులచేతను, చతుర్దశవిధస్వరం బులచేతను, త్రివిధంబులగుయతులచేతను, లయసమూహంబులచేత ను, అష్టవిధరసాంగంబులచేతను, ఏకవింశతిమూర్ఛనంబులచేతను, వివిధంబు లగుకంఠతానంబులచేతను నలంకృతమై మనోజ్ఞమై మా ధుర్యమునఁ బరమావధిఁ గాంచి జగన్మోహనకరమై యుండెను. ఆ మోహనగానమునందు సప్తస్వరంబులును, మూఁడుగ్రామములును, జాతిసంభవంబులగు ముప్పదిరెండు దివ్యరాగంబులును సంపూర్ణసౌం దర్యము గాంచి శ్రుతిసుఖంబు నాపాదించుచుండెను. మఱియు న గ్గానము దేశజాతిమిశ్రచ్ఛాయలచే విభూషితంబై, కాలానుసారంబుగ మిశ్రభాషాప్రయుక్తంబై, వీణాదిచతుర్విధవాద్యంబులతో మేళవించి పరమోత్కృష్టం బగుమాధుర్యముఁ గూర్చుచుండెను. ఇట్లు భగవా నుం డగువిరూపాక్షుండు శబరాకృతిం దాల్చి పాడుచు నొకచో నృ త్యము చేయుచు, మఱియొకచో నవ్వుచు గంతులు వైచుచు నింకొక చో ప్రమథగణసహితంబుగా వన్యఫలమూలాదుల భక్షించుచు వన భూషణాలంకృతుండై రమ్యంబులగునదీతీరంబులయందుఁ దాండవం బు సేయఁదొడంగెను. ఆతాండవము ప్రేక్షకుల కతిమనోజ్ఞమై సహస్రవిధంబులగుస్థానకంబులచేతను, ఇరువదియాఱువిధంబు లగునృ

గ్భేదంబులచేతను, ముప్పదిమూఁడువిధంబులగు కరలాఘవంబులచేతను,
నవరసంబులచేతను విలసితంబై యతిలోకరమణీయంబై యుండెను.

అప్పుడు పూర్ణేందువదనయు, తరుణీమణియు, మనోహరవిగ్రహ
యు, పీనశ్రోణిపయోధరయు, సూక్ష్మనీలవసనాచ్ఛాదితయు, రక్తాం
బరోష్ణీషయు, పుష్పదామాలంకృతయు, అశోకప్రసవమాలికాహస్త
యు, నగుపార్వతీదేవి నాథునిశరీరము నవలంబంబుగఁ జేసికొని యీ
శనివెనువెంటనే వచ్చుచుండెను. ఆసమావేశము విద్యుల్లతలమేఘపఙ్
క్తివిరాజితాంబరమునఁ జంద్రసందర్శనముంబోలి హృద్యంగమంబై
యుండెను. అద్దేవియు గోపికారూపధారిణులగు మాతృకామూర్తులచేఁ బరి
వేష్టితయై స్త్రీలంపటుండగు నాథునిపరదారగమనంబును, మునిపత్నుల
దుశ్శీలంబును, సాధ్వీమణుల హృదయనిశ్చలత్వంబును బరీక్షించుట
కై మెల్లమెల్లగ నద్దేవదారువనంబున విహరించుచుండెను. ఆదారుకా
వనస్త్రీలందఱు ననురక్తులును, విరక్తులు నగు తమతమభర్తలయను
జ్ఞల నెట్లో గ్రహించి శివసందర్శనంబు గావించుటకు బయలుదేఱిరి.
అదృష్టపూర్వంబును, అనంగకోటిసుందరాకారంబును, నిర్లజ్జంబును,
మున్యాశ్రమంబులయందుఁగూడ భిక్షాకాంక్షియు, ఆనందజనకంబులు
ను, మధురంబులును, స్పష్టంబులును, కామోద్దీపకంబులును, నమస్వ
రంబులు నగువచనంబులచే మాటిమాటికిని "దేహి దేహి" యని
యని యాచించుచున్నవాఁడును, బరమసుందరుండును నగునప్పరమే
శ్వరుం గాంచి మునిపత్నులందఱును దత్క్షణంబునఁ గామావేశవివశలై
పోయిరి. వారల్లొడళ్ళు మఱచి యందందుఁ బరిభ్రమించుచు, నవ్వు
చు, పాడుచు, నాప్రలించుచు, బెదరబెదరి చూచుచుఁ, దిట్టుచుఁ, గే
కలు వైచుచు, రోదనంబులు చేయుచు, మధురవచనంబులు పలుకు
చు, నిట్టూర్పులు విడుచుచు, నాక్రోశించుచు, మనోవికారంబులఁ

గప్పిపుచ్చుచు, స్వకీయంబులగు రమణీయాంగకంబుల నస్పష్టంబుగఁ బ్రదర్శించుచు ననేకవిధంబులగు చేష్టితంబులఁ గావింపం దొడంగిరి. కాని యందెవ్వరు నాతనితో సంభాషింపఁజాలక హృదయాంతరంబులఁ బ్రజ్వరిల్లుచున్న కామానలజ్వాలలచేఁ బరితపించి పోవుచుండిరి. వసిష్ఠపత్నియు, సాధ్వీమణియు నగునరుంధతీదేవితక్క మిగిలినబాలికలు, తరుణులు, వృద్ధలునగు మునిపత్నులందఱును గామశరవినిర్భిన్న హృదయులై పోయిరి.

ఆరమణీమణు లప్పుడు తమతమాకారవిలాసేంగితంబులచే మహాదేవు నామంత్రణంబు చేసి యొక్కవిజనస్థలంబునకుం జేర్చి యందఱు నేకవాక్యంబుగా నాతని నుద్దేశించి మృదులస్వరంబున ‹‹ ఓయీ ! నీకీ తాపసవేష మేల ? ఈవ్రత మెందుకొఱకు ? కృతకృత్యులలో వరేణ్యుండ వగునీ కీఘోరవ్రతంబుతో నేమిప్రయోజనము ? ఈజగంబునఁ బురుషులు తపంబు గావించుట భోగసిద్ధికొఱకేకదా ! ఈసమయంబున నేది కర్తవ్యమో నీవే బాగుగ నాలోచించి చూడుము ! సకాములైనను, నిష్కాములైనను, యువకులకుఁ బరదారసమాగమమే వాంఛనీయము. ఇప్పుడు సులభంబుగ లభించిన యట్టిభాగ్యమును నీవేల త్యజించెదవు ? పరకాంతలు పుణ్యహీనుండగు పురుషు నెన్నండును బ్రార్థింపఁబోరు. మానవులు భోగార్థమై విహితంబు లగుకర్మంబుల నన్నంటిని గావించుచుందురు. నీయదృష్టముచే నిప్పు డిట్టిభాగ్యము లభించినది. మూఢుండవై దీని నేల పరిత్యజించెదవు ? హాయిగ ననుభవింపుము. నీవు పరమసుందరుండవు గావున నిన్ను దర్శించుటచే మాకు దయగలిగినది. ఈమధుమాససమయంబున నాయాసంబును సహించి యిట్టిమోహనమూర్తి వగునీవు వచ్చి దర్శనం బిచ్చుచుండ మేమూరక సిగ్గుపడిచూచుచున్న నెట్లు కామశరంబులను సహించి యుం

డఁగలరా? పరమరూపవతులును, సాభిలాషలును, స్థూలనితంబలను,
పీనపయోధరలును, సాత్త్వికలును, గామభావాభిభూతలును నగునిందఱు
యువతీరత్నములు నిజనస్థలంబున నెంతప్రార్థించినను, నెంతవారి
కైన నదృష్టవశంబునం గాక యూరక లభింతురా? మేము స్వైరిణు
లమైనను, సవస్త్రలమైనను, వివస్త్రలమైనను, దపస్వినులముగదా—
ఇట్టి మాకు నీలెక్క యేమున్నది? నీవుత్రిలోకసుందరుండవు గావున
నిన్నుఁ గామించితిమి. ఓచపలహృదయా! నీవిఁక బిచ్చమెత్తుకొన
వలదు. ఒకసారి కన్నులను దెఱచి మావిలాసహావాకారంబులను,
రమణీయాంగకంబులలావణ్యంబును దర్శించి ధన్యుండవగుము. మేము
పరకాంతలము. మానాథులు కడువృద్ధులు. మఱియుఁ బరమసాధు
లును, అస్థిచర్మమాత్రావశిష్టదేహులు నగుబ్రాహ్మణులు. అట్టియస
మర్థు లగువారందఱును కేవలము పరుషవచనంబులచే నిన్నేమిచేయఁ
గలరు? ఓబాలిశా! ఎవ్వనిదండభయంబుచే లోకులు సత్పథగాము
లగుచుందురో యట్టిరాజు లేనియీవనంబున నీవేల ప్రవేశించి మా
శీలంబుల నపహరించితివి? లతాతరుమండమండితంబును, నిర్ఝరసాను
మంతంబు నగునివ్వనంబును సందర్శింపుము. మఱియు క్షుత్పిపాసా
తురు లయ్యును బాలకులగుశిష్యుల నధ్యయనంబు చేయించుచు
నిరంతరవేదపాఠతత్పరులగు మాతాపసులం గాంచుము. అహో!
ప్రసన్నుం డగుగురుండు మున్ను గౌతమున కుపదేశించిన సామవేదో
క్తం బగుమహాయజ్ఞముం గూర్చి నీవు వినియుండలేదా? ఆయజ్ఞము
నందు యువతియే యగ్ని—ఆరమణి రమణీయాంగమే సమిత్తు;
ఆమెవాక్యములే ధూమము; ఆమెధరించినవస్త్రములే యంగారములు;
ఆమె యభినందనములే స్ఫులింగములు—అట్టి యోషిదగ్నియందు
నిత్యమును దేవతలు రేతోహోమముం గావించుచుందురు. కావున

నీవు మాయందుఁ గరుణింపుము. ఇదియే మహాఫలం బని భావించు చున్నాము. ఈస్థానం బపవిత్రం బని భావింతువేని చెప్పెదము విను ము. సామవేదంబున ద్వితీయవాక్యమునందు "ఇదియే ప్రధానమైన" దని ప్రజాపతి యానతిచ్చియున్నాఁడు. గర్భాధానాదికర్మంబులయం దు మహర్షులు దీనినే యనేకవిధంబుల గానముచేయుచుందురు." అని యనేకవిధంబులఁ బ్రోత్సహింప నారంభించిరి.

అక్కాంతలట్లు వివిధరీతులఁ బ్రార్థించుటయుఁ దపస్వియగు శివుండు వారియెడఁ బ్రసన్నుండై "ఓసుందరీరత్నములారా! మాకు గురుండును, స్త్రీజనంబులగతి కుపదేశకుండును, జతుర్దశభూతసర్గంబు నకు గురుండును, దివాచరంబులగుప్రాణులకు దివంబునను, నిశాచరం బులగుజీవగణంబులకు నిశాగమంబునను పాలకుండును, పితృస్వరూ పుండును, మాకు సర్వదా రక్షకుండును, చంద్రమండలంబున జలస్వ రూపంబుతో విరాజిల్లువాఁడును, పాతాళతలంబువఱకును వ్యాపించు కిరణంబులు గలవాఁడును, త్రిదశపూజితం బగునీవ్రతంబును నాకు బోధించినవాఁడును, నా కభిన్నుండును, నేనే యాతఁడుగా శ్రుతులచే నిర్దేశింపఁబడినవాఁడును, విష్ణుదేవునకుదక్షిణనేత్రమై ప్రకాశించుచు న్నవాఁ డగుసూర్యనారాయణుం డాకసంబున వెలుంగుచున్నంతవఱ కుమాత్రమే నేను భుజించుచుందును. నేను ప్రాఙ్ముఖుండనై మద్య మాంసశూకాదులగునభక్ష్యంబులను భుజింపను. అపేయంబులను పానము చేయను. నాభోజనమంతయును దోషవివర్జితమైనది. నేను కూర్చున్నప్పుడు నిత్యమును నాకు భోజనముపెట్టవలయును. ఆచమ నంబు చేసినప్పుడు రెండవసారి పానీయదానంబు గావింపవలయును. ఒకమునిపత్ని నాకుఁ గేశకీటవర్జితంబులగు ఘృతక్షీరంబులును, అ న్నంబును, శాకమూలఫలంబులును సమర్పించుఁగాక! మఱియొకతె

వస్త్రింబులను స్నానపానాదిద్రవ్యములను సమకూర్చుఁగాక! ఇదిగో నా దక్షిణహస్తమునందు భోజనపాత్రమున్నది. మీ రెల్లరు నంజలిబద్ధులై “భగవన్నమోస్తు” అనిమాత్రమే నాతో సంభాషింపవలయును. జానువులను భూమికానించి నాకు వందనంబు చేయవలయును. అనాదరము చూపినను, అగౌరవపఱచినను గూడ నేను సంతుష్టుండ నగుదును. నేనరణ్యమధ్యంబునఁ దరుకోటరంబులయందు శయనించుచుందును. ఈశబరీరూపిణియు, తపస్వినియు నగుగౌరియే నా చెంగట వెలుంగు నగ్నిమూర్తి. సృష్టిసిద్ధికొఱకు నేనీయగ్నియందే వీర్యక్షేపము గావించుచుందును. ఈసమస్తప్రాణులకును గావలసినవానినెల్లఁ గల్పించి యిచ్చువాఁడను నేనే. కావున మీరు మీవంటిపరమసుందరులగుపురుషులను జూచుకొని శీఘ్రముగ వారిచెంతకుం బోయి ప్రార్థింపుఁడు. వారు మీకుఁ బరితుష్టిం గల్పించి తామును మనోరథసిద్ధులు గాఁగలరు” అని బోధించెను.

మునిపత్ను లందఱు నవ్వాక్యంబు లాలించి పరిహసించుచు నాతని జుట్టుముట్టి క్రీడించుచు “ఓయున్మత్తా! ఆఁడువారియెదుట నికీవృథాశాస్త్రప్రసంగము లేల? స్త్రీ లెవ్వని గామింతురో యాతనినే యాశ్రయించుచుందురు. అతఁడు పరస్త్రీకాముకుండైనను నాతని విడువరు. ఇది సత్యమే కాకున్నచో నీడపలె నిన్నిగౌరి యేల వెంబడించి వచ్చుచున్నది? ఈజగంబున స్త్రీరత్న మతిదుర్లభమైనది. ఎవ్వనియెడలఁ బార్వతి సంతుష్టయై యుండునో యట్టిమహేశ్వరుఁ డొక్కఁడే ధన్యుఁడు. ఇఁక నీవృథావాదములతో నేమున్నది? బాలికయు, త్రిలోకసుందరియు నగునీశబరిని భార్యగాఁ బడసిననీవే ధన్యుఁడవు. ఓ వాగీశ్వరా! అట్టినీసమాగమసుఖము మేమును వాంఛించుచున్నారము.” అని వక్రోక్తులచేఁ బ్రార్థింపఁదొడంగిరి.

అప్పు డత్తాపసాగ్రేసరుం డగుమహేశ్వరుండు పరమానందభరితుండును, మోహమానుండును, గానచారియునై మునికాంతలప్రతి గృహంబునకును విచ్చేయుందొడంగెను. అట్లు వచ్చుచున్న పరమేశ్వరుం గాంచి మదనార్తలగు నక్కామినులు గృహంబులం బరిత్యజించి మధురాలాపంబులు గావించుచు నాతని ననుసరించి పోవ నారంభించిరి. ఆకోలాహలంబు నాలించి తపస్వు లందఱును దిగంబరుండును, నిర్లజ్జుండును, కామచారియు నగు నామహేశ్వరునిం జూడ నాతని సమీపించిరి. మఱియు నభిమానములం బరిత్యజించి తమతమభార్యలను మరలించుటకుం బ్రయత్నములం గావించిరి. వా రెంత యత్నించినను నెంతనిరోధించినను మునిపత్నులు తమభర్తలను బరిత్యజించి పోవుచునే యుండిరి. అప్పు డమ్మునులు క్రోధపరవశులై యాతనిని మహేశ్వరుంగా నెఱుంగక మూఢులై యాతని నిందించుచు దండంబులచేతను, వృక్షశాఖలచేతను, బ్రస్తరంబులచేతను, కమండలువులచేతను, హస్తంబులచేతను, అగ్నిసర్పకంటకాదులచేతను, వివిధాయుధంబులచేతను నాతనిం బ్రహరింపం దొడంగిరి. మునిపత్నులు క్షుద్బాధచే క్షీణకంఠలై యేమియుం జేయంజాలకుండిరి. అంతకుమున్నే దిగంబరలై యున్న మునిపత్నులు పతులవలన మృగచర్మవల్కలాదులచే నాచ్ఛాదితలయ్యును వాని నంగీకరింపక త్యజించి యాశబరీపతితోనే పోవంగడంగిరి.

అనంతరము రుధిరసిక్తం బగుదేహంబుతో నమ్మహేశ్వరుండు వసిష్ఠునిగృహద్వారంబుకడకుం బోయి మెల్లమెల్లంగా, 'భవతి! భిక్షాం దేహి' అని యాచించుచు నరుంధతీదేవిం గాంచి 'ఓవామలోచనా! ఓశుభాననా! నేను శంకరుండను. నీయింటి కతిథినై వచ్చితిని. నన్నియాశ్రమవాసులందఱును బ్రతాడితునిం గావించిరి. ఓదేవీ! నా

యీకోమలదేహము నవలోకింపుము. ఓవరారోహా! మునులచే జర్జ
రీకృతమైపోయిన యీనామనోహరరూపము నవలోకింపుము." అని
వక్రోక్తులచే దక్షకన్య యగు నరుంధతిని బ్రలోభితను గావింపఁజూచి
యస్పష్టముగఁ దనసుందరాంగంబులఁ బ్రదర్శింపనారంభించెను. అరుం
ధతియు నాతనిఁ బుత్త్రభావంబుననే కాంచి శీతలజలంబులచే సకలాం
గకంబులను గడిగి కామధేనుఘృతంబుచే మర్దనం బొనర్చి మరల జల
ప్రక్షాళనంబుఁగావించి యనేకవిధంబు లగుదివ్యాంగరాగంబులచే నా
తని ననులిప్తుం జేసి పుష్పగంధాద్యలంకారంబులచే విభూషితు నొన
ర్చెను. పిమ్మట మహామూల్యం బగునాసనంబును, సుగంధధూపం
బును, మంత్రపూతంబగు పాద్యంబును, సుందరం బగుచామరవ్యజ
నంబును, సువర్ణపాత్రంబును, నిరామయంబగునాహారంబును, కవోష్ణ
పాయసంబును, వివిధంబులగు మనోహరభక్ష్యంబులును, ఘృతదధిక్షీ
రాది పానీయరసంబులును, నానావిధఫలమూలంబులును, బహువిధ
మాంసంబులును సమర్పించి యాతనిఁ బూజించెను. పిమ్మట శంకరుం
డనుచరసహితముగా స్నానంబుసేసి పార్వతితోఁ దానును నరుంధతిచే
సంతర్పితుం డయ్యెను. అప్పుడు తపస్విని యగునరుంధతీదేవి 'ఓపర
మేశ్వరా! నీకు నమస్కారము. ఓకుమారా! ఇఁక నీవు యిచ్చ
వచ్చినచోటికిఁ బొమ్ము.' అని సెలవిచ్చుటయు నతిథియగునద్దేవుండు
సంప్రీతుండై యామెవచనంబులకు సమ్మతించి, 'ఓదేవీ! నీవు ధర్మ
మును వర్ణించితివి. అర్హుల మగుతాపసులము మేము నీపరిచర్య
లచే సంతుష్టుల మైతిమి. నీకు సౌభాగ్య మగుఁగాక! కుమారులుం
డును, వృద్ధుండును నగునీభర్త మరల యౌవనవంతుఁడై దేవతలవలె
నజరుండును, సుందరాకారుండును నగుఁగాక!' అని యాశీర్వదించి
యామందిరంబునుండి వెలువడి వసిష్ఠునిచేఁగూడఁ బూజితుండై కదలి
చని వనమధ్యంబునం బ్రవేశించెను.

అప్పుడు తక్కినమునిపత్ను లందఱు నున్మత్తలై భ్రమరంబుల వలె నాతని సేవింప నారంభించిరి. అది చూచి వారిభర్త లెల్లరును నీర్ష్యాపరవశులై మఱలఁ జుట్టుముట్టి నలదెసలనుండియుఁ బ్రహరింపఁ దొడంగిరి. సర్వభూతాత్ముం డగునద్దేవుం డాప్రహారంబులకు వికల శరీరుండై యించుకంతయైన వగఁజెందక నవ్వుచు సుందరీమణులతోఁ గ్రీడించుచు సంతుష్టుండై పయనంబు సాగించుచుండెను. అమ్మహేశ్వరుండు తమకాంతలతోఁ గలిసి నవ్వుచు విహరించుచున్నకొలఁది తాపసులక్రోధానలము ప్రజ్వరిల్లిపోవుచుండెను. ఈవిధముగాఁ బల డెండువత్సరంబులు గడచెను. దేవదేవుం డమ్మునివరులచే నిరంతరము బాధితుం డగుచుండియు నొక్కకఠోరవచనమైనను, నొక్కప్రతివిధానమైనను నెవ్వరియెడలను గావింపలేదు. ఈరీతిగా నమ్మునుల సకలాస్త్రంబులును సంక్షయంబు లగుటయు భృగుప్రభృతు లగు నమ్మహర్షులు ‘ఓకృతక తాపసా! నీలింగము భూపతితం బగుఁగాక!’ అని శపించుచు, ‘దురాత్మా! పరదారరతుండ వగు నిన్ను శిక్షించుటకు నిమ్మహారణ్యంబున మా కెవ్వండును రాజు లేఁడు. పరకాంతాసక్తుండును, విగ్లజ్జుండు నగుదుష్టునకు లింగచ్ఛేదనంబుకంటె నితరంబగు శిక్ష యేదియును లేదు. గురుదారరతుం డగువాఁడు వృషణసహితంబుగ లింగమును ఛేదించుకొని యంజలియం దుంచుకొని మరణార్థియై దక్షిణాభిముఖంబుగఁ బోవలయును. మూర్ఖుండవు, దురాచారుండవు, దుర్మతివి, పరక్షేత్రాపహారివి నగునిన్ను మేమే స్వయముగ శిక్షింపవలసివచ్చినది. ద్విజుండైనను, మునియైనను, ఆతతాయియైనచో నాతని శస్త్రములచే వధించినను దోషంబు లేదు." అని నిందింప నారంభించిరి. అమ్మునులశాపప్రభావంబున నాక్షణమందే యామహారణ్యమధ్యంబున బహుయోజనవిస్తీర్ణంబును, పరమసుందరంబు

ను నగుసద్దేవునిదివ్యలింగము సతీదేహంబున నిపతితం బయ్యెను. ఆలిం
గము విజయనామంబునఁ బ్రసిద్ధం బయ్యెను. మహాదేవునిప్రకాశ
మానం బగు దివ్యతేజము భూపతితం బగుటయు జగమంతయు నంధ
కారమయమై మునిహృదయంబు లజ్ఞానావృతంబు లయ్యెను. అప్పు
డరుంధతీదేవి వసిష్ఠుం గాంచి 'స్వామీ! మునివరులశతసహస్రాఘా
తంబులఁ గాంచుచుండియు నించుకంతైన వ్యథ నొందని యాదిగం
బరతాపసుఁడు మహాదేవుఁ డని నే ననుమానించుచున్నాను. అతఁ
డెట్టిక్రోధమును వహించుట లేదు. కొట్టినవారిని మరలఁ గొట్టుట
లేదు. ఆతఁడు నిజముగఁ జంద్రశేఖరుండే. సందేహములేదు. ఆశబ
రీరూపధారిణి నాభగిని యగుగౌరియే యని తోఁచుచున్నది. ఆమె
తోడిస్త్రీ లందఱును మాతృగణంబులును నాతనితోడిపురుషు లంద
ఱును ప్రమథగణంబులు నై యుందురు. మన ముభయులమును గృ
హస్థాశ్రమము నవలంబించి సంపాదించుకొన్నపుణ్యమువలన శిథిలాం
గుం డగునమ్మహాదేవుం డక్షతాంగుం డగుఁగాక! దివ్యం బగునీజ్ఞాన
తేజంబుచే నీయంధకారం బంతయు దూరం బగుఁగాక!' అని పలు
కుటయుఁ బ్రజాపతి యగువసిష్ఠుండు ధ్యానయోగంబుచేఁ బరమేశ్వ
రుని సందర్శించి 'ధర్మజ్ఞురాల వగునోశుభాననా! మహాదేవునివిషయం
బున నీ వనిన ట్లంతయు నగుఁగాక!' అనియెను. వసిష్ఠవచనానుసారం
బుగ బాలేందుశేఖరుండైన యమ్మహాదేవుం డక్షతాంగుండై యవ్వ
నమధ్యంబున సంచరింప నారంభించెను. ఆదేవదారువనంబు నాక్ర
మించిన ఘోరాంధకారంబు దూరీభూతం బయ్యెను. మునీంద్రుల
హృదయంబులయందలిక్రోధం బంతయు నుపశమించెను. అప్పు డత్తా
పసు లాదిగంబరుని వృషభధ్వజునిఁ గా నెఱింగి యనేకప్రకారంబుల
స్తుతియింపం దొడంగిరి. ఆసమయంబున నాకాశవాణి 'ఓమునీంద్రు

లారా! మీ రీరుద్రదేవునిలింగమును ప్రతిష్ఠితముఁ గావించితిరి. ప్రభుండగు నిమ్మహేశ్వరుని యీదివ్యలింగము సకలసిద్ధులను బ్రసాదించుటకు సమర్థమైనది. కావున మీరు త్రికరణశుద్ధిగ వేదమంత్రములచే దీని నర్చింపవలయును. శంకరుని ప్రతిమాపూజనముకంటె లింగార్చనమే యధికఫలప్రదమైనది.' అని ప్రబోధించెను. ఆమాటలు విన్నంతనే మునివరు లభిమానమును బరిత్యజించి యాసనాదిషోడశోపచారంబులచే నాశివలింగమును బూజించిరి.

ఈవిధముగా మహామునీంద్రులు మహాదేవుని లింగమును ప్రతిష్ఠితముఁ గావించి పూజ యొనర్చిరి. హస్తాదిబాహ్యావయవంబుల కాధారభూతుండును, లింగాంకుండును, బరమాత్ముండును, నవ్యయుండును, హృదయస్థితుండును, చిత్స్వరూపుండును నగుబ్రహ్మము నమ్మునివరు లెఱుంగకుండుటచేతనే యిట్లు లింగపూజ గావించి యుండిరి. హృదయస్థుం డగునమ్మహాదేవు నర్చించుట లింగపూజకంటె శతగుణంబు లధికమైనది. ద్విజవరు లగ్నియందును, యోగులు మనస్సునందును, మూర్ఖులు పాషాణములయందును, జ్ఞానులు సర్వప్రదేశంబులయందును శివునిఁ బూజించుచుందురు. పాషాణమయం బగులింగార్చనముసేయువారు స్వర్గసుఖానుభవమ్ముం గాంచి పిమ్మట రాజ్యప్రాప్తు లగుదురు. స్వదేహస్థుం డగు నీశ్వరునిఁ బూజించువారు క్రమంబుగ రాజ్యమును, స్వర్గమును, మోక్షమును బడయుదురు. సకలవస్తువులయందును నద్దేవుని సందర్శించి యర్చించువారు శివసాయుజ్యముఁ గాంతురు. హృదయమధ్యంబున నాతని ధ్యానించువారు మరణానంతరంబున మస్లభలోకంబులయందు సుఖభోగంబు లనుభవించి మోక్షప్రాప్తు లగుదురు.

మహాదేవుం డీవిధంబుగ ద్వాదశవర్షంబులు యథేచ్ఛావిహా

రంబుసేసి సకాము లగు మునులయు మునిపత్నులయుఁ జాపల్యంబును,
నరుంధతీవసిష్ఠులధైర్యమును నక్షత్రధారు లగుక్షపణకాములపరిహాస
చేష్టితంబులును భూమండలంబునఁ బ్రదర్శించి సతీదేవీసహితంబుగఁ
బ్రమథగణంబులతో సద్దారుకావనంబున నంతర్హితుం డయ్యెను.
ఈజగం బంతయును గామమయమైనది. చపలత్వమున దోషము
న్నను పరమాత్మున కందువలన నట్టిబాధయును లేదు. శబ్దాదులును
భోగాదులునుగూడ నీశ్వరునియందే యుండి యీశ్వరస్వరూపంబులై
యీశ్వరునియందే లయంబు గాంచుచుండును. పతివ్రతలయెట్టికా
ర్యంబును నాశ్చర్యకరంబు గాదు. వారు తమతమాత్మనాథులవలననే
సంతృప్త లగుచుందురు. తిండిపోఁతగువాఁడు భోజనంబునకై సర్వదా
గృహస్థులయిండ్లకుఁ బోవుచుండును. భిక్షుకుం డగువాఁ డెవ్వఁడుం
డఁగా నాతనికిఁ బెట్టకుండ నేగృహస్థుఁడు భుజింపఁగలఁడు? అర్థవంతు
లకే సర్వదాభయము. అజ్ఞులును, వర్ణాశ్రమరహితులును, నిర్లజ్జు
లును, చంచలులును, నిందితులును, దుష్టులును, మలసహితులును,
తత్కారణంబున రోగయుక్తులును, కామక్రోధవివశులును పతితులును
శోకయుక్తులునునగువారెల్లరు నశించుచుందురు. శంకరవ్రతానుష్ఠానప
రులకెన్నఁడును నాశంబు లేదు. మజ్జాశనుండును, బ్రచండుండును, బలివాత
యుతుండును నగుమహాదేవునకుఁ బండ్రెండువత్సరంబులు శ్రద్ధాభక్తు
లతో భిక్షపెట్టుటకు వసిష్ఠుండుగాక మఱియెవ్వండు సమర్థుం డగును?
మహాదేవుని మనోహరదేహస్పర్శనంబునఁ గామపీడిత గాకుండుటకు
నరుంధతిగాక మఱియేరమణీమణి సమర్థురాలగును? వివాహసమయం
బున సభాస్థలంబున గురుజనంబు లేదేవినామకీర్తనంబులు గావించుచు
ఓకుమారీ! వసిష్ఠమహిషి యగు నీయరుంధతిని సందర్శింపుము.
ఓతల్లీ! నీవు పతివ్రతామాహాత్మ్యమును గోరెదవేని యీదేవిని నమ

గ్నింపుము. ఈ మేను దర్శించినచో నీవును సాధ్వి వయ్యెదవు. లేకున్న నసాధ్వివగుదువు.' అని పరిబోధింతురు.

## —♦ కామార్తులగు నింద్రాదులవృత్తాంతము ♦—

మహర్షిశేఖరులారా! యక్షరాక్షసదేవాసురోరగాదులను జయించి త్రైలోక్యరాజ్యంబును బాలించుచు నింద్రుండు, శచీవిభుం డయ్యును సుఖభోగార్థియై యనేకులగునప్సరోరమణీమణులంగూడి విహరించుచుండియుఁ గామసుఖంబున సంతృప్తుండు గాకపోయెను. అతఁ డహల్యారూపముం గాంచి ముగ్ధుండై యొకప్పుడు అస్థిచర్మావశిష్టుం బగుగౌతమునివృద్ధరూపముం దాల్చి యాతనిపర్ణకుటీరంబునఁ బ్రవేశించి యట నసహాయయై యున్నయహల్యను భ్రమింపఁజేసి యుపభోగించుచు నిస్సంకోచముగ విహరించుచుండెను. ఇంతలో ఫలమూలసంగ్రహంబు గావించుకొని గౌతముం డింటికేతెంచెను. తనకడను, వాకిటను గానంబడుచున్న యభిన్నంబగువాగౌతమమూర్తిద్వయముం గాంచినంతనే యహల్య విస్మితయై పాపభయావేశంబున శిలావిగ్రహముంబోలి నిలువున నిశ్చేష్టయైపోయెను. అప్పుడు గౌతముండు లోపలఁ బ్రవేశించి విస్మితుండును, శంకితుండును, క్రోధోజ్జ్వలితుండునై చూచుచుండఁగనే యహల్యాకాముకుం డగుమహేంద్రుండు లజ్జితుండై మహాభయంబునఁ బాఱిపోవుట కుద్యుక్తుం డయ్యెను. అది చూచి గౌతముండు ప్రళయకాలానలునింబోలి మండిపడుచు దివ్యదృష్టిచే నంతయు గ్రహించి 'ఓరోరి పాపాత్మా! నీవు వంచకుండవై వచ్చి యేకాకినియై యింటనున్న మునిపత్నిని గళంకితం గావించితివి. కావున పతికాముకుండ వగునీవృషణద్వయము భూపతితం బగుఁగాక' అని శపించెను. ఆశాపప్రహారముచే నాక్షణంబుననే

యముతోనుగ్రంపు ఘూర్ణితాంగుండయ్యెను. అట్లు నాకాధీశ్వరుండు నిర్వీర్యుండై పోవుటయు దేవత లాతనికొఱంతను దీర్పందలంచి యాస్థలంబున మేషాండంబులం జేర్చి సవీర్యుం గావించిరి. అప్పటినుండియు సురపతి మేషాండుం డయ్యెను. మఱియు నమ్మునిశాపంబువలనే శతముఖుండు సహస్రమాసమ్ము మూఁడుకోట్లవత్సరంబులు లంకయందు రాక్షసులచే బంధితుండై యుండెను. అప్పటినుండియు నింద్రపదంబునకును, నింద్రాదులకును స్థిరత్వంబు లేకుండఁబోయెను. రూపవతి యగునహల్యయు, స్వామిక్రోధంబుచే దగ్ధయై యాస్థలంబుననే యచేతనం బగుశిలారూపమ్ముం గాంచెను. కాలాంతరంబున నద్దేవి పులస్త్యవంశంబున కనలమూర్తియు, నారాయణావతారుండు నగుశ్రీరామచంద్రపదస్పర్శంబుచే మరల నప్పటియాకృతిం గాంచి నిష్కలంకయగు నామె మరల నాత్మేశ్వరుం గలసికొనియెను. అనంతరము విష్ణుదేవు ననుగ్రహంబుచే నింద్రుండును సుందరాంగుం డయ్యెను.

పరదారరతుం డగునింద్రుం డిట్లపరాధగ్రస్తుం డయ్యును నొకప్పుడు పరీక్షిత్తనయుం డగుజనమేజయునిభార్య వపుష్టమరూపయౌవనవిలాసంబులం గాంచి ముగ్ధుండై యాక్షణంబుననే మానవమూర్తిం దాల్చి భూలోకంబున కేగి యెంతప్రయత్నించినను బతివ్రత యగునామెను బడయఁజాలకపోయెను. తుదకు శతముఖుండు జనమేజయుండు యజ్ఞంబు గావించుచున్నసమయంబున మరణించిన యజ్ఞాశ్వశరీరంబునఁ బ్రవేశించి మూఢత్వంబున నారాజ్ఞిమణి నెట్లయిన స్పృశించి సంతుష్టిం గాంచవలయు నని ప్రయత్నించెను. కాని యాతఁడు లబ్ధమనోరథుండు గాఁజాలక యుత్తమంబగు నమ్మఖంబునుమాత్రము వికలంబుగఁ జేసివైచెను.

ఒకప్పుడు దేవతారమణీమణు లనేకలు చేరి తమతమహావభా

హావములచేతను, కటాక్షంబులచేతను, విలాసాతివిభ్రమంబులచేతను మహాదేవుని మోహింపఁజేయం దొడంగిరి. సంసారోన్మోచకుండును, ద్రితనిష్ఠుండును, కామారియు నగునమ్మహేశ్వరుండు వారిచేష్టితంబుల కెంతమాత్రమును జలింపక శిలాసూత్రివలె సుస్థిరుండై యుండెను. అప్పుడు మహేంద్రాదిదేవతలు తనుయుపచారంబునకు భీతులై రత్నమాల్యాదులచేతను, షోడశోపచారంబులచేతను నద్దేవు నర్చింప నారంభించిరి. కాని యచంచలుండగు నప్పరమేశ్వరుని నిర్వికల్పసమాధినుండి చలింపఁజేయుట కెవ్వరును సమర్థులు గాఁజాలకపోయిరి. అట్టి సమయంబునఁ గామదేవుండొకఁడుమాత్రమే యొకదేశంబున లమ్మహేశ్వరు నాశ్రయించి యుండఁగలిగెను. ఈజగంబంతయు నామ దేవునిప్రభావంబుచే నిండియున్నది. ఇతరులసాహాయ్యం బెంతమాత్రమును లేకుండ సర్వజీవులను స్వాధీనులుగఁ జేసికొని త్రిజగంబుల యందును విజయంబు గాంచుప్రభావముగల మహావీరుం డాతఁడొక్కఁడే. అట్టిదుర్జయుండగు కాముని జయింపఁగోరువాఁడు, విశ్వకారణుండును, సర్వధర్మమయుండును, చిదూపుండును, సపరిమేయుండు నగుపరమేశ్వరు నారాధింపవలయును.

ఒకప్పు డగ్నిదేవుండు జగదేకసుందరీమణు లగుసప్తర్షిపత్నులం గాంచి కామమోహితుండై మదావేశంబున నోడ లెఱుంగక యుబ్బుపులంబట్టిపోయెను. అయ్యరణ్యమధ్యంబునఁ గృత్తికాభిధాన లగుతారరుస్త్రీలు మునిశాపంబులనుండి నైశ్వానరునిరక్షింపందలంచి తామ మునిదారలరూపంబులం దాల్చి క్రమక్రమంబుగ నయ్యగ్నిదేవుని బరితృప్తుం గావించిరి. అందొకకృత్తిక గరుడరూపంబు ధరియించి యయ్యనలునియమోఘవీర్యంబును గొనిపోయి శ్వేతాచలశిఖరంబున సువర్ణకుంభమధ్యంబున నిక్షేపించుచు సంతానోత్పాదనంబుఁ గావిం

చెను. ఆషట్కృత్తికలకును జన్మించినపుడాతండు కార్తికేయుం
డనునామంబునఁ బ్రసిద్ధుం డయ్యెను. ఆకృత్తికలు కామరూపధార
ణంబున సమర్థ లయ్యును వసిష్ఠపత్నియుఁ దపస్వినియుఁ బతివ్రతయు
నగునరుంధతిరూపమునుధరింపఁజాలకపోయిరి. ఆకృత్తికాతనయుఁడు పా
ర్వతీనందనుండై దేవసేనాపతిత్వమునొంది క్రౌంచమదభంగంబును తార
కాసురసంహారమ్మును నొనర్చెను. అయ్యర్చిష్మంతుండు నిజదారయగు
స్వాహాదేవివలనను షట్కృత్తికల వలనను గూడఁ గామోపభోగంబులం
దనియక బ్రాహ్మణరూపధారియై కర్ణాటదేశంబునఁ బరమసుందరీమణు
లగు దాక్షిణాత్యకామినుల నుపభోగింపవలయు ననుకుతూహలముతో
మాహిష్మతీనగరంబునం బ్రవేశించెను. ఆపట్టణంబున కధీశ్వరుండగు
నీలుం డనుమహారాజు కపటబ్రాహ్మణవేషియగు హవ్యవాహనుని
దుర్వృత్తంబునుగ్రహించి యాతని నిర్బంధితుం గావించి తనరాజ
ధానికి సముజ్జ్వలప్రకాశమును గూర్చు భృత్యునిగా నొనర్చెను.

మహాబలపరాక్రమసంపన్నుండును జగత్ప్రాణుండును, స్థావర
జంగమాదులయందు పంచవిధరూపంబులచే సంస్థితుండును, సప్తవిధ
దివ్యభావంబులచే జగద్వ్యాప్తుండును, నదితిపుత్త్రుండును, నలువదితొ
మ్మిరూపంబులచే నమరరాజ్యంబును నిష్కంటకంబుగఁ జేయఁగల
సమర్థుండును, బరమయోగిజనంబుల కారాధ్యుండును, బరమాత్మస్వ
రూపుండును, సనాతనుండును నగువాయుదేవుండు త్రిజగచ్ఛ్రేష్ఠుం
డయ్యును కామునికి వశీభూతుం డయ్యెను. ఒకప్పు డాతఁడు రూప
యౌవనసంపన్నలును, లావణ్యవతులును, సత్కులప్రసూతలును, సౌ
భాగ్యవతులును నగుకుశనాభుని తనయలను మార్గమునఁగాంచి కుసుమ
శరపీడితుండై వారినెట్లయిన వశపఱచుకొనవలయు నని యేకాంతస్థా
నంబున మగ్నలును, లజ్జావతులును, విభీతహృదయలు నగుకన్యక

లను సందర్శించి యనేకవిధంబులఁ బ్రయత్నింప నారంభించెను. కాని, యాతఁ డెట్లును సఫలమనోరథుండు గాకపోయెను. పిమ్మట నాతఁడు ప్రత్యేకంబుగ నొక్కొక్కకన్యకం గలిసికొని ' ఓసుందరీమణీ! నేను వాయుదేవుండను. త్రిభువనంబులవారును నన్ను దేవునిఁగాఁ బూజించుచుందురు. నేనుపరమాత్మను. ఈజగంబునందే నేనే శ్రేష్ఠుఁడను. నాకు జరామరణంబులు లేవు. నేను సకలవస్తువులకును భోక్తను. సకలశక్తులకును సృష్టను. సకలప్రాణులకును జీవాత్మను. నన్నుండియే యమృతం బుత్పన్నం బైనది. అట్టి నేను నిన్ను పూజించుచున్నాను. ప్రార్థించుచున్నాను. త్రిలోకసుందరం బగునీదేహమును నాకు సమర్పింపుము. ఓదేవీ! రూపవతు లగు నీసోదరీరత్నము లందఱియందును నేను బద్ధానురాగుండనై యున్నాను. మీ కందఱకును శరణాగతుండను. మీరెల్లరును నాయభీష్టంబును నెఱవేర్పుఁడు.' అని వేఁడికొనఁ జొచ్చెను. అప్పు డక్కన్యక లొక్కొక్కరుగా నిట్లని చెప్పం దొడంగిరి. " ఓవృద్ధా! నీవెట్టివాఁడవైనఁ నగుదువుగాక! మేము కన్యకలము. నీ వెవ్వనిచే నేకర్మంబున నేయుద్దేశంబున నేస్థానంబున నెందుకొఱకు నియుక్తుండవైన నగుదువుగాక! నీయీవాక్యంబులవలన నెట్టి ప్రయోజనంబును లేదు. మేము మాతండ్రిగారి కధీనలమై యున్నాము. కన్యకలకుఁ దమయంత నాత్మప్రదానంబు గావించుటకుఁ దగిన స్వాతంత్ర్యము లేదుగదా! బ్రహ్మపుత్త్రుం డగుకుశుండు మాపితామహుండు. ఆతనిపుత్త్రుండును క్షత్త్రియకులాలంకారుండును నగు కుశనాభుండు మాజనకుండు. ఇట్టి మేము స్వధర్మము నెట్లతిక్రమింపఁగలము.' అని ప్రత్యుత్తరం బిచ్చుటయు వాయుదేవుండు క్రోధోజ్జ్వలుండై యక్కన్యకలను కుబ్జలుగను, వికృతలుగను, వివిధరోగగ్రస్తలుగను జేసివైచెను. అది యంతయు నెఱింగి వారిపితామహుండును

మునిశ్రేష్ఠుండును నగుకుశుం డక్కన్యకాశతంబును మరల దివ్యసుం దరమూర్తులం గావించి బ్రహ్మపుత్త్రున కొక్కనికి సంప్రదానంబు చేసెను. మహారాజగుకుశనాభుండు తనకన్యకాశతనామంబు శాశ్వతం బగునట్లుగాఁ బూర్వదేశంబునఁ గన్యాకుబ్జం బను నొకనగరంబును నిర్మాణం బొనరించెను.

చండరశ్మియు, కల్పానలకీలాసదృశరోమరాజీవిరాజితుండును, అగ్నికుండసన్నిభనయనుండును, విద్యుత్సంకాశకుటిలశ్మశ్రుశోభితుండును, యోగిధ్యానగమ్యుండును, వ్యోమచారియు, బ్రహ్మేంద్రాది పూజితుండును నగుమార్తాండుండు బ్రహ్మపుత్త్రికయు, రూపవిలాస వతియు నగుసంజ్ఞాదేవిని బెండ్లియాడి యామెసమాగమంబును గోరి యనేకప్రియవాక్యంబులచే నద్దేవిని బ్రార్థించెను. సంజ్ఞాదేవియుఁ బ్రభాకరుని తీక్ష్ణరూపంబుం జూచి యాతని స్పృశింపఁజాలకపోయెను. అప్పుడు సూర్యదేవుండు తనపత్ని నుద్దేశించి నీవెట్లు చెప్పిన నట్లు నడచుకొనెదనని యతిదీనముగ వేఁడికొనియెను. అంతట సంజ్ఞాదేవి నవ్వుచు " ఆర్యా! నీయాతీవ్రతేజమును తగ్గించుకొని తీక్ష్ణం బగుశాణ యంత్రంబు నధిరోహింపుము. అప్పుడు మాతండ్రి నిన్ను తఱిమెనఁ బెట్టి నీయుష్ణత్వము గొంత తగ్గింపఁగలఁడు. అట్లయినచో నీవు నాకు స్పర్శనీయుండగు ప్రియుండ వగుదువు." అనుటయు, నాదిత్యుం డట్లే యని శాణయంత్రారోహణం బొనర్చెను. అప్పుడు త్వష్ట్రప్రజాపతి దేవాసురసహితుండై యాభాస్కరుని తక్షితునిం గావించెను. కాని యతనితేజంబు తగ్గక మఱియు శతగుణంబు లధికత్వము నొంది తేజరిల్లఁదొడంగెను. అమ్మార్తండచూర్ణమును గైకొని దేవత లందఱును సహస్రధారాకలితం బగువిష్ణుదేవునిసుదర్శనమును నిర్మించిరి.

మఱియు నామార్గముచే మహాదేవుండు దేవతల కందఱకును ననేకా స్త్రములను గల్పించియిచ్చెను.

సూర్యపత్నియగుసంజ్ఞాదేవి యతిదారుణం బగు నాత్మేశ్వరుని మూర్తిని సందర్శింపఁజాలక యశ్వినీరూపిణియై పాఱిపోవుచుండెను. మార్తండుండును అశ్వరూపమును దాల్చి బలవంతముగ నామె నాక్రమించుటకు వెంబడించెను. ఆసమయంబునఁ గామాతిరేకంబుచే నాదిత్యునికి రేతఃపాతం బగుటయు, దానివలన రేవంతుం డనుభిషగ్వరుం డుత్పన్నుం డయ్యెను. పిమ్మట సూర్యదేవుండు మరల సంజ్ఞాదేవి నాహ్వానింప, యోగిని యగునామె వంచనచేఁ దనఛాయామూర్తిని గల్పించి నాథునిచెంత నునిచి యాతని మోహితునిఁ గావించి యంతర్హిత యయ్యెను. భగవానుం డగుభానుండు ఛాయాసంజ్ఞం దలిసికొని యామెవలన నీలాంజనపరిభాసంపన్నుండగు యముం డను పుత్త్రుని, నీలోత్పలసన్నిభ కమనీయపుణ్యవాహిని యగుయమున యనుకన్నియను గాంచెను. మఱియు, సూర్యదేవుండు కుంతియనుకన్యకచే నాహ్వానితుండై యామెను జేరి కవచకుండలాలంకృతుం డగు కర్ణుం డనుకుమారు నామెకుఁ బ్రసాదించెను.

అమృతమథనసమయంబున క్షీరసాగరంబున నుదయించినవాఁడును, మరల ననసూయాగర్భంబున జనియించినవాఁడును, పరమసుందరుండును, జగదాహ్లాదకరుండును, మహాబలశాలియు, నరనారీమణులకును, బ్రాహ్మణులకును, నోషధులకును బ్రభుండును, రాజసూయయజ్ఞకర్తయు నగుచంద్రుండు నశ్వినీప్రభృతిసప్తవింశతినక్షత్రంబులను నాథుండై పరమానందనిమగ్నుండై యుండెను. ఆతఁడును గామవశీభూతుండై రోహిణియం దత్యాసక్తుఁ డగుటచే దక్షశాపంబు గలిగి క్షయరోగగ్రస్తుండయి, సర్వదా కృష్ణపక్షంబులయందు క్షీణిం

చుచుండెను. అట్లుండియు, సుకృతవిహీనుండగు నా సుధాకరుండు కామపరవశుండై బృహస్పతిభార్యయగు తారనపహరించి చిరకాలంబు తత్సుఖంబనుభవించియు దేవతలతో ఘోరయుద్ధంబు సంప్రాప్తంబగుచుండుటను నామెను తిరిగి యామెభర్తకు నీయంజాలకపోయెను. ఇట్టిసమయ మందలం గుపితుండై యామెవలనం దాను గన్నకుమారుం డగు బుధునిం గైకొనకుండ విడువలేకపోయెను.

పూర్వకాలంబున నారాయణోరుసంభవయు, నింద్రాజ్ఞానువర్తినియు, యువతియు నగు నూర్వశిం గాంచుటచే నుగ్రతపస్వులగు మిత్రావరుణులకిరువురకును రేతఃస్ఖలనం బయ్యెను. అప్పు డయ్యిరువురు మునులును దమయమోఘవీర్యంబులను జలకుంభమధ్యంబుల నిక్షేపించిరి. అంత మిత్రతేజంబున వసిష్ఠుండును, వరుణతేజంబున బడబానలసదృశుం డగు నగస్త్యుండును సముత్పన్నులైరి. సాగరజలంబునంత నవలీలగఁ బానముచేసినవాఁ డీయగస్త్యుఁడే.

మహామునులారా! ఇంద్రుఁడు, అగ్ని, వాయువు, సూర్యుఁడు, చంద్రుఁడు, ఆచార్యులగు మిత్రావరుణులు నిజతేజఃప్రభావముచేతను, విమలజ్ఞానముచేతను, వరేణ్యు లయ్యును గామాసక్తులై పోయిరి. నేనిప్పుడు వారియనుచితవ్యాపారములం గూర్చి సవిస్తరముగా వర్ణించితిని. మఱియు, గామాధీను లగు ఋషుల చరిత్రము గూర్చి చెప్పెద నాకర్ణింపుఁడు.

## —♦ కామాధీను లగు ఋషుల చరిత్రము ♦—

సమర్థుండును, శౌర్యదాక్షిణ్యశాలియు, శ్రౌతస్మార్తక్రియాసక్తుండును, తుష్టి, విరక్తి, ప్రీతి, శాంతి, ధృతి, విద్యాత్రయము, స్వాధ్యాయము, స్నానము, దానము, బ్రహ్మచర్యము, ఆర్జవము

మొదటగుసద్గుణంబులచే నలంకృతుండును, నగునారదుండు విద్యు త్జిహ్వ యనునచ్చరను బ్రహ్మలోకంబున గాంచి మోహితుండ య్యెను. పద్మసంభవుండుగూడ ననాసక్తయు, నిరపేక్షయు నగునా మెను మోహించెను. అప్పు డయ్యచ్చర కపిలగోరూపమునుదాల్చి విరించిని వంచించి శపించుటయు, నాతండు వృద్ధయు, వంధ్యయు నగు నామెగుఱ్ఱము ననుసరించి పోయెను. అంతియ కాక పద్మసంభ వుండు, తన తనయ యగుసరస్వతినాశ్రయించి ప్రజాసృష్టిఁ గావింప నారంభించెను. అతఁ డొకచో మానసికంబుగనుఁ నొకచో వాచికం బుగను, ఒకచో శారీరకంబుగను సృష్టిచేయుచుండెను.

మరీచినందనుండగు కశ్యపుండు కామదేవునకు వశీభూతుండై లోకపూరణంబుకొఱకు దక్షుని చెంతకుంబోయి యాతనితనూజలను బదుమువ్వురను భార్యలుగాఁ జేసికొని యందఱివలనను దేవదానవా దులగుసంతానంబుగాంచెను. ఆసంతానమువలన సదసదాత్మకంబగునీజ గంబంతయు నిండిపోయెను. సముద్రోదకమును బానము చేసినట్టియు, వింధ్యాచలదర్పమునుభంజించినట్టియు, మహాపాపుండగువాతాపిదైత్యుని భక్షించినట్టియునగస్త్యమునీంద్రుండు మహాయోగియయ్యునుకల్పాంత దహనసదృశుం డయ్యును బత్నియగు లోపాముద్రకు భృత్యప్రాయుం డయ్యెను. బ్రహ్మచర్యవ్రతతత్పరుండును తపస్వియు నగుశమీకుం డనుమునీంద్రుండు గగనభాగమునుండి 'నీవే నాప్రియుండవు. నన్నుఁ బరిగ్రహించి నాప్రాణదానమును గావింపుము.' అను చిత్తచాంచల్య కరంబులును, మధురంబులును, పరిస్ఫుటంబులు నగువాక్యములనాలించి యవి స్త్రీవాక్యంబు లని గ్రహించి యంతలో నె కుశాసనంబున రేతః పాతంబు గావించెను. ఆస్త్రీగర్భమునుండి వృషభవక్త్రుండును, నతి క్రోధియు నగు శృంగి యను పుత్త్రుండు గలిగెను. అతఁడే నరుపతి

పరీక్షితుని శపియించి భస్మీభూతునిం గావించినవాఁడు.

మఱియు భృగుకులం బను నాకాశంబునకుఁ జంద్రస్వరూపుం డును, తాపసాగ్రగణ్యుండును, నగు రురుండు ప్రమద్వరను బెండ్లియా డియు విషదగ్ధ యగుటచే నామెవలన సుఖానుభవము గానక కామ రోషంబుచే దేహత్యాగంబుసేయ నుద్దేశించి ఘోరారణ్యమధ్యం బులం బడి పోవుచుండెను. దేవత లాతనిం గాంచి జాలిఁబడి 'ఓము నివరా! నీపరమాయువునం దర్ధభాగము నీభార్య కొసఁగ నిచ్చగింతు వేని యీయామె జీవింపఁగలదు. ఈమె కితరహేతువులచే మరణంబుగలు గదు.' అని యనుగ్రహించిరి. అంత స్త్రీకాముకుం డగురురుం డుల్లాసించి పునర్జీవిత యగుప్రమద్వరను బడసి పరమానందము ననుభవించెను.

నాసాగ్రదృష్టియై పరమధ్యానంబుసేయుచు యోగసమాధి స్థుండై తనశరీరంబు నాక్రమించిన వల్మీకమృత్తిక వర్షజలంబులచే విదళితం బగుచుండఁ జ్యవనుం డనుమునీంద్రుండు తపంబుసేయుచుం డెను. ఆపుట్టలోనుండి యాతనినయనద్వయము వైడూర్యప్రభలచేఁ బ్రకాశించుచుండుటయు, శర్యాతితనూజయగు సుకన్య యనుకుమా రీమణి మణిభ్రాంతిచే నమ్మునికన్నుల నుత్పాటితంబులుగఁ జేసెను. అయ్యపచారంబునకుఁ బ్రతీకారంబుగ శర్యాతి తనతనయ నమ్ముని వరునకియ్యఁగా జరాగ్రస్తుం డయ్యును నాతఁ డామెను బరిగ్ర హించి, పిమ్మట నశ్వినిదేవతల నారాధించి నయనంబులతోఁ గూడ యౌవనంబును సంపాదించి యారాచకన్యతో ననేకసుఖభోగంబు లం దేలియాడెను.

కూర్మగ్రీవుండును, అస్థిచర్మావశిష్టదేహుండును, యోగియు, జ్ఞానతృప్తుఁడును, ప్రశాంతుఁడును వీతానందనందనుఁడు నగు మునీం

ద్రుండు క్షీరసాగరమధ్యంబునఁ గేవలక్షీరంబులచేఁ గృశుండై నాడీశరీ
రంబులయందు శైవాలంబులు చుట్టికొనియుండ నొకప్పుడు సముద్ర
తీరంబున నాత్మపత్నులతో విహరించుచున్న మత్స్యాదిజలజంతువులఁ
గాంచి నూతనస్త్రీసమాగమంబును వాంఛించి యటనుండి లేచి సుధ
న్వుం డనుమహారాజునొద్దకుం బోయెను. ఆరా జమ్మహామునిని విధి
విధానంబునం బూజించి తోడ్తెచ్చి 'మహాత్మా! భవదాగమనంబు
నకుఁ గారణంబును వచియింపుఁడు.' అని వేఁడికొనియెను. అమ్ము
నియుఁ బరమాహ్లాదము నొంది సుధన్వునుద్దేశించి నేను కశ్యపునితన
యుఁడను. వినతాగర్భంబున జనియించితిని. కన్యాభిక్షంబు గోరి
వచ్చితిని. నీ కెవ్వరైనఁ బుత్త్రికలున్నచో నాకిమ్ము. అని కోరెను.
అమ్మునీంద్రునియాకారంబునకును, వయస్సునకును దగని యాతనియ
భీష్టము నెఱింగి సుధన్వుండు శాపభీతుండై 'మునీంద్రా! నాకు
దేవతాకాంతలవలెఁ బరమసుందరులగు నేఁబదిమంది పుత్త్రిక లున్నారు.
వారి చిత్తములు మాత్రము నాయధీనంబున లేవు. ఓతపోనిధీ! అందే
కన్య నిన్ను భర్తగా వరించినను నేనామెను నీకు సమర్పింపఁగలను.
ఈవిషయంబున నన్ను క్షమింపవలయును. నీవు నాయాజ్ఞానుసారం
బుగఁ గన్యాంతఃపురంబునఁ బ్రవేశింపవచ్చును.' అని చెప్పుటయు
నమ్మహాయోగి సుధన్వునికడ సెలవుగైకొని తపఃప్రభావముచే రూప
యౌవనలావణ్యంబులకు సౌభాగ్యస్థానమో యనునట్టి మనోహరాకృ
తిని ధరియించి యంతఃపురంబునఁ బ్రవేశించెను. రాజకుమారిక
లమ్మునిశ్రేష్ఠుని సందర్శించినంతనే విస్మితలై మన్మథుండుం బోలె
వెలుంగుచున్న యమ్మునికి నాత్మసమర్పణములను గావించిరి. పిమ్మట
సుధన్వుండు వారి నందఱ నాతనికిఁ బెండ్లిచేసెను. ఆవివాహసమ
యంబున మునిభయముచే శుక్రాదిగ్రహంబులు స్వోచ్చత్రికోణస్థితిం

బుత్రై లగ్నచతుష్టయసప్తమదశమైకాదశస్థానంబుల శుభకరంబులుగాఁ
జేసి యాదంపతులసంతానసౌభాగ్యాభివృద్ధికిఁ గారకంబు లయ్యెను.
అత్తాపసుండు దుర్లభ లగురాజకుమారికలను, రాజ్యలక్ష్మినిగూడఁ
బడసి పరమానందంబునఁ గ్రీడించుచు బహుపుత్త్రులనుగాంచెను.

ఒకప్పుడు గరుడుండు హిమాలయగుహాలయం దున్నతరుణీ
మణి యగుఁ గన్యయునగునై శ్యానరతనూజను శాండిలిని గాంచి యామె
నెట్లయిన స్వర్గమునకుఁ గొనిపోవలయు నని తలంచెను. ఆయువతి
యాతనిభావమును గ్రహించి పక్షరహితుం గావించెను. పిమ్మట నా
మెయే దయాకలితయై క్షణకాలంబున మరల నాతనికి హేమపక్షంబు
లం బ్రసాదించెను.

దీర్ఘశ్మశ్రుజటాధారియు, క్షుత్పిపాసితాంగుండును, తీక్ష్ణనఖుండు
నగు విభాండకమునీంద్రుండొకప్పుడు నదీస్నానంబునకుంబోవుచుదార
మునం దున్న యొకకామినీరత్నమునుం గాంచి మోహితుం డగుటచే
నాతని రేతస్సు విగళితం బయ్యెను. దైవవశంబున నొకయాఁడు లేడి
దాని నాస్వాదించుటయుఁ దద్గర్భంబునుండి శృంగసహితుండగుకుమా
రుం డుదయించెను. విభాండకుం డాతనిని బెంచి మునికుమారునివలెనే
సంస్కరించి వేదాధ్యయనంబు సేయించెను. ఋష్యశృంగుం డను
నమ్మునిపుత్త్రుండు సర్వదా శాంతుండును, దాంతుండును, జితేంద్రి
యుండును, విశుద్ధుండును, బ్రహ్మచారియు, శాకాహారియుఁ, బిత్రా
జ్ఞానువర్తియు, నియమవంతుండును, వేదాధ్యయనశీలుండును, నిత్యజపి
యు, స్త్రీవిలాసదర్శనానభిజ్ఞుండును నై యుండెను. రాజర్షి యగు లో
మపాదుం డనావృష్టిదోషనివారణంబుకొఱకు ఋష్యశృంగు నెట్లయి
నఁ దనరాజ్యంబునకుఁ గొనితేవలయు నని తలంచి గణికాజనంబుల
నాతనికడకుఁ బంపెను. వారు విభాండకాశ్రమంబునకుం బోయి

తమరూపయౌవనవిలాసంబులచే నాతని విమోహితునిం గావించి రాజధానికిం దోడ్తెచ్చిరి.

మహాముని యగుభరద్వాజుండు పుత్త్రునితోఁగూడి సుస్వరంబుగ వేదాధ్యయనముచేయుచుండెను. ఆసమయంబున నాతనిపుత్త్రుండగు యవక్రీతుండు తరుణి యగుపరావసునిభార్యం గాంచి మోహించి బలవంతముగ నామెను బ్రార్థించుచుండుటయు, మానవంతుం డగురైభ్యుం డదిచూచి క్రోధావేశంబున జడను ఛేదించి యగ్నికుండంబున వ్రేల్చి రాక్షసాకృతి యగు నొకకృత్యం గల్పించి యవక్రీతుని మ్రింగివేయు మని దానిని బంపెను. అప్పుడాకృత్య పరావసునిపత్నివలె రూపంబునుదాల్చి యవక్రీతుంగాంచి నాతోఁ గ్రీడింపు మని ప్రార్థించుచు వంచనంబున నాతని నగ్నిగృహంబుననుండి యరణ్యంబునకుం గొనిపోయి యెప్పటివలె రాక్షసరూపముం దాల్చి యాతని వధించెను. అనంతరము వృద్ధుం డగుయవక్రీతుని తండ్రి పుత్త్రునిమృతదేహమును గాంచి కుపితుండై తనమిత్త్రుం డగు రైభ్యునకుఁ దనకుమారునియవస్థంజూపి మిత్త్రపుత్త్రనాశకుండ వగు నీవు పుత్త్రునివలననే మరణింతువుగాక యని శపించి పుత్త్రునితోఁ దానును చితారోహణంబు గావించి మరణము నొందెను. పిమ్మట పరావసుండు తనరాజు చేయుచున్న యజ్ఞంబున నధ్వర్యుండై యుండి యొకనాఁటి సంధ్యాకాలమున నేదో కారణంబున రోషావేశపరవశుండై యాశ్రమంబున కేతెంచెను. ఆసంధ్యాసమయముననే రైభ్యుఁడును తరుగుల్మలతాకీర్ణంబును, దుర్గమంబు నగు గిరితటంబునుండి యింటికి వచ్చుచుండెను. అతఁడు కృష్ణసారచర్మంబుచే నాచ్ఛాదితుండై యుండుటను జూచి పరావసుండు మృగభ్రాంతిచే రైభ్యునిపై బాణప్రయోగంబుఁ గావించెను. తుద కాతండు తనతండ్రియే యగుటం జూచి

పరావసుండు దుఃఖితుండై చేయునది లేక యారాత్రియే పితృదేహం
బునకు దహనసంస్కారాదికంబును గావించెను. మఱునాఁడు ప్రభా
తంబునఁ బరావసుండు యజ్ఞభూమికిం బోయి యచ్చటఁ దనసోదరుని
రహస్యంబుగఁ బిలిచి నేను భ్రాంతివశంబున జనకుని వధించితిని. నీవీ
యజ్ఞంబు నిర్వర్తింప నంగీకరించి నన్నుఁ బంపినచోఁ దగినప్రాయశ్చి
త్తంబు చేసికొని యెదను" అనిచెప్పటయు, నాతని యనుజుఁడు ఈప్రా
యశ్చిత్తంబునకు నేనే యరణ్యమునకుం బోయెదను. నీవిచ్చటనుండి
యీయజ్ఞంబు నిర్విఘ్నంబుగ నెఱవేఱునట్లొనర్పుము.' అని యాతని
నంగీకరింపఁజేసి యతికఠోరం బగుతపంబుచే బ్రహ్మహత్యాజనితం బగు
పాతకంబును నశింపఁజేసి మరలఁ బరావసువునొద్దకుం బోయెను. అప్ప
టికి యజ్ఞంబు పరిసమాప్తంబై దక్షిణాదానసమయం బయ్యెను.
కృతఘ్నుం డగుపరావసుం డట్లు వచ్చినసోదరునిం గాంచి ధిక్కారం
బు సేయుచు 'ఓరోరి పితృహంతా! నీవీయజ్ఞ భూమి కేల వచ్చితివి.
అతిత్వరితంబుగ నిటనుండి యావలికిఁ బొమ్ము! అని పలికెను. ఆమా
టలు విని యమ్మునికుమారుండు నిశ్చేష్టితుఁడై పోయెను. వెంటనే
యజ్ఞశాల యపవిత్రం బగునను సంశయంబున రాజభటు లాతనిపైఁ
బడి చంపుట కుద్యుక్తులైరి. అట్టి యవస్థయందుగూడఁ బరిశుద్ధాత్ముం
డగు నమ్మునిపుత్త్రుండు కుపితుండుగాక యగ్నిదేవుని మహేంద్రుని
యమునిఁ జేర్కొని ప్రార్థించుచు 'ఓదేవతాశ్రేష్ఠులారా! నేను
నిక్కంబుగఁ బితృహంతకుండనే యగుదునేని పాపాత్ముండనగు నన్నిట్లే
దహించివేయుఁడు! అందువలన మీ కెట్టిబ్రహ్మహత్యాదోషంబును
లేకుండుఁగాక! నే నేపాపము నెఱుంగనివాఁడనేనయెడల అమృత
ధారలచే నాదేహంబు నభిషేకింపుఁడు. నేను దానము, హోమము,
గురుశుశ్రూషయు యథావిధిగ నిర్వర్తించినవాఁడనే యగుదునేని

శత్రుభావంబున నాయాత్మీయు లెల్లరును బునర్జీవితు లగుదురుగాక!'
అని ప్రార్థించెను. దేవతలు ప్రసన్నులై యమృతబిందువులచే యవ
క్రీతుని నతనితండ్రియగు భరద్వాజుని( బరావసునితండ్రి యగురై
భ్యుని( బునర్జీవితులను గావించిరి. అది యంతయును గాంచి యజ్ఞ
శాలయందలి మహర్షు లందఱును విస్మయావిష్టులై పరావసునితమ్ముని
మిక్కిలి యభినందించిరి.

బ్రహ్మచారియు, యోగియు, ధ్యాననిష్ఠుండును నగుగౌత
ముండు సంసారసంబంధంబు లగు సకలదోషంబులను బరిత్యజించి
వనవాసియై యతినియమంబున( దపంబు సేయుచుండెను. అది చూచి
యసురేశ్వరుండు భీతుండై యాశారద్వతునితపంబు భంగంబునొం
దించుటకై యొకయచ్చర నచ్చటికి( బంపించెను. ఆదేవరమణినిగాం
చినంతనే గౌతమునకు( గామవికారం బుదయించెను. అది వసంత
కాలం బగుటచే నాశ్రమస్థంబు లగుతీగలతాదులు పుష్పించియుం
డెను. సురభిళంబు లగుమందవాయువులు మెల్లమెల్లన వీతెంచుచు
నయ్యచ్చరలేమ కట్టుకొనినపుట్టంబు( దొలగించి యమ్మునిసమీప
మ్మున( జేర్చెను. అక్కామినియు నగ్నయై వస్త్రసమాహరణవ్యాజం
బున నమ్మునిసమ్ముఖమ్మున కేతెంచెను. గౌతముం డిక మనోధై
ర్యంబును నిలుపుకొన(జాలక యామెం గూడి కామసుఖంబుల ననుభ
వించెను. అప్పు డాతనియమోఘం బగువీర్యంబు భూపతితంబు
గా(గా నదియొక ద్రోణంబున నిక్షేపింప(బడెను. ఆద్రోణ్ణునుండి ధను
ర్విద్యావిశారదుం డగుద్రోణాచార్యుండు జనియించెను.

ఒకసమయంబున బ్రహ్మదేవునివచనంబు ననుసరించి భగవా
నుం డగుమార్తాండుండు భూతలంబున నాకాశచరుండగు వసుమహా
రాజై పుట్టెను. సర్వాశ్రమధర్మరక్షకుండును, మృగయాతత్పరుండను

నగుచు నా రాజేంద్రుండు సింహవ్యాఘ్రాదిక్రూరమృగంబుల వలనను, తస్క
రాదిదుర్మార్గులవలనను బ్రజల కెట్టి భయంబును గలుగకుండ శత్రు
దుర్జయుండై రాజ్యంబును బరిపాలించుచుండెను. అతఁ డొకప్పుడు
ధనుర్బాణధారియై డేగను జేతిపై నుంచుకొని విమానంబు నధిరో
హించి గగనమార్గంబున విహరించుచుండెను. అట్లు దూరప్రదేశం
బులఁ దిరుగుచుండుటవలనను వసంతకాలం బాసన్నం బగుటవలనను
నాతనికిఁ గామవికారంబు గలిగి రేతఃపాతంబయ్యెను. పుత్త్రకాముం
డగునమ్మహారాజు దాని నొకపలాశపత్త్రసంపుటంబుననునిచి యాత్మ
కాంతలయాఘ్రాణార్థమై డేగచేఁ దనకోటలోని కనిచెను. ఆశ్యేనం
బును, ఆపత్త్రపుటికను చంచుపుటంబున ధరియించి రాజగృహాభిము
ఖంబుగఁ బోవుచుండ మార్గమధ్యంబున మాంసభ్రాంతిచే వేఱొక
డేగ వచ్చి దాని నెదురఁగొట్టునిపోయెను. అందువలన నాతనివీర్యము
పత్త్రపుటంబునుండి విగళితంబై జలమధ్యంబునఁ బడిపోయెను. బ్ర
హ్మశాపంబుచే మత్స్యరూపిణియై యాజలంబుల సంచరించుచున్న
గిరిక యనునొకకాంత యారేతస్సును బానముచేసి గర్భవతి యయ్యె
ను. గర్భిణియగు నమ్మత్స్యకాంత యొకవలలోఁ దగులుకొని దాశ
రాజగృహంబునకుఁ గొనిపోఁబడియెను. ఆతనిగృహిణి యాచేఁపనుదఱు
గుచుండ నొకకుమారుండును, కుమారికయుఁ దద్గర్భంబునుండి వెలు
వడిరి. దాశరాజక్కుమారుని నుపరిచరవసుమహారాజున కుపాయనం
బుగ నొసగెను. ఆరాజేంద్రుం డక్కుమారునికి జాతకర్మాదిసంస్కా
రంబులం బొనరించి స్వవీర్యజుం డగు నాతని నాత్మరాజ్యాభిషిక్తునిఁ
గావించెను. మిగిలిన యాపుత్త్రిక దాశరాజువెంటఁ బెరుఁగుచుండెను.
ఆకన్య కళిందపర్వతోద్భూతయు, నీలోత్పలసదృశయు, యోగినియు,
మార్తాండనందనయు నగు యమునానదియే. ఆమెయే శక్తిపుత్త్రుం

దగుపరాశరునికొఱకు మానవియై జన్మించి దాశరాజగృహంబునం బెరుఁగుచు సత్యవతీనామంబునఁ బ్రసిద్ధ యయ్యెను.

కుమారశీలుం డగుపరాశరుం డొకప్పుడు పుణ్యవాహిని యగు యమునానదిం గాంచి యీనదివంటియనురాగవతియగుయువతి లభించినచో నేనామెతో నొక్కసారి కలసి సుఖింతు నని కుతూహలపడియెను. మహేంద్రుం డాతనియభిలాష నెఱింగి యమునకడకుంబోయి « ఓమహానదీ! నీవు పరాశరుని మనోరథంబు సఫలంబు గావింపుము" అని చెప్పెను. కళిందకన్యయు నట్లే యని యంగీకరించి యోగమాయ నవలంబించి మత్స్యగర్భంబునఁ గన్యయై జన్మించి దాశరాజు నింటఁ బెరుఁగుచు నాతనియాదేశంబుచే యమునానదియందు నౌకను నడపుచుండెను. పరాశరుం డొకప్పు డామెం గాంచి వేఁడుకొని యామెకు దివ్యసురభిళశరీరంబును, చిరకన్యాత్వంబును మొదలుగాఁగల దేవదుర్లభంబులగు నూఱువరంబుల నొసంగి యాక్షణంబున నే తన తపఃప్రభావంబుచే నీహారమందిరంబును గల్పించి యమ్మునీంద్రుం డామెతోఁ గూడి యందు యథేష్టోపభోగంబుల ననుభవించెను. అప్పు డాకన్యకవలన మహాయోగి యగువ్యాసభగవానుం డుదితుం డయ్యెను. ఆవ్యాసుండును మృతులగుతనక్షత్రియసోదరులభార్యలయందు ధృతరాష్ట్రపాండురాజవిదురు లను మువ్వురుపుత్రులను గలిగించెను. మఱియు నప్పరాశరనందనుం డరణిని మథించి దానినుండి శుక్రుండను తనయుం గలిగించెను. యోగిప్రభుండు నవ్యయుండు నగుశుకునికిఁ గూడ గౌరవుఁడు, కపిలుఁడు, కృష్ణుఁడు, నీలుఁడు ననునలుగురుతనయులును, భామినియనుతనయయుఁ గలరు. ఆతనిపుత్రులు నలువురును యోగాచార్యులగు మహాత్ములైరి.

తొల్లి వామశివుండను మునివరుండు కపాలమాలికాధరుండై

విద్యాధరేశ్వరత్వముం గూర్చు ఖడ్గంబును సంపాదింపతలచి యనువుద్దే
శముతోఁ బాతాళంబునకుం బోయి యచ్చట జపహోమాదులం గా
వింప నారంభించెను. అప్పు డాతనిమంత్రప్రభావముచేఁ బాతాళ
మంతయు దగ్ధముగా నారంభించెను. అందుచే భయపడి నాగగణంబు
లాతనికి ఖడ్గప్రదానంబు గావించిరి. అప్పు డొక నాగదాసి మనోహ
రంబగు వశరాజీకమంత్రముచే నాతని ముగ్ధుం గావించి తనరూప
యౌవనవిలాసాదులచే నాతని గామపరవశునిం జేయుటయుఁ బీనశ్రో
ణియుఁ, బీనవక్షోజయుఁ దరుణియు దిగంబరయు నగునక్కామినిం
గాంచి వామశీలుండు మహాతపంబుచే సాధించినఖడ్గంబును లెక్క సే
యక వికలచిత్తుండై పూర్ణాహుతిప్రదానంబు సేయకుండఁగనే ఘృత
పూర్ణంబగుస్రుచంబును హోమంబు చేసివైచి లేచి యారమణీమణిం
గూడి వివిధవిలాసోపభోగంబుల ననుభవింపందొడంగెను. ఈవిధముగా
నమ్మునీంద్రుండు విగతప్రభావుం డగుటయుఁ బాతాళవాసులగుతురగ
గణంబులు నిర్భీతులై యాతని జుట్టుముట్టి కాంతలు వలదని వారిం
చుచున్నను వినక కోపావేశంబున భస్మీభూతుం గావించివైచిరి.

మహామతియు, క్షత్త్రియులోత్తంసుండును, గాధిపుత్త్రుండు నగు
విశ్వామిత్రుఁడు వసిష్ఠునియున్నతిం జూచి పరితప్తుండై బ్రాహ్మణ
త్వంబును వాంఛించి త్రిలోకభీకరం బగు కఠోరతపోదీక్షితుం డయ్యె
ను. అస్థిచర్మావశిష్టదేహుం డగుచుఁ దపోధనునితేజముం గాంచి దేవతా
ధీశ్వరుండగు నింద్రుం డధీరుండై తత్తపోభంగంబు గావించుటకై
మేనక యను నచ్చరలేమను బంపెను. నిర్జనం బగువనమధ్యంబున
నేకాకినియై విహరించుచున్న సుందరీమూర్తి యగు మేనకం గాంచి
వెంటనే విశ్వామిత్రుండు మోహితుండై కామపరవశత్వంబున
జడుండు నున్మత్తుండునై పోయెను. ఇట్లు శుంభనిశుంభులు గోపికారూపిణి

యగుచండికం జూచి మోహించి మహారణంబున నాశంబును గాం
చిరి. వారితనయులగు సుందోపసుందులు తిలోత్తమ యను సుందరీ
మణిని మోహించి అట్లే నశించిరి. ఇక్ష్వాకుం డనుమహారాజు దండ
కారణ్యంబున స్వర్గసదృశంబగు రాజ్యలాభముం గాంచి మహాప్రభా
వంబునఁ బ్రజాపరిపాలనం బొనర్చుచు నొకప్పుడు శుక్రాచార్యతనూజ
యగు సూర్యప్రభం గాంచి కామాభిభూతుండై యామెను బలవం
తముగ నవహరించెను. అప్పుడు శుక్రాచార్యుండును క్రోధపరవశుం
డై అజేయుండును, దండార్హుండు నగు వానిని రాజ్యసహితంబుగ
భస్మీభూతునిం గావించెను. అనంతరము సప్తదివసంబులవఱకును భస్మ
వర్షము గురిసెను. ఆదండకావన మిప్పటికినిగూడఁ దరులతాతృణవివ
ర్జితమై యున్నది.

## —♦ రావణచరిత్రము ♦—

దశవక్త్రుండును, వింశతిభుజుండును, చతుష్పదుండును, త్రిలో
కవిజయుండును, భీషణాకారుండును, శ్యామవర్ణుండును, పుష్పోత్కటా
విశ్రవసులకుఁ దనయుండును నగురావణుండు మహేంద్రునిఁగూడ
జయించి దుర్గమధ్యంబున బంధించియుంచెను. అతఁడు తనకుమారుఁ
డగుమేఘనాదునిసాహాయ్యంబునఁ ద్రిభువనంబుల జయించి వేఁట
కాఁడు పక్షులనుపట్టునట్లు యువతులును, మదవతులును, సౌభాగ్యవ
తులును, లావణ్యవతులును, రూపవతులును, నగుదేవతాసుదతులను
జెఱపట్టితెచ్చికొనిపోయెను. మఱియు నాదశకంఠుండు మయనందనయగు
మండోదరిని భార్యగాఁ బడసియు సంతృప్తినొందక పరస్త్రీకాముకుం
డయ్యెను. ప్రజాపతితనయయగు రతీదేవి కామదేవుండు దగ్ధుండైన

వెనుక మయునిగేహంబునం ద్రిలోకసుందరియై మగల జన్మించెను.
శంబరాసురుం డామె నెత్తుకొనిపోయెను గాని యామె దారుమయం
బగునొకప్రతిమను దనపోలికనే నిర్మించి దివ్యభూషణంబులచే నలంక
రించి యోగబలంబుచేఁ బ్రాణప్రతిష్ఠాపనంబుగావించి యారాక్షసుని
మోసముపాలు చేసెను. శంబరుండును, అమ్మాయామూర్తివలననే
సంతుష్టుఁడై యథేచ్ఛను విహరించుచుండెను. అనంతరము మహాబల
పరాక్రమవంతుండగు దశాననుం డారమణీమణిని గాంచి యెట్లయిన
నపహరింపవలయునని యుద్దేశించి విశ్వకర్మనిర్మితంబును దివ్యమణిఖచి
తంబును స్వర్గాధికసుఖకరంబును నగుశంబరాసురునిమందిరము గలపా
తాళంబునకుఁ బోయెను. రావణాసురుం డందు ప్రవేశించినంతనే
మయమాయాసముద్భూతంబులగు వివిధపాశంబు లాతని బంధించివై
చెను. మఱియు మాయామయాస్త్రంబులచేఁ బీడితు లగుచు వజ్ర
లేపప్రలిప్తం బగుమార్గమధ్యంబున దశకంఠునిప్రహస్తాది సైనికులు
నిష్ప్రాణులై పోయిరి. అదియునుంగాక మయునిమంత్రప్రభావముచే
లోహమయు లగునరు లుదయించి వివిధంబు లగుశస్త్రాస్త్రంబులచే
రావణుని ససైన్యంబుగఁ జదియమోఁదుచుండిరి. పాషాణదంష్ట్రాయు
లగుద్వారపాలకులును వారలఁ జావఁగొట్టుచుండిరి. ఇవ్వార్త నాల
కించి మందోదరి శోకపీడితయై తనభర్త దుశ్శీలుండును, చంచలుండును
ను గావున భయపడుచుఁ దండ్రియొద్దకుం బోయి తననాథుని రక్షిం
పుమని ప్రార్థించెను. మయుండును తనతనయవిన్నపంబును మన్నించి
మాయాబలంబున రావణుని సపరివారంబుగ వజ్రలేపవిముక్తుం గా
వించి యికనెన్నఁడు నిట్టిదుష్ప్రయత్నములఁ జేయవల దని శాసిం
చుచు నాశ్వాసించెను. అపరాధంబునకు రావణుండును మిగుల లజ్జి
తుం డయ్యెను. పిమ్మట నమ్మాయావతీదేవి క్షుత్పిపాసాతురుండగు,

కాతరుండును, మందబుద్ధియు నగు రావణునిం జూచి పరిహాసంబు
సేయుచు "ఓరి రావణా! నీవు రాజవా? సర్పంబునకుం బోలి నీ కీవద
నంబు లేమి? ఓ పెపశువా! చతుష్పదుండ వగునీవు, అంతకంటెను
హీనుండవు. ఆహా! ఏమి నీసౌందర్యము! పిశాచములైన నిట్లుండవు.
నేను దేవతలకుంగూడ దుర్లభురాలను. నీవు నన్నుపహరింపవలయునని
వచ్చితివా? ఓ నిశాచరా! తనయింట నిల్లాలుండఁగా, నెంతటిపాపా
త్ముండైనను బరకాంతను గోరవచ్చునా? తనకాంతకంటెఁ బరస్త్రీ
యం దేమివిశేష మున్నది? పాపాత్ము లగు పరనారీసంగతులకు నా
యుఃక్షయ మగుటకంటె నేమిలాభ మున్నది? శరీరావయవంబులు
కేవలకామాసక్తంబులై యుండ నిచ్చవచ్చిన తెఱంగునఁ జరించువారు
భిన్నాంగులును, రుధిరాంగులు నై వికృతాకారంబులతోఁ జూచువా
రల కేవమును గలిగించుచుందురు. శుక్రిమే రయాయుపుగరా! స్త్రీ
వాంఛచే మానవులు చేయనిదోషంబు లేవియును లేవు. పురుషులకుఁ
బరస్త్రీగమనంబువలన నణుమాత్రం బగుసుఖం బున్నను, అది పరి
ణామంబునఁ బర్వతోపమం బగుదుఃఖంబునకుఁ గారణం బగుచున్నది.
పురుషులును, స్త్రీలునుగూడ నివ్విషయంబున లక్ష్యము సేయకుండుట
దుఃఖింపఁదగినవిషయము. పరిణామదుఃఖకరంబులగు నిట్టిదుష్కార్య
ములను విడిచి యిహంబునం దల్పసుఖకరంబులును, కష్టసాధ్యంబులు
ను, పరసుఖదాయకంబులు నగు మహాపురుషుల యుత్తమకర్మంబులే
యాచరణీయంబు లని యెఱుంగవలయును. నీ విఁక వెడలిపొమ్ము.
ఎన్నఁడు నిట్లు సాహసింపకుము. ఎల్లవేళలను స్త్రీలయెడ భయభక్తు
లు గలిగి యుండుము. ఓ మందమతీ! స్త్రీలే మిగుల బుద్ధిమతులు.
వారు మేఘాంతకాగ్నిపాతాళవిషసర్పతుల్యంబు లగుసహస్రశూలాయుల
నెఱింగినవారు. ధూర్తశ్రేష్ఠ లగునారీమణులను పిశితప్రియు లగుపు

ఋషులు వంచించుట కెట్లు సమర్థు లగుదురు ?" అని మందలించుట యు, దుర్బుద్ధి యగు రావణదైత్యుం డాక్షణంబ పాతాళంబు విడిచి భూలోకంబునం బ్రవేశించెను.

అనంతర మొకప్పుడు రావణాసురుండు చర్మవసనధారిణి యగు నంగిరసునితనయ వేదవతిని గాంచి కేశవార్పితబుద్ధియు, మనోహారిణి యు, పరమరూపవతియు, నియమవతియు, బ్రహ్మచారిణియు, వనా సక్తయు నగునామెను గోలుగోలున నేడ్చుచుండ బలవంతముగ నాక్రమించెను. వేదవతి యారాక్షసస్పర్శంబును సహింపఁజాలక తపో గ్నికీలలచే స్వశరీరమును భస్మీభూతముగఁ జేసివైచుకొనియెను. అనం తర మద్దేవి రావణవధార్థమై మిథిలానాథుం డగు జనకునియజ్ఞభూమి యం దుదయించి శ్రీరామచంద్రునకుఁ బత్నియయ్యెను. ఆమెకు సప త్ని లెవ్వరును లేరు. శ్రీరాముం డామె నాదరించుచు గౌరవించు చుండెను. ఆమె యిరువురుపుత్త్రులను బ్రసవించి భూప్రవేశంబు గా వించెను. ఆసమయంబున 'మరల క్షీరసాగరశయనంబున భర్తృస మాగమలాభంబు గాంచెదను.' అని సంకల్పించుకొనియెను.

రావణుం డొకప్పుడు కైలాసపర్వతమ్మున సాయంకాలమున సురాపానమత్తుండై విహరించుచుఁ గమలదళనేత్రియు, హృదయగ్రా హిణియు, రూపవతియు, భ్రాతృపుత్త్రుం డగు నలకూబరునిప్రేయసి యు నగు రంభం గాంచి మోహితుండై కోడ లగుననియైన సందే హింపక పశుత్వంబు వహించి యామెను బలాత్కరించెను. అవ్వార్త నెఱింగి కుబేరసుతుం డగునలకూబరుండు కోపించి 'ఓరావణా ! నీ విఁక నెన్నఁడును బరాసక్త లగుకాంతలను బలాత్కరింపఁజాల కుందు వుగాక ! బుద్ధిహీనుండవై యెన్నఁడైన నట్లు బలాత్కరించినచో నా క్షణంబుననే భస్మీభూతుండ వగుదువుగాక !" అని శపియించెను.

అనంతర మొకప్పుడు దశకంఠుండు దిగ్విజయార్థమై పోవుచుఁ బాతాళంబునుగూడ జయింప నందుఁ బ్రవేశించి తన్మధ్యంబున మేఘశ్యాముండును, రక్తలోచనుండును, బ్రళయకాలానలకీలలంబోని రోమంబులచే భీకరుండును, విద్యుల్లతలవంటిజడలచే నలంకృతుండును, మార్తాండసహస్రప్రభావంతుండును, కేశశ్మశ్రువిభూషితుండును, నాగేంద్రపాశలపటావృతుండును నగుపురుషుం గాంచి యాతనిచెంతనున్న క్షీరసాగరతనయలక్ష్మీదేవిం దర్శించినంతనే కామపరవశుండై యామెను బలవంతముగ గ్రహించుటకుఁ బ్రయత్నించెను. అప్పుడు మహాకాలస్వరూపుఁ డగునప్పురుషుండు తననిశ్వాసంబుచే రావణుని శతయోజనదూరపతితుం గావించెను. దశవదనుం డట్లు పడి యొక్కింతసేపు నిశ్చేష్టుండై పిమ్మట లేచి ‹‹ ఓపరమేశ్వరా! నాకు నీచేతులయందే మరణంబు లభించుఁగాక ” అని ప్రార్థించి ‹‹ అట్లే యగుఁగాక ” అను భగవద్వాక్యంబు నాకర్ణించి బలిబిమోచనంబు చేయుటకై బయలుదేఱి యాతనిద్వారదేశంబున నీలవర్ణుండును, ద్విభుజుండును, ముసలహస్తుండును, శంఖచక్రగదాధరుండును, పురరక్షకుండును నగువిష్ణుదేవుని భీకరస్వరూపముం దర్శించి విషణ్ణుండును, శంకితుండునై దీనభావంబున నాక్షణంబుననే పాతాళంబు విడచిపోయెను.

మఱియు నారావణుండు వల్కలధారిణియు, శాకమూలఫలాహారిణియు, కర్కశశిలాకంటకాదులచే విక్షతాంగియు, రాజ్యభ్రష్టుండును, దరిద్రుండును, జననీజనకపరిత్యక్తుండు నగు శ్రీరామచంద్రునకుఁ బత్నియు, నాతనియందనురక్తయు, భక్తయునగు సీతాదేవింగాంచి మోహించిమారీచునాశ్రయించి యాతనిమనోజ్ఞంబగుమాయాకురంగరూపముందాల్చియయ్యాశ్రమస్థానంబునవిహరింపనియోగించితానుయతిరూపధరుండై సమయమునిరీక్షించుకొనియుండెను. ప్రవాళాంకురంబులు

చేనిర్మితంబులగు కొమ్ములచేతను, వైడూర్యమణిపరిభాసమానకించు నయనంబులచేతను, పద్మరాగమణికాంతుల నీనుపాదంబులచేతను, సువర్ణమయంబు లగు సకలాంగకంబులచేతను దర్శనీయంబై యున్న యమ్మాయాహరిణంబుం గనుంగొని సీతాదేవి విస్మితయై దాని నెట్లయినం గొనితేవలయు నని స్వామియగు శ్రీరామచంద్రునిం బ్రార్థించెను. రాముం డామృగము వెంట నంటి పట్టుకొన నెంతయో ప్రయత్నించెను గాని యది దొరకక యాతని కాయాసంబు గూర్చుచుండెను. రామభద్రుం డింక సైరింపంజాలక యాలేఁడిపై శరప్రయోగంబు గావించెను. అది యాబాణఘాతంబుచే మరణించుచు రావణు నుద్దేశించి "సోదరా! నేను మరణించితిని." అని కేకవైచెను. వనవాసినియగు సీతాదేవి యాపలు కాలించి యది తననాథునిపలుకని భ్రమించి స్వామి నన్వేషించి రావలయు నని తనరక్షణంబునకై నిలిచియున్న మఱఁదియగు లక్ష్మణునిం బంపించెను. ఆసమయంబున రావణుండు కపటోపాయంబున జానకి నపహరించి లంకకుం గొనిపోయి తనయభీష్టసిద్ధికొఱకామె నెన్నియోవిధములం బ్రార్థించుచుండెను. అనంతరము సూర్యవంశోత్తంసుండును, దశరథనందనుండును, భగవానుండు నగు రామచంద్రుండు దక్షిణసముద్రంబును దాఁటి పోయి లంకానగరంబు చేరి ప్రదీప్తంబు లగునలశరంబులచే రాక్షసగణంబులతోఁగూడ రావణుని సంహరించి విజయుండై సీతాసహితంబుగ నయోధ్యానగరంబునకు వచ్చి పట్టాభిషిక్తుం డయ్యెను.

## వాలివధ.

మానవాకృతితోడనే స్వర్గాదిలోకంబులం గూర్చి గమనాగమనంబులు గావించుటకు సమర్థుండును, పితృదేవతల సంతృప్తికొఱకు

దేవలోకమునుండి తిలలను గొనితెచ్చినపుణ్యుండును, సూర్యవంశాలం
కారుండు నగుదశరథుండు నిష్కంటకంబుగ నఱువదివేలవత్సరములు
రాజ్యపాలనంబు గావించియు నాత్మపత్ని యగుకైకయెడలం గల
మోహావశంబున రాజ్యంబును, బుత్త్రులను, బ్రాణంబులనుగూడఁ
బరిత్యజింపవలసినవాఁ డయ్యెను. సర్వభూతహితుండును, బ్రియుండు
ను, రామాభిరాముండును, రాజకులోద్భవుండును, మహామాన్యుండు
ను, మహామతియు, రణవిశారదుండును, ధర్మమూర్తియు, దశరథతన
యుండును, రాజర్షియు నగుశ్రీరామచంద్రుండు త్రిలోకవిజయుండ
య్యును గామవిజితుండై పోయెను. కేవలము పత్నీలాభంబు నపేక్షిం
చి యమ్మహావీరుండు గర్భశత్రులును, సోదరులు నగువాలిసుగ్రీవులు
పోరాడుచుండ నతివృద్ధుండును, శుష్కశరీరుండును నై యున్నవాలిని
గల్పాంతజ్వలనసదృశంబగు తనవాఁడిబాణంబుచేఁ గూలనేసెను. రఘు
కులచంద్రుం డగు దశరథునిచరిత్రము స్త్రీవిలాసాభిలాషచే నెట్లు
దూషితంబయ్యెనో యట్లే సకలదేవతాశ్రేష్ఠుండును, అనంతకీర్తియు,
నారాయణావతారుండును, త్రిలోకభయాపహారియు నగుశ్రీరామచం
ద్రునిచరిత్రముగూడఁ గళంకితమయ్యెను.

మనసిజుం డగుకామదేవుండు సకలదేవతాగణంబులయు, సక
లజీవులయు హృదయంబుల నాస్థానంబులుగఁ జేసికొని యెల్లరికి నజే
యుండై విరాజిల్లుచుండును. ఇతరు లెవ్వరు నాతని జయింపఁజాలరు
ఈవిషయంబును గ్రహించియే యాదిదేవుండును, స్మరారియు, స్వ
యంభూతుండు నగుమహాదేవుండు కామపీడనుండి లోకంబుల నుద్ధ
రింప నుద్దేశించి లింగమతప్రతిష్ఠాపనంబు గావించి యవ్విషయంబునఁ
దనయభిప్రాయంబులనెల్లఁ బ్రకటించి యుండెను. కమలనాభుండును
గమలసంభవాదిసకలదేవతలును దమతమయభీష్టసిద్ధికొఱకు శివలింగ

పూజనంబు గావించి కృతార్థులగుచుండిరి.

—♦ శివధర్మప్రసంగము ♦—

ఋషు లిట్లు ప్రశ్నించిరి. "సూతపుత్రా! పూర్వము మేము మహాత్ములవలన శాస్త్రంబులయందలి సకలసనాతనధర్మంబులను విని యుంటిమి గాని యిహపరసుఖప్రదంబగు నీశ్వరవిషయిక మైనయేధర్మంబును వినియుండలేదు. నీ విట్లు శివగుణకీర్తనంబు గావించియుంటివి. శివలింగపూజనంబున నిహపరంబులయం దెట్టిపుణ్యంబు లభించునో సంక్షేపంబుగ నెఱింగింపుము. భగవానుం డగువ్యాసుండు లోకహితార్థంబు ప్రబోధించినసకలధర్మోపన్యాసంబులును నీవు విని యుంటివి. మే మాధర్మంబులను వినఁగోరుచుంటిమి." అని ప్రశ్నించుటయు సూతుం డిట్లనియెను.

మునులారా! మీ రిప్పుడు నన్నడిగినట్లే పూర్వము తత్త్వజ్ఞులగుమునులు వ్యాసునింగూర్చి ప్రశ్నించుటయు నాతఁడు తాను సనత్కుమారునివలన గ్రహించినశివధర్మమునుగూర్చి సవిస్తరంబుగ వర్ణించెను. నేను దానిని సవిస్తరముగ విన్నవించెదను. ఈశివధర్మములు ఆదిమధ్యాంతంబుల శ్రద్ధాకలితంబులు. శ్రద్ధయందే వీనిప్రతిష్ఠయు, సమాప్తియు నున్నవి. ఇవి శ్రద్ధాధర్మము లనియే చెప్పఁబడినవి. ఈ ధర్మశ్రవణమాత్రంబుననే యానందోత్పత్తియగును. ఇవి యతిసూక్ష్మము లైనవి. వీని కధీశ్వరుఁడు ప్రధానపురుషుఁడు. శ్రద్ధాయుక్తుఁడే యీధర్మగ్రహణమునకు సమర్థుఁడు. కరములచేఁగాని, కన్నులచేఁగాని, ఇవి గ్రహింపఁబడవు. శ్రద్ధాహీనుం డగువాఁడు దేవతామూర్తి యైనను శరీరకష్టంబుచేఁగాని, ధనప్రదానంబుచేఁగాని, యీసూక్ష్మధర్మములను బడయఁజాలరు. శ్రద్ధాధర్మమే పరమధర్మము. శ్రద్ధాదానమే పరమతపస్సు. శ్రద్ధయే స్వర్గము. ఈసమస్తము శ్రద్ధయందే

యున్నది. శ్రద్ధలేనివాఁడు సర్వస్వమును జీవనమునుగూడ దానము చేసినను కించిన్మాత్రంబైనను ఫలంబు నొందఁజాలఁడు. కావున శ్రద్ధయే పరమోత్కృష్టమైనది. శివధర్మంబు లన్నియు శ్రద్ధామయంబులు. శ్రద్ధచే శివలాభంబు నొందవచ్చును. శివపూజాధ్యానంబుల శ్రద్ధాపూర్వకంబుగనే కావింపవలయును. పారగర్భంబును, ముక్తిప్రదంబును, ప్రమాణాంతరానపేక్షంబును శివప్రీతిపాదకంబును, వివిధసిద్ధికారణంబును, లోకరంజనకరంబును, సుఖోచ్చారణయోగ్యంబును, సకలార్థవంతంబునునగు ‘‘ఓంనమశ్శివాయ’’ అనునీదివ్యసుందర వాక్యమే శివునిమూలమంత్రంబు. వటబీజం బతిసూక్ష్మం బయ్యును మహావృక్షంబునకుఁ గారణంబైనయట్లే యీషడక్షరమంత్రంబు సమస్తవిద్యలకును బ్రధానకారణంబును, అతిసూక్ష్మం బయ్యును మహార్థవంతంబును నై యున్నది. సత్త్వరజస్తమోగుణంబుల కతీతుండును, సర్వజ్ఞుండును, సమస్తజగత్కర్తయు, సర్వగతుండును నగుశివుండు ‘‘ఓమ్’’ అను నేకాక్షరమంత్రంబునందే సుస్థితుండై యుండును. సకల విధంబు లగుసూక్ష్మమంత్రంబులును, మాలామంత్రంబులునుగూడ ‘‘ఓం నమశ్శివాయ’’ అనునీమంత్రంబునందే యిమిడియున్నవి, సద్యోజాతాదిపంచబ్రహ్మశరీరుం డగు శివుండు వాచ్యవాచకభావంబున నీసూక్ష్మషడక్షరమంత్రమునందే సాక్షాత్కరించియుండును. ఇది శివప్రమేయం బగుటచే వాచకంబును, దీనిచేఁ జెప్పఁబడువాఁడుగావున శివుండు వాచ్యుండునునని గ్రహింపవలయును.

శివునకును, మంత్రంబునకును గల యీవాచ్యవాచకభావ మనాదిసిద్ధమైనది. ఈఘోరసంసారసాగర మనాదిప్రవృత్త మైనది. అట్లే శివుండునునాదినుండియు సంసారమోచకుండై యున్నాఁడు. వ్యాధుల కౌషధంబునుబోలి సంసారదోషంబులకు శివుండు స్వాభావిక

త్రుండై యున్నాఁడు. సూర్యాభావంబున జగం బంధకారమయ మైనట్లే జగదీశ్వరాభావంబున సమస్తంబు నంధకారమగును. కావున శివుఁడే యనాదియు, సర్వజ్ఞుండును, స్వభావముచేఁ బరిపూర్ణుండును, ముక్తికారణుండును, సిద్ధుండును, జ్ఞానగమ్యుండును నై యున్నాఁడు. ఈపడక్షరమంత్ర మాతని కభిదానంబును, దీని కాతఁ డభిధేయుండు నగుటచే శివుం డిమ్మంత్రమ్మునకుఁ బరుం డని మంత్రంబుచేతనే నిర్దిష్టుం డగుచున్నాఁడు. ముక్తికారణం బగునీషడక్షరమంత్రము వేదంబులయందును, శివాగమంబులయందును గూడ విరాజిల్లుచున్నది. ఈమంత్రంబు హృదయంబునఁ గలవానికి నితరమంత్రంబులతోడను, శాస్త్రంబులతోడను బ్రయోజనంబు లేదు. ఇమ్మంత్రాభ్యాసపరుఁడు వేదాధ్యయనంబును, వేదశ్రవణంబును, వేదోక్తకర్మానుష్ఠానంబును గావించినవాఁ డగుచున్నాఁడు. ఇతరంబు లగుసకలశివజ్ఞానంబులును విద్యాస్థానములును, గూడ నిమ్మంత్రమ్మున షోడశాంశమ్ము నైనను బోలఁజాలవు. ఇది శివవాక్యము. ఇదియే శివజ్ఞానము. ఇదియే పరమోత్కృష్ట మైనది. పూర్వోక్తంబు లగువచనంబు లన్నియు శివాత్మకంబు లగువిధివచనంబులే కాని యర్థవాదంబులుగావు. లోకానుగ్రహకర్త యగుశివుండేల మిథ్యావచనంబులఁ బచరించును? పరిపూర్ణుండును, సర్వజ్ఞుండును, నగుమహాదేవుం డేవస్తువునం దెట్టిగుణదోషంబులు గలవో, దేనివలన నెట్టిసుఖదుఃఖఫలంబులు లభించునో సత్యముగనే ప్రబోధించుచుండును. ఈశ్వరుం డగునాతఁడు రాగముచేఁ గాని ద్వేషముచేఁ గాని మఱియొకవిధముగా నెట్లు చెప్పును? అతనికి రాగద్వేషంబులు లేవు. అవి కలవారే మిథ్యావచనంబులఁ బలుకుచుందురు. అఖిలదోషవివర్జితుం డగుశివుండు వినిర్మలజ్ఞానమునే యుపదేశించుచుండును. కావున సద్దేవునివచనమే ప్రమాణము. అందుల

కొట్టిసంశయమును లేదు. రాగద్వేషయుక్తులకు పుణ్యపాపంబులయందు విశ్వాసంబు గలుగదు. పండితులగువారే యీశ్వరవచనంబులయందు శ్రద్ధవహించి యుందురు. అట్లు శ్రద్ధ లేనివారు నరకగాములగుదురు. ధర్మోపదేశకులను, జ్ఞానప్రబోధకులను శివమూర్తులవలెఁ బూజింప వలయును.

తనయైశ్వర్యంబుకొఱకును, బరోపకారంబుకొఱకును బ్రజల నుత్తమధర్మానుష్ఠానపరులనుగాఁ జేయుచుండు రాజు జగంబునకు హితుండగుచున్నాఁడు. అతఁడు చెప్పినధర్మములను సకలప్రజలును భక్తిపూర్వకంబుగ నాచరించుచుందురు. ప్రభుఁడు ధర్మనిష్ఠుండై యున్నచో నాతని బ్రమాణంబు చేసికొని గాని, యాతనియెడల భయంబుచేఁ గాని ప్రజలందఱును ధర్మప్రవృత్తు లగుదురు. రాజు ధర్మయుక్తముగఁ బరిపాలించుచున్నచోఁ బ్రజ లాతనికి విధేయులై యెల్లప్పు డాతని శుభంబును గోరుచుందురు. అట్టిప్రజలవలన రాజును దన కభీష్టంబులగుధర్మార్థకామంబులను గాంచుచుండును. ప్రజలధర్మాధర్మంబులయం దాఱవభాగమును రాజనుభవించుచుండును. చతుర్వర్గంబులయందును రాజే ధర్మప్రవర్తకుండై యున్నాఁడు. బుద్ధిమంతుం డగు రాజు స్వధర్మనిర్వహణంబు నుద్దేశించి యర్థకామంబులకై యధర్మప్రవర్తకులగుప్రజలను ధర్మనిష్ఠులం గావింపవలయును. ప్రజాపీడనంబు వలనం గలిగినసంతాపానలము ప్రజ్వరిల్లెనేని రాజురాజ్యమును, వైభవమును, కులమునుగూడ దహించివైచును. రాజు సమస్తప్రజలయందును దయగలిగి ధర్మశీలుం డైనచోఁ బ్రజలును ధర్మపరాయణులగుదురు. మంత్రములు, ఓషధులు, నిధులు, క్షేత్రములు, బీజములు, మూలములు, రసములు మొదలగునవి యర్థనిమిత్తంబులనియు, వేదశాస్త్రములు ధర్మనిమిత్తంబు లనియు మహర్షులచే నిర్దేశింపఁబడి

యెను. రాజున కెల్లప్పుడును ధర్మోపదేశము చేయుచుండవలయును. నిరంతరము నర్థకామాసక్తుం డగురాజును శాస్త్రబోధనంబుచే ధర్మ ప్రవృత్తునిం గావింపవలయును. అనంతర మాతనికి యోగోపదేశంబు చేయవలయును. రాజునకు ధర్మోపదేశంబు చేయునాతఁడే జగద్గురుఁడు. లోకానుగ్రహంబుకొఱకు శివతత్త్వమును బ్రబోధించుచు సంసార పంకనిమగ్నులగుప్రజల నుద్ధరించునట్టి పుణ్యపురుషునిమించినతండ్రి యెవ్వఁడును లేఁడు. అజ్ఞానానలసంతప్తుం డగురాజును జ్ఞానామృతవర్షణంబునఁ దనియించు మహాత్ముఁ డఖిలప్రజలకును బూజనీయుఁడు. పాండిత్యముచేఁగాని, యనుష్ఠానంబుచేఁగాని, భాగ్యముచేఁగాని, రాజ్యాధికారముచేఁగాని యుపదేశార్హత గలుగదు. శాంతులగుముని శ్రేష్ఠులే యుపదేశార్హులు. స్వర్గమోక్షప్రదంబు లగువారివచనంబులే పరమప్రమాణములు. రజస్తమోగుణానుసారంబులగువచనంబులు నరకకారణంబులు. రాగద్వేషయుతంబులును, నసత్యంబులును గ్రోధకలితంబులు నగువాక్యములు పరిగణనీయంబులు గానేరవు. అవిద్యామూలకంబులును, సంసారబంధహేతుకంబులు నగువచనములు కోమలంబులును, సుందరంబులు నైయున్నను వానివలన నెట్టిలాభంబును లేదు. విన్నంతనే ముక్తిప్రయోజకం బగుపుణ్యముం గూర్చునట్టియు రాగద్వేషాదుల నడంచునట్టియు, శివభక్తిని లభింపఁజేయునట్టియు సద్వచనంబులు ప్రప్రథమంబున విరుద్ధంబులుగఁ దోఁచుచున్నను, జ్ఞానార్హత ప్రాప్తించినప్పు డవి శుభఫలదంబులును, సుందరంబులు నై యుండును.

అకారణంబుగ స్వభావముగ నుత్పన్నంబగునదియే పరమజ్ఞానము. మానవులు ధర్మగ్రహణంబుకొఱకుఁ బురాణములను, మహాభారతమును, మునిప్రణీతంబులగు శాస్త్రంబులను, వేదంబులను వినవల

యును. పుత్రదారాదిసంసారము బంధహేతుకం బనియు, శాస్త్రస
ముదాయము యోగాభ్యాసనిదానంబనియు మునులు నిర్దేశించియు
న్నారు. శాస్త్రంబుల నన్నిటిని గ్రహింపవలయు నని వేయేండ్లు
జీవించి ప్రయత్నించినను తుదముట్ట నెవ్వండును గ్రహింపఁజాలఁడు.
కావున నెల్లవారును శాస్త్రంబులఁ బరిత్యజించి తమజీవితంబులలఘు
త్వంబును, నక్షరతత్త్వంబును గ్రహించి పారలౌకికంబులగు కర్మం
బుల నాచరింపవలయును. పురుషునకుఁ బాండిత్యమువలనఁగాని,సామ
ర్థ్యమువలనఁగాని యెట్టిలాభంబును లేదు. పరసాధనంబులగుపుణ్యక
ర్మంబుల నాచరించుట కశక్తుం డగువాఁడు పండితుం డైనను మూ
ర్ఖుఁడే. ఆతఁడు శక్తిమంతుఁడయ్యును సంసారబద్ధం బగుతనయాత్మ
నుద్ధరించుకొనుట కశక్తుం డగుచున్నాఁడు. ఎవ్వఁడు శివజ్ఞానసద్భావ
మును బరిశీలించుటకుఁ బ్రయత్నించుచుండునో యాతఁడే పండితుఁ
డును, శక్తుఁడును, తపస్వియు, జితేంద్రియుఁడు నగుచున్నాఁడు. ఈభూ
మండల మంతయును, గాంచనమయంబగు మేరువును దానము చేసి
నను, పన్యాయముగఁ బ్రశ్నించువానికి గురుం డెన్నఁడు నుపదేశిం
పఁడు. శివజ్ఞానముంగూర్చి వినువాఁడును, జెప్పువాఁడునుగూడ శివ
లోకముం గాంచఁగలరు. దీనికి విపరీతంబుగఁ జరించువారు నరక
గాము లగుదురు.

నిత్యము, నైమిత్తికము, కామ్యము—అని శివపూజ మూఁడు
విధములు. ఈపూజలు శివున కతిప్రీతికరములు. బిల్వపత్రంబులచే
స్నానానులేపనాదిషడంగములను గావించి ప్రతిదినంబును శివునిఁబూ
జించువాఁడు శీఘ్రంబుగ శివసాక్షాత్కారమును బడయఁగలఁడు.
దేవాసురులు క్షీరసాగరమును మథించునప్పుడు లోకమాతృస్వరూ
పిణు లగు నంద, భద్ర, సుశీల, సురభి, సుమన—అను నైదుగోవులు

పుట్టెను. ఈయైదింటిలో సురభి భూలోకంబునకు వచ్చి సకలజనుల కుపకారకరంబుగను, దేవతలకు సంతుష్టిదాయకంబుగను శంకరాభిషేచనంబునకును నందే యుండెను. గోమయము, గోమూత్రము, గోరోచనము, గోక్షీరము, గోదధి, గోఘృతము అను నీయాఱంగములును, పవిత్రములును, సర్వసిద్ధికరంబులు నై యున్నవి. శివున కతిప్రియంబును, సుందరంబునగు బిల్వవృక్షము గోమయంబునుండి జన్మించెను. ఈబిల్వవృక్షమునందు లక్ష్మీదేవి పద్మహస్తయై యుండునుగావున దీనికి శ్రీవృక్ష మనుపేరు గలిగెను. పద్మోత్పలబీజంబులుకూడ గోమయమునుండియే పుట్టెను. పరమపవిత్రంబును, పీతవర్ణంబును, సర్వమంగళకరంబు నగుగోరోచనముకూడ గోసముద్భూతమే. దేవతాప్రీతికొఱకు గోమూత్రమునుండి గుగ్గిలము పుట్టెను. గోక్షీరమువలన సకలజీవులకు వీర్యంబును, సుమంగళం బగు దధియు, దేవతాప్రీతికరమైనఘృతామృతంబును సముత్పన్నంబు లయ్యెను. కావున ఘృతదధిక్షీరంబులచే శివు నభిషేకింపవలయును. పిమ్మట సుగంధంబులగు నుష్ణజలంబులచే నభిషేకించి సుగంధాదులచేఁ బరిశుద్ధిగావింపవలయును. అనంతరము శీతలజలస్నానంబు చేయించి సర్వాంగంబులను చందనలేపనంబు చేయవలయును. తరువాత బిల్వపత్త్రములు, పద్మములు, నీలోత్పలములు వీనిచేఁ బూజించి ఘృతసహితముగ గుగ్గులు ధూపము నర్పింపవలయును. ఆవెనుకపాయసమును, పానీయజలంబును, దధిఘృతంబులను, ఘృతపక్వంబు లగువివిధభక్ష్యంబులను నివేదించి ప్రదక్షిణపూర్వకంబుగఁ బ్రణామంబుచేసి విసర్జింపవలయును. ఈషడంగవిధిచేఁ బూజితుండై శివుండుసాక్షాత్కరించి యిహపరలోకసుఖంబుల నొసఁగును. శివభక్తుం డగువాఁడు ప్రతిదినమును బూజించినను, బూజింపకున్నను ప్రతిపక్షద్వాదశినాఁడును, అష్టమియం

దును బూర్వోక్తం బగుషడంగవిధిచే శివలింగము నర్చించినచో నేక వింశతిపురుషులను నరకమునుండి యుద్ధరించి స్వర్గవాసులను గావించి తాను బరమపదంబు నందఁగలఁడు. వేతనంబు గైకొనినవాఁడైన దేవకార్యమునందు నియుక్తులై భక్తిపూర్వకంబుగ శివలింగము నర్చించువారుకూడ శివలోకము చేరుదురు. మాలాకారుఁడైనను భక్తిచే శివలింగము నర్చించినచో నాతఁడు భూమండలంబున నేకచ్ఛత్రాధిపతియై పుట్టి యనంతరము శివసాలోక్యముం గాంచును. కావున శివభక్తులగువా రేవిధానముచేనైన నేకాగ్రచిత్తముతో 'ఓం నమశ్శివాయ' అనునీషడక్షరమంత్రమూలంబున శివలింగము నారాధించినచో నేక వింశతిపురుషులను నరకమునుండి యుద్ధరించి తామును శివపదప్రాప్తులగుదురు. దేవకార్యములందు నియుక్తులై వానిని భక్తిపూర్వకంబుగ నిర్వహించువారు తమ్ము నియోగించిన ప్రభువితోఁగూడ శివలోకంబు చేరి కాలక్రమంబున విపులైశ్వర్యవంతులై యేకచ్ఛత్రాధిపతులై యీభూతలంబున జనియింతురు. శివపూజార్థమై నిత్యమును పత్త్రి పుష్పాదుల నొసంగువారును సర్వదా శివస్తోత్రంబు గావించువారును నిస్సంశయంబుగా శివలోకంబుఁ జేరుదురు. యథావిధిగఁ బూజించు సమయంబున శ్రద్ధాపూర్వకముగ శివలింగమును సందర్శించువారికి సకలయజ్ఞఫలంబులును లభియించును. శివచరిత్రములను వినువారికి శివయోగులకు లభించు పుణ్యఫలము గలుగునని శివుం డానతిచ్చెను. శివాభిషేకంబునకును, శివపూజకును నామోదించువారుకూడ శివభక్తులపుణ్యఫలంబును గాంతురు. మనస్సుచేనైన భక్తిపూర్వకంబుగ శివపూజ గావించువాఁడు యథావిధిగ నర్చించిఁ ఫలంబునే పొందఁ గలఁడు. శివుఁడు, రుద్రుఁడు, హరుఁడు అనునీనామంబుల నొక్క సారి యుచ్చరించువాఁడు శివునివలెఁ బవిత్రుం డగును. అతఁడు జన

సేవితుండై యణిమాద్యైశ్వర్యంబుల ననుభవించి రుద్రలోకంబు నందును.

మునివరులారా! [illegible] శివుండు చెప్పినవిధంబున నే యతి సూక్ష్మంబును మహాఫలదాయకంబు నగునీశివధర్మమును శివపూజావిధానంబును మీసన్నిధిని సంక్షేపంబుగ వర్ణించితిని.

## —♦ క్రియాయోగకీర్తనము ♦—

మునిశ్రేష్ఠులారా! తొల్లి వ్యాసభగవానునకు సనత్కుమారుండానతిచ్చినవిధంబునఁ గ్రియాయోగముంగూర్చి చెప్పెద నాకర్ణింపుఁడు. ఆత్మతోడి చిత్తసంయోగము జ్ఞానయోగం బనియు, మానసికల్పనంబు గావించి పూజాదులం జేయుట క్రియాయోగం బనియుఁ బెద్దలు నిర్దేశించి యున్నారు. అందు జ్ఞానయోగమే ముక్తికిఁ బ్రధానకారణము. క్రియాయోగము ధ్యానాదులకు సాధనం బగుటచేఁ గ్రమంబుగ మోక్షకారణం బగుచున్నది.

శివమందిరమును నిర్మించువాఁడు ప్రతిదినమును గ్రియాయోగముచే శివపూజం గావించినఫలంబు నందఁగలఁడు. అట్టివాఁడు తనకుఁ బూర్వులగు శతపురుషులతోడను, తనతరువాత శతపురుషులతోడను నక్షయలోకసుఖంబుల ననుభవించుచుండును. మహాదేవమందిరనిర్మాణ మారంభించి యేకొలఁదిపాటిపని చేయించినను నాతనిసప్తజన్మకృతంబు లగుపాపంబులు నశింపఁగలవు. సకలదేవతాప్రధానుం డగు రుద్రదేవునిభవనసంబును గట్టించువాఁడు సకలలోకంబులయందును బ్రతిష్ఠాలాభంబు నందఁగలఁడు. సుప్రశస్తంబు లగుపుణ్యక్షేత్రంబులయందు శివాయతనంబుల నెలకొల్పువారు సకలలోకసుఖభోగంబు లనుభవించుచు నయ్యాలయంబులయం దిటికె లెన్నివత్సరంబు

లుండునో యన్ని వేలవత్సరంబులవఱకును శివలోకంబునఁ బూజ్యులై యుందురు. శివప్రతిమనుగాని, సులక్షణం బగు శివలింగమునుగాని ప్రతిష్ఠించువారు శాశ్వతం బగుశివలోకమున్ గాంచి నూఱులక్షల వర్షంబులవఱకును యథాక్రమంబుగ సకలదేవతాలోకంబులయందు ను బూజితు లగుచు వసించి యుందురు. సుప్రశస్తం బగుభవనం బున శివలింగప్రతిష్ఠాపనంబు చేయువారు మృత్యుంజయులై కృతార్థు లగుదురు. సర్వగుణవిశిష్టం బగుశివలింగమును బ్రతిష్ఠించుటవలనఁ గల్పాంతంబువఱకును వంశోద్ధారకత్వంబు సిద్ధించును. మహాదేవుని దివ్యలింగప్రతిష్ఠ చేయవలయునని మనఃపూర్వకముగ సంకల్పించుకొనువా డుఁగూడఁ దమవంశమునందుఁ బూర్వపరంబుల నెనిమిదితరముల వారి నుద్ధరించుచు శివసాయుజ్యముం గాంచఁగలఁడు. మఱియును శివ మూర్తిని నిర్మించి దర్శించినట్లు భావించువారును, భాగ్యము గల్గి నచో శివలింగప్రతిష్ఠ చేయుదు నని సంకల్పించువారును దత్క్షణమందే తమ కులమువారి కందఱకును స్వర్గాదిభోగములం గల్పించుటకు సమర్థులై యుందురు. ఇందుల కెట్టిసంశయంబును లేదు.

ప్రజాపతి యగుబ్రహ్మదేవుండు యముని ధర్మాధికారంబునకు నియోగించినప్పుడు «ఓధర్మరాజా! దండపాశధారు లగునీకింకరులు సర్వదా భూలోకంబునఁ జరించుచు ధర్మాధర్మశాసనంబు గావింతురు గాక! నేను నీకొకమాట చెప్పుచున్నాను. కేవలము జగదీశ్వరుండగు శంకరు నుపాసించువారిని నీవు విడువవలయును. అట్టివారి కెంతమా త్రమును యమలోకనివాసంబు లేదు. వారు నిరంతరము శివాధీన హృదయులై సత్కర్మానుష్ఠానంబులచే శివారాధనంబు చేయుచుం దురు గావున నీవు వారికి దూరంబున నిలిచియుండవలయును. వారు రుద్రగణంబులుగా భావింపలయును. కూరుచున్నప్పుడును, నిదురించు

చున్నప్పుడును, నడచుచున్నప్పుడును, ఎల్లవేళలనుగూడ శాంతంబగు శివనామకీర్తనంబు గావించువారికి నీవుదూరముండవలయును. నిత్యనైమిత్తికవిషయంబులయందు దేవదేవుం డగుశంకరునిఁబూజించుచుండువారు నీకు దర్శనీయులు గారు. మహాదేవు నాశ్రయించి పుష్పధూపవస్త్రాలంకారాదిప్రదానంబులచే నారాధించువారిని నీవు గ్రహింపనైనఁ జాలవు. మహాదేవమందిరంబున గోమయాదులచే నుపలేపించువారును, సమ్మార్జనంబు సేయువారును బుణ్యాత్ములుగావున వారివంశంబున మువ్వురుపురుషులను నీవు విడువవలయును. శివమందిరంబు నిర్మించువారివంశంబున శతపురుషాంతరంబులవఱకును నీయధికారమును జూపవలదు. మహేశ్వరలింగప్రతిష్ఠాపకులవంశంబునం దయుతపురుషులు నీశాసనంబున కతీతు లని యెఱుంగుము." అని యానతిచ్చెను. సూర్యపుత్రుండగు యముండు లోకహితంబుకొఱకు బ్రహ్మోపదేశంబులను విస్పష్టముగఁ దనదూతల కెఱింగించెను.

శివలింగమును బ్రతిష్ఠించి దానిని బూజించువారికి సర్వాభీష్టంబులును సిద్ధించును. ప్రస్థపరిమితం బగు ఘృతంబుచే శివు నభిషేకించువాఁడు వేదజ్ఞు లగుబ్రాహ్మణులకు సహస్రగోదానంబులు చేసిన ఫలంబు నందును. త్రిభువనేశ్వరుం డగుమహాదేవుని నాఢకపరిమితం బగుఘృతంబుచే నభిషేకించువాఁడు సప్తద్వీపభూతలంబున కధీశ్వరుం డగును. కృష్ణపక్షచతుర్దశియందు జగదీశ్వరునిలింగమునకు ఘృతాభిషేకంబుచేసి పూజించువాఁడు బహుపాపవిముక్తుం డగును. పూర్ణిమయందుగాని, అమావాస్యయందుగాని శివలింగమును ఘృతంబుచే నభిషేకించి యేకాహారి యగువాఁడు సకలపాపవిముక్తుండగును. సంధ్యాసమయంబున శివున కాజ్యాభిషేకంబు సేయువాఁడు జ్ఞానాజ్ఞానకృతంబు లగు పాపంబులనుండి విముక్తుం డగును. సకలదేవతలలో రుద్రుం

డును, సకలహవ్యంబులతో నాజ్యంబును, శ్రేష్ఠంబులు గావున నీరెం
టిసంయోగమును సకలపాపహరమైనది. మహాదేవునకు క్షీరాభిషే
కంబు చేయువాఁడు పాయసకర్దమసంభృతంబు లగుక్షీరవాహినులు
గల భూర్లోకంబులు బొందును. అట్టివాఁడు సప్తజన్మంబులవఱకును
సంతోషము, ఆహ్లాదము, స్వాస్థ్యము, ఆరోగ్యము గలిగి సుందరాకా
రియై యుండును. క్షీరంబులనుండి దధిఘృతాదు లుత్పన్నంబులైనట్లు
క్షీరాభిషేచనంబువలనఁ గోరికలెల్ల సిద్ధించును. దుగ్ధంబులచే
శివుని స్నానంబు చేయించువాఁడు దుగ్ధనిర్మల మగుజ్ఞానలాభంబు పం
దఁగలఁడు. వానికి శివానుగ్రహంబున సకలగ్రహంబులు సానుకూ
లంబు లగుటచేఁ బుష్టిలాభంబు గలిగి సకలలోకప్రియప్రాప్తి యగు
ను. ఈయర్థంబున నొకయితిహాసంబు గల దాకర్ణింపుఁడు.

ఒకప్పుడు గౌతమి స్వర్గంబున విహరించుచుఁ బతితోఁగూడి
యున్నపరమరూపవతియు సూర్యపత్నియు నగుసుమతిం గాంచి 'ఓదేవీ!
ఈస్వర్గలోకంబున నింద్రాదు లగుసకలదేవత లున్నారు. వీరిలో
నెవ్వరికి నీకుఁ గలశోభయు, సుగంధంబును, కాంతియు, నుత్తమరూపం
బును, మనోజ్ఞవస్త్రంబులును గానవచ్చుట లేదు. ఇంద్రాదులు
దేవగణంబులలోఁ బ్రధానులై యున్నను మీదంపతులశోభ వారిని
మించియున్నది. మీయిరువురిహృదయంబులును సుస్వస్థంబులై పర
మోత్తంబులై యున్నవి. ఓవరవర్ణినీ! ఏతపఃప్రభావముచే, నేదాన
ముచే, నేహోమాదికర్మంబులచే మీకిట్టియదృష్టము లభియించియు
న్నదో సెలవిమ్ము.' అని ప్రార్థించెను. వానికి సుమతి యిట్లనియెను.
'' ఓగౌతమీ! నానాథునిపూర్వపురుషులు మహేశ్వరయజ్ఞంబు నొన
రించి యద్దేవుని సంతృప్తునిఁ జేయుటచే వారివంశజుం డగునాప్రాణే
శ్వరున కీయున్నతపదము లభించినది. నేను నట్టియజ్ఞంబున మహే

శ్వరు నారాధించినదాన నగుటచే నీతనికి సతినై స్వర్గావాసంబు గాం చితిని. నేను తీర్థోదకాదినానాద్రవ్యంబులచే శివు నభిషేకించి సంతు ష్టుం జేసితిని. అందుచేతనే సకలదేవతల మించినకాంతి నాకులభియిం చినది. నేను శివునకు ఘృతాభిషేకంబు సేయుటచేత నాహనంబు ప్రసన్నమై శరీరము సుందరమై యెట్టియసుఖంబును లేక నేను సర్వలో కప్రియునై యున్నాను. నాకీస్వర్గంబున నిచ్ఛామాత్రంబుననే వస్త్ర మాల్యానులేపనభూషణాదులు లభించుచుండును. నానాథుండుగూడ నట్లుకాంతిమయుండై యున్నాఁడు. ఇది యంతయును శివానుగ్రహామే. నేను శివలింగసమ్ముఖమ్మున మనోజ్ఞంబు లగురుచ్యభక్ష్యంబుల నివే దించితిని. అందువలన నా కెల్లయెడలను సర్వదా సంతృప్తి గలుగు చుండును. నానాథుండు సర్వకాముఁడై సహధర్మిణి నగునాతోఁ గూడి ప్రతిదినంబును భక్తిపూర్వకముగా శివార్చ చేయుచుండును. అందుచేతనే మాకీయుత్తమస్థానంబు నివాసంబున లభించినది. మనో వాక్కాయకర్మంబులచే శివలింగార్చనంబుసేయువారికిఁ గోరినకోర్కు లన్నియు సిద్ధించును. బ్రహ్మరుద్రవిష్ణ్వాదుల కీశ్వరుండును మహా దేవుండు నగుశివునిఁ బూజించువారికి దేవదుర్లభంబు లగునభిమత ములు లభించును.’

అగురు, చందనము, కర్పూరము, కుంకుమము, ఉశీరము మొద లగువానిచే శివలింగము ననులేపించువారు శివానుగ్రహముచే వరప్రా ప్తులును భోగసిద్ధులు నగుదురు. కాలాగురుధూపంబులు రక్తచందన దానంబులు గావించువారికి రోగంబు గలుగును గావున నవి యెన్నఁ డును శివపూజయం దుపయోగింపఁదగదు. గుగ్గులుమిశ్రితం బగు ధూపంబునే శివున కర్పింపవలయును. ఉత్తమంబును, సుగంధయుతం బును, అతిప్రియంబును, సద్యస్సంతోషకరంబును, ఘృతమిశ్రితంబును

నగుగుగ్గులుధూపంబుచే శివుని సేవింపవలయును. ఆసవసంయుతం బగు సల్లకీధూపము నెన్నఁడును శివున కర్పింపఁదగదు. మఱియు నని ష్టజనకంబు లగుపుష్పంబులనుగూడ వర్జింపవలయును. మృదుగంధ యుతంబు లగుపద్మంబులును, శుష్కంబులైనను బిల్వపత్త్రింబులును శివునకు సర్వదా ప్రియకరంబులు. జలజంబు లగుసకలపుష్పంబులును రక్తనీలోత్పలంబులును, మాలతి, మల్లిక, మొల్ల, అతిముక్తము, పాట లము, కరవీరము, కర్ణికారము, బర్బరము, చంపకము, నేలవేము, కలిగొట్టు, శతపత్త్రిక, తులసి, అగిసి, కురుకుందము, కుందము, అశో కము, కింశుకము మొదలగుపుష్పములు మహాదేవునిపూజకుఁ బ్రశ స్తములు. సుగంధయుతంబు లగు నిట్టిపుష్పము లన్నియును శంకరు నకుఁ బ్రియంబులు. ఇట్టిపుష్పంబులచేఁ బూజించి వివిధవర్ణంబు లగు సుగంధకుసుమమాల్యంబులచే మహాదేవు నలంకరింపవలయును. పూర్వోక్తంబు లగుపుష్పంబు లన్నిటిచేతను శివునిఁ బూజించువాఁడు సకలసౌభాగ్యవంతుఁడు, సిద్ధవిద్యాధరగంధర్వాప్సరోజనపూజితుండు నై భిన్నభిన్నకల్పంబులయం దవతరించుచుండును. కంటకమయం బులును, ఉగ్రగంధంబులును నగుపుష్పంబులచే విషాశనుం డగు శివు నర్చించువాఁడు సర్వభూతప్రియుం డగును. పుష్పాభావంబున భృం గపత్త్రములు, తమాలపత్త్రములు మొదలగువానిచే శివపూజచేయ వలయును. అట్లు చేయువాఁడు సమస్తోపచారంబులును గావించినవాఁ డగుచున్నాఁడు. పరమకారణుండగు మహాదేవునిఁ బ్రతిదినమును బూజించువాఁ డప్సరోగణపూజితుండై యక్షయలోకంబునంది కాల క్రమంబున భూలోకంబునఁ బరాక్రమశాలియు, నేకచ్ఛత్రాధిపతియు నై జన్మించి తుదకు ముక్తిలాభంబుఁ గాంచును. కేతకీకుసుమంబు లును, జపాపుష్పంబులును శివపూజకు వర్జ్యంబులు. శ్రీపదా దికుసు

మంబులచేఁ బూజసేయువారు మ్లేచ్ఛదేశాధీశ్వరు లగుదురు. ముర, జటామాంసి, కర్పూరము, అగురు, చందనము, తుంగముస్త వీనిచే మిశ్రితం బగు సుగంధజలంబున శివు నభిషేకింపవలయును. భక్తు లగువారు తమతమ కుపలభ్యంబు లగుదుకూల, కౌశేయ, కార్పాసాదివసనంబులచే మహేశ్వరు నర్చింపవలయును. తమ కభిమతంబు లగుభక్ష్యభోజ్యంబులను, ఫలంబులను తమ కతి ప్రియంబులగు సమస్తవస్తువులను మహాదేవున కర్పింపవలయును. తమకు మనోహరంబు లగు సువర్ణమణిమౌక్తికాదులను దేవాదిదేవుం డగుశంకరు నుద్దేశించి నివేదింపవలయును. పరమయోగియు, సదాచారవంతుం డును నగుబ్రాహ్మణుని శివునిగా భావించి శివోద్దేశంబున శివనామం బునుచ్చరించుచు సకలవస్తువుల నాతని కర్పింపవలయును. విషువసంక్రాంతులు, వ్యతీపాతయోగములు, అయనప్రవేశములు, గ్రహణములు, చతుర్దశులు, అష్టములు, పర్వములు మొదలగునవి నైమిత్తిక పుణ్యకాలంబులుగా నిర్దిష్టంబు లయ్యెను. ఇట్టి పుణ్యసమయంబుల యందు శివపూజం జేసినచో నిత్యపూజకంటెను సహస్రగుణాధికం బగుఫలంబు లభించు నని యెఱుంగవలయును.

## —♦ వివిధక్రియాఫలకీర్తనము ♦—

వ్యాసభగవానునకు సనత్కుమారుండు మఱియు నిట్లు చెప్పం దొడంగెను. శివయోగుల నారాధించువారు మహాభోగులై శివయోగాధికారు లగుదురు. కావునభోగార్థులగువారు శివయోగిజనంబుల నాశ్రయించి యన్నపానంబులచేతను, వస్త్రశయ్యాదిభోగ్యవస్తుప్రదానంబులచేతనువారినిబరితృప్తులంగావింపవలయును. ధనవంతుఁడైనను దరిద్రుఁడైనను శక్తికొలఁదిభక్తిపూర్వకంబుగశివయోగులనర్చించువాఁ

డు సూర్యకిరణసదృశకాంతిమంతంబును, సర్వకామప్రదంబు, నగుదివ్య విమానము నధిరోహించి తనవంశంబున నష్టపురుషులతోఁగూడ శివ పురంబును బ్రవేశించి యందు దేవభోగ్యంబు లగుబహుభోగంబులం గాంచి సహస్రసుందరీసేవితుండై శతకోటికల్పంబులు నివసించి పిమ్మ ట ననంతకాలంబువఱకును విష్ణులోకంబున వైష్ణవభోగంబు లనుభ వించి యనంతరము బ్రహ్మలోకంబున మనోరమంబు లగుసకలసుఖం బుల ననుభవించి తరువాతఁ గ్రమక్రమంబుగఁ బ్రజాపతిలోకము ఇంద్రలోకము, గంధర్వలోకము, యక్షలోకము చేరి యందందు విపు లభోగంబులఁ బరితృప్తుండై క్రిమ్మఱ భూలోకంబున బ్రాహ్మణవం శంబునఁ బ్రజ్ఞావంతుండును, గుణవంతుండునై జన్మించి పూర్వము వలెనే శివయోగుల నుపాసించుచుఁ దత్సంసర్గంబున శివజ్ఞానప్రాప్తుం డై తన్మూలంబున ముక్తుం డగును.

ధనమూలకంబు లగు పూజాదులును, అగ్నికార్యంబులును, చాంద్రాయణాదివ్రతంబులును గర్మయజ్ఞంబు లనియు, స్వాధ్యాయ ము, మంత్రజపము, మాటిమాటికి శివచింతనము ననునీమూఁడును ధ్యానయజ్ఞంబు లనియు, అధ్యాపనము, అధ్యయనము, వ్యాఖ్య, శ్రవణము, చింతనము ననునీయైదును జ్ఞానయజ్ఞంబులనియు నిర్దిష్టంబు లయ్యెను. ఇందు జ్ఞానధ్యానంబులు ముక్తిప్రదంబులు. జ్ఞానము లే కుండ నెన్నఁడును ధ్యానము గలుగదు. ధ్యానతత్పరులు గానివారు జ్ఞానాధికారులు గాఁజాలరు. జ్ఞానధ్యానములరెంటి నవలంబించువారే భవసాగరమును దరింపఁగలరు. సంసారవిరక్తుం డగువానికి నిరంతర యోగాభ్యాసంబుచే నపాయరహితంబును, ప్రసన్నంబును, ఏకాగ్రంబు నగుజ్ఞానంబు లభించును. వేదచింతనంబువలనం గలిగినజ్ఞానము తర్క వితర్కంబులచే బహుమతం బగుటవలన నప్రసన్నంబును, జంచలంబు

నగుచున్నది. అట్టిజ్ఞానము ముక్తిలాభంబున కనుకూలంబు గానేరదు. ప్రాజ్ఞుం డగువాఁడు గురువచనంబు నాకర్ణించి దాని నెల్లప్పుడును చింతించుచుండవలయును. అందువలన నయ్యుపదేశవాక్యము నిర్మలంబును ప్రసన్నంబు నగును. ఆరంభంబున శ్రుతివాక్యశ్రవణంబును, గ్రియాకాలంబునఁ జింతనంబును, నిశ్చయంబైనపిదప భావనంబును గావింపవలయును. ఇందువలనఁ గ్రమక్రమంబుగ నిష్ఠాకాలంబున జ్ఞానము ప్రసన్నంబు గాఁగలదు. కతకాదిచూర్ణంబులచే మొదట జలంబు కలుషితం బయ్యును, దుదకుఁ దేఱుకొనునట్లు రాగద్వేషకలితంబు లగువాదప్రతివాదములచే జ్ఞానము వికలం బయ్యును తుదకు విశుద్ధంబు గాఁగలదు. ఈసంసారము నిస్సారం బనియుఁ గష్టబహుళం బనియు భావించుచుండువానికిఁ గ్రమక్రమంబుగ నిర్మలజ్ఞానోదయం బగును. నిస్తరంగసాగరముంబోలి నిర్మలంబును, నిశ్చలంబును, నేకాగ్రంబు నగునదియే జ్ఞానము. తక్కినదంతయు నజ్ఞానమే యగుచున్నది. ప్రసన్నంబును భావనామయంబును, రాగద్వేషవివర్జితంబు నగు జ్ఞానమే ముక్తిప్రదమైనది. అజ్ఞానపాశబద్ధుం డగువాఁడు ముక్తుండు గానేరఁడు. జ్ఞానముచే నజ్ఞానమును నశింపఁజేయుటవలనఁ బురుషుండు ముక్తుం డగును.

సంసారమే యజ్ఞానమునకు బీజం బగుటవలన సంసారులందఱు నజ్ఞానులే యగుచున్నారు. సూర్యోదయంబున నంధకారముం బోలి జ్ఞానోదయంబున నజ్ఞానంబు నశించుచున్నది. అజ్ఞానంబువలన రాగాదులును, వానివలన ధర్మాధర్మంబులును, వానిమూలంబున దేహంబును గలుగుచున్నవి. శరీరమే వివిధక్లేశంబులకుఁ గారణం బగుచున్నది. కావునఁ గ్లేశరాహిత్యంబు నపేక్షించువాఁడు మరల దేహధారి యగుటకుఁ గోరంజనదు. అట్టివాఁడు జగత్తత్త్వబోధనంబువలన నజ్ఞా

నమును మరలింపవలయును. అందువలన రాగద్వేషాదులు సంభవిం పకుండును. రాగద్వేషాదిద్వంద్వభావవిరహితుం డగువానిపుణ్యపాప క్షయం బగును గావున మఱి వానికి జన్మంబు గలుగదు. శరీరసం యోగంబు నందనియాత్మ సర్వదా క్లేశవివర్జితం బై యుండును. క్లేశ ముక్తుండును, బ్రసన్నుండు నగునాతఁడే ముక్తుం డనఁబడును. అజ్ఞాన వశంబుననే దేహులకు సకలదుఃఖంబులును గలుగుచున్నవి. అట్టి యజ్ఞానము జ్ఞానంబువలననే గాని మఱియెట్టికర్మంబులవల్లను నశించు నది కాదు. జీవులపుణ్యపాపక్షయంబునకు జ్ఞానముకంటె నితరోపా యంబు లేదు. కావున మోక్షార్థి యగువాఁడు సర్వదా జ్ఞానాభ్యా సంబు చేయవలయును. తోముచున్నకొలఁదిని దర్పణంబు నిర్మలం బగునట్లే జ్ఞానము నభ్యసించుచున్నకొలఁదిని బుద్ధి నిర్మలం బగుచుం డును. అట్టిజ్ఞానామృతరసంబు నొక్కసారి యాస్వాదించువాఁడు సకల కర్మంబులను బరిత్యజించి యింకను దానికొఱకే ప్రయత్నించుచుం డును. అయ్యమృతమాధుర్యము నెఱుంగఁజాలనిమూఢుఁడు కేవలము విషయలంపటుండై పోవును. జ్ఞానామృతంబుచేఁ బరితృప్తుండును, కృత కృత్యుండు నగుయోగికి మఱి చేయందగిన యెట్టికర్మంబును లేదు. ఉన్నచో నాతఁడు తత్త్వవిదుండు గాఁడనియే చెప్పవచ్చును.

జ్ఞాని యగువాఁడు సర్వసంపన్నుండును, బ్రియదర్శనుండు నై యుండును. అతని కిహపరలోకంబులయందు చేయందగిన దేదియును లేదు. జ్ఞానముకంటెఁ బాపనాశనకరం బగుపవిత్రసాధన మేదియును లేదు. నిత్యాభ్యాసమువలనఁ గాని యట్టి జ్ఞానరత్నము లభింపదు. వ్రతము, దానము, తపము, యజ్ఞము, సన్యాసము మొదలగుసత్క ర్మంబులవలన స్వర్గాదిభోగంబులు లభింపవచ్చును. కాని యవియు

 యును గాలాంతరంబున నశించునవియే. కాని యమూల్యమగు

జ్ఞానము మాత్రము నిరపాయమైనది. ఏకాగ్రచిత్తంబున మునిప్రణీతంబు లగు పురాణంబులయందలి ధర్మంబుల నాకర్ణించువానికి సకల పాపంబులును నశించును. యజ్ఞకర్మానుష్ఠానంబుచే దేవత్వంబును, తపంబుచే బ్రహ్మలోకగమనంబును, దానంబుచే వివిధభోగంబులును లభించును. కాని ముక్తి లభించుటకు మాత్రము జ్ఞాన మొక్కటియే యాధారమై యున్నది.

మానవుఁడు ధర్మరజ్జువు నవలంబనంబుగఁ జేసికొని యూర్ధ్వలోకంబులకును, అధర్మరజ్జువు నాధారంబుగఁ గైకొని యధోలోకంబులకును బోవుచుండును. ధర్మాధర్మరూపంబులగు నీరెండుత్రాళ్ళను జ్ఞానఖడ్గంబుచే ఛేధింపఁగలవాఁడే యశరీరియు మోక్షార్హుండు నగుచున్నాఁడు. జ్ఞానులకుఁగూడ ధర్మాధర్మంబులవలన బంధంబగునేని వారికిఁక ముక్తి యెట్లు? దేహధారికి శుభాశుభకర్మత్యాగంబు గావించుట యసాధ్యము. అధర్మనివృత్తివలననే పుణ్యంబును, ధర్మత్యాగంబువలననే పాపంబును దటస్థించుచుండఁగా నిఁక నిశ్చలుండై యుండుట యెట్లు? గర్భావస్థానాదులయందుఁగూడఁ గర్మం బవశ్యంబుగ సంఘటిల్లుచుండును. కావున జ్ఞానకృపాణంబుచేఁ గామాకామకృతంబు లగు శుభాశుభకర్మబంధంబులను భేదించి విశుద్ధభావంబున నాత్మనిష్ఠుండు గావలయును. ప్రదీప్తంబగునగ్ని శుష్కంబులు నార్ద్రంబులు నగు నింధనంబులను భస్మంబుగఁ జేసివైచునట్లే జ్ఞానాగ్నిచే శుభాశుభకర్మంబులను నశింపఁజేయవలయును.

మంత్రసిద్ధుఁ డగువాఁడు పాములతో నాడుచుండియు వానిచే దష్టుండు గానియట్లే జ్ఞానియు నింద్రియసుఖంబు లనుభవించుచుండియు లిప్తుండు గాకుండును. భక్షితం బగువిషము మంత్రౌషధబలంబున జీర్ణంబై పోవునట్లే చేయంబడినపాపము జ్ఞానబలంబునఁ దత్క్ష

ణమే నశించిపోవును. మోక్షప్రాప్తికి జ్ఞాన మెట్టిదో, ధ్యానముగూడ నట్టిసాధనమే. జ్ఞానధ్యానముల కించుకంతయును భేదములేదు. మనన శీలురగు మహాత్ములు ధ్యాననిరతులై మోక్షలాభముం గాంతురు. ధ్యానమువలన నతులైశ్వర్యంబును, దానివలన నపరిమితసుఖంబును లభించును. జ్ఞానముచే శక్తిసుఖంబును త్యజించి ముక్తిఫలముం గాంతురు. సకలయజ్ఞంబులయందును, నిత్యంబును, విశుద్ధంబును, ప్రసన్నంబును, సకలదోషవర్జితంబును నగుధ్యానయజ్ఞమే శ్రేష్ఠమైనది. అంతర్యాగోపచారంబులచే ధ్యానయజ్ఞంబున సర్వదా భగవానుండగు మహేశ్వరునిఁ బూజించువాఁడు పరమగతిం గాంచఁగలఁడు. యమాది నియమంబులచే నాత్మాద్యేకాదశపుష్పమాలంబున దశదిక్[illegible]ంబున శంకరు నర్చించువాఁడు ముక్తుం డగును.

కర్మయజ్ఞముకంటెఁ దపోయజ్ఞము దశగుణంబు లధికమైనది. దానికంటె జపయజ్ఞము శతగుణంబు లధికమైనది. జ్ఞానధ్యానాత్మకంబును, సూక్ష్మంబు నగుశివయోగ మన్నిటికంటెను నధికఫలదం బగు మహాయజ్ఞ మగుచున్నది. పూజవలన విపులరాజ్యంబును, అగ్నికార్యమువలన సంపదయు, జపంబువలనఁ బాపవిముక్తియు, జ్ఞానధ్యానంబులచే మోక్షంబును లభించును. సకలపాపవిముక్తుండగువాని నిర్మలబుద్ధియే జ్ఞానధ్యానాసక్తంబు గాఁగలదు. యోగోపదేశకుం డగువాఁడు కోటిధనుష్పరిమితదూరమునందున్నను నాతని దర్శింపవలయును. అగ్నికార్యోపదేశకుని దదర్ధపరిమితదూరంబునను, గంగను షష్టిచాపపరిమితదూరంబునను, ధర్మక్షేత్రమును దదర్ధపరిమితదూరంబునను దర్శింపవలయును. కర్మపరతంత్రులగువా రగ్నియందును, మనీషులగువారు హృదయమునందును, అల్పబుద్ధు లగువారు ప్రతిమయందును దేవత్వముం గాంచుచుందురు. కాని జ్ఞానసంపన్ను లగు

పాదమాత్రము సర్వప్రదేశములును శివమయంబులుగాఁ దిలకించు చుందురు.

యోగిజనంబులు ప్రతిమయందు గాక తమయాత్మలయందే శివుని దర్శించుచుందురు. భావనకొఱకే ప్రతిమ కల్పితం బయ్యెను. సర్వమయుం డగుశివు నెవ్వఁడు స్మరించుచుండునో యాతనియాత్మ యందే నిత్యమును శాంతమూర్తి యగుమహాదేవుం డధివసించి యుండును. ఆత్మయందు శివదర్శనంబు చేయఁజాలనివారు తీర్థక్షేత్రంబుల యందు మహాదేవాన్వేషణంబు సేయుచుందురు. మహాయోగి యొక్క దివసంబైనను నర్ధదివసంబైనను నివసించినస్థానము మంగళమయంబును బవిత్రంబు నగుతీర్థతపోవనస్వరూపంబు గాంచును. యోగజ్ఞానము నభ్యసింపవలయు నని యాకాంక్షించువాఁడును మహామఖంబులు గావించినవారికి లభింపని యుత్తమగతిం గాంచఁగలఁడు. యోగలాభంబు నందఁజాలక మహాక్లేశంబులోఁ బరలోకసుఖంబు గోరి పుణ్య కర్మానుష్ఠానంబు గావించువారు రత్నలాభంబు గనఁజాలక పాషాణంబులు మోచికొనుచు జీవయాత్ర గడపువారితోఁ దుల్యులగుచున్నారు. కష్టసాధ్యంబులగు నుగ్రతపోయజ్ఞాదులవలన లభించు సకలపుణ్యంబులును, విశుద్ధహృదయముతో శంకరుని ధ్యానించుటవలన క్షణమాత్రంబున లభించును. రాజునకు గూఢచారులవలె బహిశ్చరులంతప్రియులు గారు. అట్లే శంకరునకు ధ్యానతత్పరులవలెఁ గర్మతత్పరు లంతప్రియులు గానేరరు. బహిఃస్థితంబు లగుహస్తిదంతంబుల కంటె వదనమధ్యస్థంబు లగుదంతంబులే ప్రియంబులైనట్లు మహాదేవునకు నంతర్ధ్యాననిరతు లగుభక్తులే యతిప్రియు లగుచున్నారు. కర్మతత్పరు లట్టివారు గానేరరు. కావున నంతరింద్రియగోచరం బగు నమూల్యమహాజ్ఞానము లభింపఁజేయు ధ్యానయోగంబుచేతనే సర్వశా

సర్వేశ్వరు నారాధింపవలయును. కర్మయోగంబును జ్ఞానయోగము నకు సాధనమగుచున్నది. ఒకయేనుఁగుతోఁ బోరాడుచున్న యేనుఁగు మఱియొక మిత్రగజసాహాయ్యంబుచే విజయలాభంబు నందునట్లే కర్మయోగసాహాయ్యంబునఁగూడ మానవుఁడు శివజ్ఞానంబు సంపాదించుటకు సమర్థుం డగుచున్నాఁడు. పక్షి తనపక్షద్వయసాహాయ్యంబు వలన నాకసంబున బాగుగ నెగురుటకు సమర్థంబైనట్లే మానవుఁడు కర్మజ్ఞానయోగంబులు రెంటివలనను బరమపదంబు గాంచుటకు శక్తుం డగుచున్నాఁడు.

పరమేశ్వరుని యథావిధిగఁ బూజించి యొకముహూర్తమాత్రము ధ్యానించుటవలనఁ గలుగుపుణ్యఫల మనంతమైనది. జ్ఞానయోగసంపాదనంబునకుఁ బ్రయత్నించుచు నశక్తావస్థయందే మరణించువాఁడుగూడఁ దనశ్రద్ధాభక్తులప్రభావంబువలన రుద్రలోకంబుఁ జేరి దివ్యభోగంబు లనుభవించి మరల యోగికులంబున జనియించి జ్ఞానయోగప్రాప్తుండై సంసారవిముక్తుం డగును. కొలఁదికాలముమాత్ర ముండి ఫలాభావంబువలనఁ దొలఁగిపోవునట్టిశ్రద్ధ మృద్వియనియు, ఐహికఫలలాభమాత్రంబున సంతుష్టి నంది వదలిపోవునది మధ్యమంబనియు, నెన్నఁటికిని నిరపాయంబై యుండునట్టిశ్రద్ధయుత్తమంబనియుఁ జెప్పుదురు. ఇట్టిశ్రద్ధలలో నేది లభించినను మానవుఁడు క్రమంబుగ మూఁడుజన్మంబులలో జ్ఞానలాభంబు నందును. వ్రతతపోదానాదుల వలనం గలుగుపుణ్యఫలంబులు మహాదేవునియెడలం గలుగు నిశ్చల భక్తివలననే సిద్ధింపఁగలవు. శివస్వరూపవిజ్ఞానంబువలన మాత్రమే మోక్షము లభించును.

కర్మయోగుల కిచ్చినదానము దశజన్మంబులవఱకును, తపోనిష్ఠుల కొసంగినది శతజన్మంబులవఱకును, తపోయజ్ఞసంపన్నుల కర్పిం

చితటి సహస్రజన్మంబులవఱకును, యోగిజనంబులకు నివేదించినదాన
ము లక్షజన్మంబులవఱకును ఫలప్రదం బగుచుండును. శివజ్ఞానియగు
వాని కర్పించిన యెట్టియల్పదానం బైనను గల్పాంతంబువఱకు సది
మహాఫలదాయకం బగుచుండును. దానంబున కల్పత్వాధిక్యంబులు
లేవు. పవిత్రదేశకాలంబులయందు భక్తిశ్రద్ధలతో విధిపూర్వకంబుగ
సత్పాత్రంబున నివేదించినదాన మెంతయల్పం బైనను నక్షయఫలదం
బగుచున్నది. అనుకూలంబులగు దేశకాలపాత్రంబులయందు విధివిధా
నంబున శ్రద్ధాపూర్వకంబుగ గావించు దానహోమాదులు శ్రేష్ఠంబులు
నమోఘఫలదంబులు నగుచున్నవి. సత్పాత్రంబున కర్పించు దానము
స్వల్పంబైనను సర్వకామదం బగును. జ్ఞానసలిలంబుచే విశుద్ధుండును,
శీలంబను భస్మంబుచే విలిప్తుండు నగుపురుషుఁడే యుత్తమదానపాత్రుం
డగుచున్నాఁడు. జ్ఞాననౌకచే సంసారసాగరమును దరింపఁజేయఁగల
వాఁడే దానపాత్రుఁడు.

ఎవ్వనిగృహంబున శివయోగులు భిక్షాసత్కారంబులచే సర్చితు
లగుచుండురో యాతనివంశం బంతయు నరకార్ణవమునుండి యుత్తీర్ణం
బుగాఁగలదు. శివయోగికి అన్నప్రదానంబు చేయుటవలన యజ్ఞాగ్ని
హోత్రతీర్థసేవాదులవలనం గలుగుఫలంబు లభించును. జ్ఞానమయుం
డును, శాంతచిత్తుండును, శివధ్యాననిరతుండు నగుయోగికి శ్రద్ధతో
నన్నదానంబు చేయువాఁడు పాపముక్తుం డగును. అట్టివానికి సకలా
భీష్టంబులును సిద్ధించును. శ్రాద్ధసమయంబునఁ బితృదేవతలనుద్దేశించి
శివయోగులకు భోజనంబు వెట్టువాఁడు ఏకవింశతి పురుషులతోఁ
గూడ శివలోకావాసంబు గాంచును. శివయోగి మహేశ్వరధ్యానంబు
చేయుచు భుజించునుగావున నాయన్నము శివుండు భుజించినట్లె యగు
చున్నది. గృహస్థుం డగువాఁడు నిత్యమును బకాపేక్షంబులను శివు

కోటి కగ్నియందు హోమంబు చేయుటయు, గురుభాగంబును కల్పిం
చుటయు విధిగ భావింపవలయును. శివాగ్నిగురుబ్రాహ్మణులకు సక
లపక్వాన్నంబులను నివేదించి తదనంతరము ప్రతిదినంబును భుజించు
వాఁడు నిస్సంశయముగా రుద్రతుల్యుం డగును. అట్లు నివేదింపక
భుజించువాఁడు పాపభోజి యగును. శివాగ్నిగురుపూజాదులవలన
వధ్యస్థానంబు లగు ప్రొయి, ఱోలు, రోఁకలి, నీళ్ళకడవ, చీపురు వీని
వలనంగలుగు పాపంబు చెందదు. శివాగ్నిగురులకు నివేదించినయన్న
మునం దెన్ని మెతుకు లుండునో యన్నివేలవర్షంబులు దాత శివలోకా
వాసుం డగును. ఆయన్నమాజ్యసహితం బయ్యెనేని దశగుణాధికఫ
లదం బగును. షాష్టికాన్ననివేదనంబు శతగుణాధికంబును, శాల్యన్న
నివేదనంబు దానికంటెను దశగుణాధికంబు నగుచున్నది. మఱియు
రక్తశాలి, కామశాలి మొదలగు నుత్తమభేదంబులుగల యన్నంబు
లుత్తరోత్తరఫలవృద్ధిదంబులై యుండును. ఘృతసహితంబు లగునుత్త
మవ్యంజనంబులు పుణ్యదాయకంబులు. క్షీరయుతం బగునన్నము
దశగుణంబులును, దధిశర్కరాయుక్తం బగునది ద్వాదశగుణంబులును
సురసంబును, శీతలంబును, కర్పూరసువాసితంబు నగునన్నము దశకో
టిగుణంబులు నధికఫలప్రదంబై యుండును. గుడఖండసహితంబు
లును, ఘృతపక్వంబులు నగు రుచ్యభక్ష్యంబులు శివాగ్నిగురునివే
దితంబులై కోటిగుణితంబగు ఫలంబు నిచ్చును. మఱియు స్వాదుస్ని
గ్ధసుగంధభక్ష్యంబులను భక్తిపూర్వకంబుగ నివేదించినచో నక్షయ
ఫలంబు లభించును. ఇట్లు శ్రాద్ధసమయంబులందు శివయోగులను
సంతర్పితులం గావించువానిపితృగణంబులు సర్వపాపవిముక్తులై స్వర్గా
వాసు లగుదురు. భక్తిపూర్వకంబుగ నన్నపానీయవస్త్రాదులచే శివ
యోగుల నర్చించువానికి త్రిమూర్తుల నొక్కసారి పూజించినఫలము

కలుగును. శ్రాద్ధకాలంబున శివపూజ చేసి శివయోగులఁ బూజించు
వాని పితృదేవతలు సంతుష్టులై యానందతాండవంబులఁ గావించు
చుందురు.

భస్మలిప్తాంగుఁ డగుశివయోగి యింటిని సమీపించుటంగాంచి
యన్నాద్యోషధులన్నియును స్వర్గలాభంబు గలుగునని తలంచి యా
నందించుచుండును. కావున నట్టియతిథి యేతెంచినప్పుడు గృహస్థుఁడు
కృతాంజలిపుటుండై యెదురేఁగి యాతనిఁ దోడితెచ్చి యథాశక్తి
యన్నపానాదులచేఁ బరితృప్తు గావింపవలయును. ఆకృతిచేఁగాని, వస
నాదులచేఁగాని యెట్లున్నను నతిథిని గృహస్థుఁడు శివయోగిగా భావిం
పవలయును. శివుని, దేవతలను, వేదములను, యజ్ఞములను, ఆగమం
బులను ద్వేషించువా రధోముఖులు నూర్ధ్వపాదులునై నరకబాధ
లనుభవించుచుందురు. వారివదనంబులు క్రిమిదంశితంబులై యుండ
దారుణాకారులగు యమకింకరులచే వారు ప్రళయకాలంబువఱకును
ఘోరయాతనలం గాంచుచుందురు. సాధువులగుయోగులమీఁదలం
గల్పించు నపవాదంబుల నాలకించువారు ప్రళయంబువఱకును నరకప
తితులై యుందురు. వినువాఁ డున్నప్పుడే చెప్పువాఁ డుండును. చెప్పు
వాఁ డున్నను వినువాఁ డాతని వారింపవచ్చును. కావున దుర్వార్తల
విషయంబున వక్తకంటె శ్రోతయే యధికపాపి యగుచున్నాఁడు.
ఆతనికిఁ బాపానుభవముకూడ ద్విగుణితం బగుచున్నది. సాధునిందం
గూర్చి శ్రోతయు, వక్తయు, ననుమంతయుఁ, బ్రయోజకుండును,
సంసర్గియు నీయైదుగురుకూడ నరకగాము లగుదురు. అజ్ఞానపంకమ
గ్నులును, ఆత్మరక్షణంబున నసమర్థులును, పాపాక్రాంతులును, నిర్ధ
నులు నగువారపాత్రులు. పచ్చికుండలో జలముంచినట్లే యపాత్రం
బులయందు గావించినదానము పాత్రసహితంబుగ వినష్టంబై పోవును.

ఊషరక్షేత్రంబున బీజావాపనంబును, అపాత్రదానంబును నిష్ఫలం
బులు. జ్ఞానాగ్నివిహీనుం డగునపాత్రునియెడలఁ గావించినదానము
భస్మమునందలి హోమమువలె నిష్ప్రయోజన మగును. జ్ఞానహీనుం
డగువిప్రునిజన్మము నిరర్థకమైనది. ఇనుపపడవచే నదిని దాటింపఁ
బ్రయత్నించి జలనిమగ్నులై పోయినట్లు యపాత్రదానంబు గావించి
దాతయుఁ బ్రతిగ్రహీతయుఁగూడ నరకపతితు లగుదురు.

దయావశంబున సకలభూతంబులయెడలను గావించినదానము
సర్వకామదం బగుచున్నది. దరిద్రులు, అంధులు, దీనులు, అనా
థులు, బాలకులు, వృద్ధులు, కృశులు, ఆర్తులు నగువారికి నిత్యమును
దానము చేయవలయును. అట్టివారందఱు నర్థులగుటచే నిత్యదానం
బున కర్హు లగుచున్నారు. అట్లు గాక జ్ఞానులు పూజ్యులుగావున
పాత్రు లగుచున్నారు. వారు లోభముచే నేమియును గోరువారు
గారు. వారిని గొలఁదిగఁ బూజించినను, విశేషఫలంబుగలిగి జన్మము
సార్థకం బగును. సాధువులు కేవలము స్వార్థపరత్వముచేఁ బ్రతిగ్ర
హింపరు. దాతలయుపకారార్థమే వారు దానము నంగీకరించుచుం
దురు. సాధువులు దయాపరవశులై యతిప్రయత్నంబున దరిద్రులనే
యర్థించుచుందురు. దానమువలన వారికైశ్వర్యము లభింపఁజేయవల
యునని వారియుద్దేశము. ఇచ్చుటవలన నూర్ధ్వగతియుఁ, బుచ్చుకో
నుటవలన నధోగతియుఁ గలుగునుగావున దానమిప్పింపవలయు నని
కోరివచ్చినయర్థి దాత కుపకారియే యగుచున్నాఁడు. అర్థి యాచిం
చుదీనస్వరమునందే 'పూర్వజన్మమునం దెట్టిదానమును జేయకుండు
టచే నాకిట్టిగతి కలిగినది.' అనువిషయమును సూచిత మగుచుండును.
యాచకులగువాడు లోభియొద్దకుఁ బోయి 'నాకేమైనఁ బెట్టుము' అని
యడుగుట యాచనమాత్రమే గాదు. 'దానము చేయకున్నచో నావంటి

గతిచేత నీవును బట్టఁగలవు.' అని బోధించుటయే — ఈవిధముగా సాకారీభవించిన మంగళదేవతయై వచ్చిన యాచకు నెవ్వఁడు పూజింపకుండును? దానమును గ్రహించి దాతకు స్వర్గలాభముం గూర్చునట్టి యాచకునికంటెఁ బరమబంధుం డెవ్వఁ డుండును? అర్థి తనయంతనే యింటికి వచ్చి దాత కిహపరసుఖంబులఁ జేతి కందించుచుండును. అట్టి యాచకుని ద్రోసివైచు మూఢుఁ డుండునా? యాచకులు స్వయముగా వచ్చి యిష్టము లీకున్నను దాతలను శ్రీమంతులుగఁ జేయుచుందురు. దాత పూజ్యు లనుటకు శంక యేమున్నది?

దాన మిచ్చుటకై యెత్తిన చేయియే దాత యూర్ధ్వగతిని సూచించుచున్నది. యాచకునిహస్తము క్రిందను, దాతచేయి మీఁదను నిలిచి యిరువురితారతమ్యమును దెలియఁజేయుచుండును. దరిద్రుం డగు యాచకుం డెదుట నుండఁగా నింకను బాహ్యాంతరంబుల నతని నిరీక్షించువాఁడు ధర్మవ్యాపారము చేయువాఁడే యగును గాని దాత యెన్నఁటికిని గాఁజాలఁడు. యాచకులే లేకయున్నచో దాతల ధర్మమున కవకాశ మేమున్నది? అర్థి యుండుటవలననే దానమును, తత్ఫలంబును గలుగుచున్నవి. లుబ్ధులును, దరిద్రులును, అప్రియవాదులును లేకయేయున్నచో సాధువులదానదయాక్షమాదులకు స్థానమెక్కడ నున్నది? ఇంటి కేతెంచినయాచకునికి ధన మీయఁజాలకున్నను శుభప్రియవచనంబులచేనైన సన్మానింపఁగూడదా? అతిథికొఱకుఁ గావించినప్రత్యుత్థానము, అభిగమనము, స్వాగతప్రశ్నము, ఉత్తమాసనదానము, ప్రియవాక్యము, పాదోదకప్రదానము, అనుగమనము నను నీసప్తవిధకార్యంబులును స్వర్గసోపానస్వరూపము లగుచున్నవి. విత్తానుసారంబుగ దానబుద్ధి యెంతవారికి లభించును. ఇంటికి వచ్చినయాచకునికి లేదనకుండ నేమైన నిచ్చుటయే గృహస్థధర్మము.

యమునుం డెవ్వరికిని బంధుండు గాఁడు. దానముచేయనివారి నందఱ నాతఁడు నరకపతితులం గావింపక విడువఁడు. సహజదానశీలుం డగు వాఁడు స్వర్గవాసి యగును. ప్రియవచనవిరహితంబగుదానము నిష్ఫలమైనది. అక్షయఫలార్థి యగువాఁడు తనజీవితమునం దొకసారియైనను ప్రియవాక్సహితంబుగ దానము చేయవలయును. కటువచనంబులతో దానముచేయుటకంటెఁ బ్రియవచనంబులతో నేమరేని యేమియు నీయఁజాల నని చెప్పుటయే ప్రశస్తం బగుచున్నది. కటుకంబులు వలుకుచు నగౌరవంబుగ దానముచేయుట యుక్తము గాదు. అశ్రద్ధాదానము చేయుటకంటెఁ జేయకుండుటయే మేలు. దానము, ధ్యానము, వ్రతము, నియమము, యజ్ఞము, హోమము, తపమ్మనునివి యెంత శ్రద్ధగాఁ జేసినను గోపభావమాత్రంబున సర్వంబును నిష్ఫలంబులై పోవును. శ్రద్ధాపూర్వకంబుగ దాన మిచ్చుటవలనను, బు[illegible] వలనను దాతయు, నర్థియుఁగూడ స్వర్గసుఖంబుల ననుభవింపఁగలరు. అశ్రద్ధతోడి దానము నరకహేతు వగుచున్నది. ఔదార్య[illegible] గతి, మైత్రి, అనుకంప, అమాత్సర్యము ననుపంచగుణంబు[illegible] తకు మహాఫలజనకంబులు. కాశి, కురుక్షేత్రము, ప్ర[illegible], [illegible] రము, సముద్రతీరము, నైమిశారణ్యము, అమరకంటక[illegible] తము, గోకర్ణము, జ్ఞానపర్వతము మొదలగునవి [illegible] ములు దానాదులకు మహాఫలదాయకంబులై యు[illegible] శ్రమంబులును, నదులును, పర్వతంబులును, గోష్ఠ[illegible] నంబులును, తపోవనంబులును బుణ్యక్షేత్రము ల[illegible] యాదులయందల్పదానంబైనను మహాఫలంబు నొసఁగును. చంద్ర సూర్యగ్రహణములు, సంక్రాంతులు మొదలగుపర్వ[illegible]ంబులు గూడ దానములకుఁ బ్రశస్తంబులు. దేశకాలపాత్రానుసారంబుగ

భక్తితోఁ గావించు దానం బక్షయఫలదాయకం బగును. శ్రద్ధతోడి దానము పుణ్యమునకు మాతృస్వరూప మని చెప్పవచ్చును. కావున ననంతఫలకాముం డగువాఁడు శ్రద్ధతో దానము చేయవలయును. ఆర్తులును, దరిద్రులును, గుణాన్వితులునగు వారికిఁ జేసినదాన మల్పంబైనను మహాఫలదం బగుచున్నది.

## —♦ పాపభేదములు ♦—

మునిశేఖరులారా! పరదారచింతయు, పరద్రవ్యాభిలాషయు, పరాపకారబుద్ధియు, అకార్యాభినివేశంబు ననునీనాల్గును మానసికదోషములు, అసంబద్ధప్రలాపము, అసత్యవచనము, అప్రియభాషణము, పరోక్షపైశున్యము ననునీనాల్గును వాచికదోషములు. అభక్ష్యభక్షణము, హింస, మిథ్యాకార్యచేష్ట, పరధనాపహరణము ననునీనాల్గును గాయికదోషములు. ఈపండ్రెండువిధంబు లగుపాపకృత్యములును నరకహేతువు లగుచున్నవి.

మఱియు సంసారసాగరతారకుండగుమహాదేవుని ద్వేషించువారు మహాపాపు లగుచున్నారు. సర్వార్థసాధకుం డగుశివుని, శాస్త్రంబులను, జ్ఞానంబును నిందించువారు నరకపతితు లగుదురు. శివజ్ఞానోపదేశకులను, దపస్వులను, గురువులను, పితృదేవతలను నిందించువారు నరకజలధినిమగ్ను లయ్యెదరు. శివనిందయు, గురునిందయు, శివజ్ఞాననిందయు, శివద్రవ్యాపహరణంబును, ద్విజద్రవ్యనాశనంబును, శివధర్మపుస్తకాపహరణంబు ననునీయాఱును మహాపాతకంబులు. శివపూజ చేయుచుండఁగాఁ జూచియు నభినందింపకుండుటయు, పూజాసమయమున శివలింగమును దర్శించియు నమస్కారస్తవంబులఁ గావింపకుండుటయు, శివాగ్నిగురులయెడల వినయంబుఁ జూపకుండుటయు, పర్వం

బులయందు శివాలయమార్జనంబును, శివపూజయు, గురుపూజయుఁ గావింప కుండుటయు, శివాచారపరిత్యాగంబును, శివభక్తవిద్వేషంబును, శివజ్ఞానపూజాతిరిక్తంబు లగునధ్యయనలేఖనంబులును, అన్యాయముగుశివజ్ఞానదానమును, లోభవశంబున శివజ్ఞానవిక్రయంబును, కుజ్ఞానంబునకు శివజ్ఞానవినిమయంబును, అపరిశుద్ధస్థానంబున శివధర్మపుస్తకస్థాపనంబును, శివకథల నాక్షేపించి యితరకథల నాలాపించుటయు, సత్యభాషణాభావంబును, దానము చేయకుండుటయు, అపవిత్రస్థలంబున శాస్త్రపఠనశ్రవణంబులును, గురుని బూజింపకుండ శాస్త్రశ్రవణంబును, గురుశుశ్రూష చేయకుండుటయు, గురునాజ్ఞల యెడల నైముఖ్యంబును, గురుభక్తిహీనతయు, గురు నభినందింపకుండుటయు, గురువచనంబుల కుత్తరం బీయకుండుటయు, గురుకార్యంబులయందు శఠత్వంబును, వానియం దుపేక్షయు, ఆర్తులు, అశక్తులు, విదేశగతులు, శత్రువిజితులు నగువారిని ద్యజించుటయు, గురుభార్యాపుత్రులను బంధువులను దిరస్కరించుటయు, హితోపదేశకులు, ధర్మబోధకులు నగుగురుసమానులను సంభావింపకుండుటయు ననునీయకార్యములు శివనిందాసదృశంబు లగుమహాపాపము లగుచున్నవి. బ్రహ్మఘ్నుండును, సురాపాయియు, స్వర్ణాపహారియు, గురుతల్పగుండును, వీరితో సంసర్గంబు గలవాఁడును బంచమహాపాతకు లని యెఱుంగవలయును. బ్రాహ్మణుని వధింపకున్నను, క్రోధలోభభయద్వేషవశంబున బ్రాహ్మణునియెడల మహాపవాదంబును వ్యాపింపఁ జేయువాఁడు గూడ బ్రహ్మహత్యాపాతకుఁ డగును. బ్రాహ్మణున కిచ్చెద నని చెప్పి యీయనివాఁడును, నిర్దోషియగుభూసురునియందు దోషము నారోపించువాఁడును బ్రహ్మఘ్నసదృశుం డగును. ఊరక కూర్చుండి యున్నసద్బ్రాహ్మణుని విద్యాభిమానముచే సభలో నవ

నూహించువాఁడును, తన గౌరవంబునకై బ్రాహ్మణునియెడ లేనిదోష ము నాపాదించి యాతనిగుణంబులకు లోపముం గూర్చువాఁడును, స్మృతిశాస్త్రాప్తు లగుసజ్జనుల నింటనుండి వెడల నడచువాఁడును, పర హృదయమునకుఁ దాపకుండును, నిరంతరపరదోషాన్వేషణాసక్తుం డగుక్రూ రుండును, పిపాసార్తు లగుగోగణబ్రాహ్మణాదులకును, నితరజీవులకును జలపానసమయంబున విఘ్నము నాపాదించువాఁడును, దేవద్విజగోద త్తంబు లగుక్షేత్రంబులు కాలాంతరంబున విశృంఖలంబు లగుటచే నదను వేచి వాని నపహరించువాఁడును, ధర్మదత్తంబు లగుదేవద్విజ ధనంబు లపహరించువాఁడును, ఇట్టిపాపాత్ము లందఱును బ్రహ్మఘ్న సదృశు లగుచున్నారు, శివవ్రతంబును, వేదాధ్యయనంబును గావిం చుచుండి పరిత్యజించుబ్రాహ్మణునకు సురాపానసదృశం బగుపాపము ఘటిల్లుచున్నది. పవిత్రనియమంబు లయినను బరిత్యజించువారును, సాధుపుణ్యంబులఁ ద్యజించువారును సురాపానదోషు లగుదురు. తల్లి దండ్రులను బరిత్యజించుట, కూటసాక్ష్యము చెప్పుట, అసత్యమాడు ట, శివభక్తుల కప్రియంబు చేయుట, అభక్ష్యభక్షణము, నిరపరాధుల నిర్జనారణ్యంబున వధించుట, గోమార్గములను, వనంబులను, గ్రామం బులను దహించుట యను నీఘోరపాతకంబులు బ్రహ్మహత్యా సమంబులు.

దరిద్రునిసర్వస్వము నపహరించుటయు, పురుషులు, స్త్రీలు, ఏనుఁగులు, గుఱ్ఱములు, గోవులు, భూములు, రజతము, వస్త్రములు, ఓషధులు, రసములు, చందనాగురుకర్పూరాదిసుగంధద్రవ్యములు మొదలగువాని నపహరించుటయు, దాపుడుధనంబును హరించుటయు స్వర్ణస్తేయసదృశంబు లగుదోషములు. వివాహయోగ్య యగుతన యను దగినవరున కీయకుండుట, పుత్రభార్య, మిత్రభార్య, భగిని,

వీరిని పభోగించుట, కుమారిని బలాత్కరించుట, అంత్యజతో సంభో
గించుట, పరస్త్రీగమనంబును గుర్వంగనాగమనతుల్యంబులగు మహా
పాపములు.

దాన మిచ్చెద నని యీయనిదాతయు, దానమునూట దాత
కు స్మృతి గలిగింపనియర్థియు నుపపాతకు లగుదురు. ద్విజద్రవ్యాప
హరణంబును, మర్యాదాలంఘనంబును, దురభిమానంబును, అతికో
పంబును, దాంభికత్వంబును, కృతఘ్నతయు, అతివిషయాసక్తియు,
కార్పణ్యంబును, శౌర్యంబును, మాత్సర్యంబును, పరదారగమనం
బును, సాధుకన్యాదూషణంబును, తమ్మునికి ముందు పెండ్లి చేసిన
యన్నకును, అన్నకంటెముందుగఁబెండ్లియాడుతమ్మునకునుగన్యాదాన
ము చేయుటయు, ఆయిరువురకును యాజనంబు జేయుటయు ధనాభావాదు
లవలనఁ బుత్రమిత్రకళత్రంబులను,స్వామిసాధుబంధుతపస్వులను,నిత్య
నైమిత్తికకర్మంబులనుబరిత్యజించుటయు, గోవధయు, క్షత్రియ వైశ్య
స్త్రీశూద్రవధయు, శివాలయవృక్షోన్మూలనంబును, పుష్పోద్యాననాశ
నంబును,ఆశ్రమవాసులను,భృత్యులను,పరివారజనములను, పశుపక్ష్యాదు
లను,బీడించుటయు,పశుధాన్యాదులనపహరించుటయు, అపాత్రపతనం
బును,యజ్ఞోద్యానతటాకాదులను,భార్యాపుత్రాదులను,తీర్థయాత్రోప
వాసవ్రతాదులను, శివమందిరంబులను విక్రయించుటయు, స్త్రీధనో
పజీవనంబును, స్త్రీలంపటత్వంబును, మదిరాపానపరవశయగుయువతి
తోడి సమాగమంబును, కాలాగతుం డగునతిథి నర్చింపకుండుటయు,
ధాన్యవృద్ధివలన జీవించుటయు, నిందితధనగ్రహణంబును, కూటవి
క్రయంబును, ఉచ్చాటనంబును, అభిచారంబును, వృత్తిచ్ఛేదనంబును
వైద్యంబు సేయుటయు, వేతనముం గొని యధ్యయనంబు చేయించు
టయు, ఉపనయనాదిసంస్కారములు లేకుండుటయు, బ్రహ్మచర్య

ష్ఠును ద్యజించుటయు, అనాచారముల నవలంబించుటయు, అశా స్త్రంబుల నంగీకరించుటయు, కువాదంబు సేయుటయు, దేవాగ్నిగురు సాధువులను, గోబ్రాహ్మణప్రభువులను బ్రత్యక్షముగనైనను, బరో క్షముననైనను నిందించుటయు, దేవపితృయజ్ఞత్యాగంబును, స్వకర్మం బుల విడుచుటయు, దుశ్శీలతయు, నాస్తిక్యమును, సతతాసత్యభాష ణంబును, పర్వంబులను, పగటికాలములందును, అస్థానంబులందును స్త్రీసంభోగము చేయుట, పశురజస్వలాగమనంబులును, స్త్రీపుత్రి మిత్రపంప్రాప్తిసమయంబుల నాశాభంగము చేయుటయు, అప్రియ భాషణంబును, క్రూరత్వంబును, శపథభంగంబును, కూపతటాకసం క్రమాదులను భంజించుటయు, పంక్తిభేదంబును నీమొదలుగాఁగలవి యుపపాతకంబులని చెప్పంబడుచున్నవి.

గోవులు, బ్రాహ్మణులు, కన్యలు, ప్రభువులు, మిత్రులు, తప స్వులు మొదలగువారికార్యంబులకు విఘ్నంబులు చేయువారు నరక పతితు లగుదురు. పరులభాగ్యముం జూచి పరితపించుటయు, పరద్రి వ్యముంగూర్చి కొండెములు చెప్పుటయు, పరధనహరణంబును, గొప్ప తనము సంపాదించుటకై మిథ్యాప్రవర్తనంబును, ద్విజదుఃఖోత్పాద నంబును, ద్విజునిశూద్రిసేవయు, కోరికచే మద్యము నాఘ్రాణించు టయు, పాపాసక్తియు, హింసాప్రియత్వమును, గోష్ఠాగ్నిజలరథ్యాదు లందును, పర్వతోద్యానదేవాలయాశ్రమప్రాసాదాదులయందును మల మూత్రంబులు విసర్జించుటయు, కపటసర్పక్రీడనంబును, పరచ్ఛిద్రాన్వే షణంబును, పంకశిలాకాష్ఠకంటకాదులచే మార్గనిరోధంబును, పర సీమాపహరణంబును, కూటశాసననిర్మాణంబును, కూటకర్మంబును, కూటయుద్ధంబును, కూటవాణిజ్యంబును, శస్త్రాదినిర్మాణంబును, భృత్యులయెడల దయలేకుండుటయు, పశుపీడనంబును, మిథ్యావాద

శ్రీవణంబును, ప్రభుమిత్రగురుద్రోహపరత్వంబును, మాయామయ
త్వంబును, చాపల్యంబును, క్షుధార్తులగు పుత్రమిత్రకళత్రబంధుబాల
కవృద్ధాములను, పరివారజనంబులను విడిచి తానొక్కఁడును భుజించు
టయు నాదిగాగలపాపంబులఁ గావించువారు నిందితు లగుచున్నారు.

ఇంద్రియనిగ్రహము లేకుండుట, నియమములను బహిత్యజిం
చుట, సన్న్యాసి యయ్యును మరల గృహస్థాశ్రమమును స్వీకరించుట
రహస్యభేదనంబు చేయుట, గోవులను బాధించుట, వానిని తిరస్కరిం
చుట, చిక్కినపశువును పోషింపకుండుట, అతిభారంబు వైచి పశువు
లను పీడించుట, అరజాముకంటెను, జాముకంటెను, నధికంబుగఁ
బశువులచేఁ బని చేయించుట, రోగాదులచే నవసియున్నపశువులకుప
చారంబులు చేయకుండుట మొదలగుపాపములు గోఘ్నతుల్యంబు
లగును. వృషభంబులయండములను ఛేదించుట, గొడ్డుగోవులచే
బరువు మోయించుట, ఆశపడియింటికి కేతెంచిన క్షుత్పిపాసాతురు
లగుననాథులను, వికలాంగులను, దరిద్రులను, బాలకులను, వృద్ధు
లను, కృశులను, ఆర్తులను దయతో నాదరింపకుండుట యనునిట్టిపా
పంబులు చేసినవారు నరకగాము లగుదురు. మృతుం డగువానిధనం
బంతయు నింటియందే యుండును. బంధువు లాతనితో శ్మశానము
వఱకుమాత్రమే వచ్చి వెనుకకు మరలుదురు. చేసినసుకృతదుష్కృత
ములుమాత్రమే యాతని ననుసరించి యుండును.

ఛాగజీవులును, మహిషజీవులును, సముద్రయానంబుచే వాణి
జ్యంబు చేయువారును, శూద్రస్త్రీసంగతులు నగుబ్రాహ్మణులు నర
కమగ్నులు లగుదురు. శిల్పచిత్రలేఖనవైద్యహేమకారవృత్తులవలనజీవిం
చువారును, రాజచిహ్నధారులును, వేతనగ్రాహులును, కూటకా
రులు నగుబ్రాహ్మణులు నరకగాము లగుదురు. శాస్త్రోక్తంబగున

న్నీకంటె నధికంబుగ విధించునట్టియు, నతిక్రూరంబుగ దండించున ట్టియు రాజు నరకపతితుం డగును. ఆతనిప్రజలు లంచగొండులచే తను, బలవంతముగఁ గ్రయవిక్రయంబులు చేయు ధనికులచేతను, దస్యులచేతను బీడితులగుచుందురు. అన్యాయపరుం డగురాజు ధనంబును బ్రతిగ్రహించుబ్రాహ్మణునకు ఘోరనరకప్రాప్తి యగును. అధర్మముగఁ బ్రజలకడనుండి ధనమును గ్రహించి దానంబులు గావిం చుప్రభుండును నృగమహారాజుంబోలి నరకక్లేశంబు ననుభవించును. ప్రజారక్షణవిషయంబునఁ బరాఙ్ముఖుం డగురాజు పరదారరతులును, చోరులును, క్రోధాంధులును జేయుపాపంబునఁ బడిపోవును. అదం డ్యుల దండించినను, దండ్యుల దండింపక విడిచినను రాజు నరకంబు నందును.

ఘృతము, తైలము, అన్నము, పానీయము, మధువు, మాం సము, సుర, ఆసవము, గుడము, ఇక్షువు, శర్కర, దధి, మూలఫల, తృణకాష్ఠాదులు, పత్రపుష్పాదులు, ఓషధులు, వాసభాజనచర్మపాదు కాచ్ఛత్రశకటాసనాదులు, కమండలువు, సీసము, తగరము, ఇత్తడి, రాగి, శంఖాదిజలజవస్తువులు, వాద్యవస్తువులు, గృహోపకరణములు, వివిధంబులగువస్త్రములు మొదలగువాని నపహరించువారు ఘోరన రకయాతనలం గాంతురు. ఆవగింజంతయైనను బరద్రవ్యమును హరిం చువారికి నిరయబాధ తప్పదు. ఇట్టిపాపములంగావించు మానవులు మరణానంతరంబున యాతనాశరీరంబు దాల్చి యమలోకంబును జేరి యందు వికృతాకారు లగుయమదూతలచే వివిధంబులగు దారుణ యాతనల ననుభవించుచుందురు. యముఁడు పాపనిరతు లగుదేవతి ర్యఙ్మానవజాతు లన్నింటికిని శాసనకర్తయై యున్నాఁడు. అతఁ డనేక విధంబులగు ఘోరశిక్షలచేఁ బాపులను దండించుచుండును. నియమ

వంతులగుమహాత్ములు ప్రమాదంబువలనఁ బాపంబు చేసినచోఁ బ్రాయశ్చిత్తంబు చేసికొనవలయును. అందువలనఁ బాపంబు శాంతింపఁగలదు. అట్టివారియెడల యమునియధికారము చెల్లదు. బహిరంగంబుగఁ బాపంబులు గావించువారికి రాజును, బ్రచ్ఛన్నంబుగఁ జేయువారికి యముండును శిక్షకులగుచుందురు. ఎట్లయినను బాపమునకు శిక్ష తప్పనది కాదు గావునఁ బాపము చేయువారు తప్పక ప్రాయశ్చిత్తము చేసికొని యెన్నఁడును బాపము సేయకుండవలయును. ఎన్ని కల్పంబులకైనను, దగినయనుభవంబు గాకుండఁ బాపము నశింపదు. మనోవాక్కాయంబులచేఁ బాపంబులు చేయువారును, పాపంబుల నుపయోగపడువారును, పాపంబుల నాపాదించువారును తప్పక పాపగతు లగుదురు.

## —♦ యమపురవర్ణనము ♦—

సర్వజీవులయందును స్త్రీపున్నపుంసకభేదంబులు గల గర్భస్థులును, శిశువులును, బాలురును, తరుణులును, మధ్యములును, వృద్ధులునుగాఁ జతుర్విధంబు లగుపాపంబులచే నతిభయంకరంబును, ఘోరంబు నగుయమాలయంబునం బ్రవేశించి, శిక్షల ననుభవించుచుందురు. అచ్చట సకలజీవులను చిత్రగుప్తాదులును, వసిష్ఠాదిమహార్షులును పాపపుణ్యవిచారము చేయుచుందురు. యమపురంబును జేరనిప్రాణి యెద్దియును లేదు. ఎట్టికర్మంబున కట్టిఫలం బనుభవనీయంబగును. సుకృతాత్ము లగువారు శుభమార్గంబున యమమందిరంబునకుఁ బూర్వదిక్కుగాఁ బోయెదరు. పాపాత్ములు ఘోరంబగు దక్షిణమార్గమునుండి యెనుబదినాలుగువేలయోజనంబు లతిక్రమించి యమాలయంబు చేరుదురు. పుణ్యాత్ములపోకడ యమాలయం బంత

దూరము గాదు. పాపాత్ముల కమార్గము తీవ్రకంటకయుతంబును, కర్దమపంకిలంబును, తీక్ష్ణాగ్రశిలాఖండమయంబును, భయంకరంబును దుస్తరంబును, పతనస్థానబహుళంబును, సూచీముఖదర్భచ్ఛన్నంబును, తరుపర్వతసంకీర్ణంబును, ప్రతప్తాంగారసంపూర్ణంబును, దుఃఖమయంబును నై యుండును. ఒక్కొక్కమార్గము విషమగర్తసమన్వితంబును సంతప్తవాలుకామయంబును నై యుండును. ఇంకొకత్రోవ విశాలశాఖాయుతం బగువేణువనంబుచే నంధకారబంధురమై భయమునగొల్పుచుండును. ఇట్టిమార్గమున నెట్టియవలంబనంబు నుండదు. మఱియొక్కదారి యనుపమేకులతో నిండియుండును. ఒక్కచోట దావాగ్నులును, నొకచోఁ దప్తశిలలును, మఱియొకచో మంచుగడ్డలును, వేఱొక్కచోఁ గంఠదఘ్నం బగువాలుకారాసులును, నింకొక్కచో దుర్గంధభూయిష్ఠజలంబులును, నొకచో సింహవ్యాఘ్రాదిక్రూరమృగంబులును, మఱియొకచోట పెద్దపెద్దజలగలును, వేఱొకచోట నజగరంబులును, నొక్కొక్కచోట సర్పవృశ్చికాదివిషజంతువులును, నింకొక్కచో మదమాతంగంబులు, నొక్కచోఁ దీవ్రదంష్ట్రకలితంబులగువరాహంబులును, వేఱొక్కచో కఠినశృంగంబు లగుమహిషంబులును, బ్రమత్తంబు లగునుష్ట్రంబులును నిండియుండును. కొన్నియెడల రౌద్రప్రకృతులగు డాకినులును, కరాళవదను లగురాక్షసులును, నతిఘోరంబు లగువ్యాధులును బీడించుచుండ నడుగవలసియుందురు. కొన్నియెడలఁ బ్రచండవాయువులను, పాషాణవర్షంబును సహింపవలసియుందురు. కొన్నిపట్టుల వజ్రాఘాతంబులచే పలుదెసల నుండియు వెలువడు దారుణబాణవర్షమునం బడి యుల్కాపాతాదికంబగు నంగారవర్షంబున దహ్యమాను లగుచు నేడ్చుచుండవలయును. ఒక్కొక్కచో మహామేఘారవంబులచే శరీరము విస్రస్తం బగును.

అతినిశితంబు లగుఘోరాయుధంబులశస్త్రముచే దేహము విభిన్నమై
పోవును. ఆసమయంబున బాపాత్ములు ఘోరవారిధారలచే సిక్తశే
ఖరంబులతో నతిదుఃఖితు లగుచుందురు. ఒక్కొకచో శీతలపవనాహార
ణంబులచే విశుష్కశరీరులై యనేకవిధంబుల రోదనము చేయుచుం
దురు.

ఈవిధముగా భయంకరయమకింకరులు పాపాత్ము లగుజీవులను
భీకరంబును, పాథేయరహితంబును, నిరాధారంబును, దుర్గమంబును,
శుష్కంబును, నంధకారమయంబును సర్వదుఃఖాకరంబును నగుమార్గ
ముననుండి కొనిపోవుచుందురు. మహాబలవంతు లగు యమదూతలు
ఏకాకులు, పరాధీనులు, సుహృద్బాంధవవిహీనులును నగు పాపాత్ముల
నాకర్షించి యనేకవిధంబుల బాధపెట్టుచుందురు. అప్పు డాజీవులు
తమదుష్కృతంబుల దలంచుకొని మాటిమాటికి నేడ్చుచుందురు.
వారి కంఠోష్ఠతాలువులు శుష్కంబులై పోవును. వారియుదరములు
క్షుధాగ్నిచే దగ్ధంబగుచుండును. యమదూతలుకొందఱిని శృంఖలం
బులచే బాదంబుల బంధించియు, గొందఱ నధోముఖంబుచేసి వృక్షం
బులపై గ్రుద్దియు, గొందఱి కేశపాశంబుల దాళ్ళచే గట్టియు,
గొందఱ ముసలశాఘాతంబులచే విభిన్నలలాటులం గావించియు,
గొందఱిని కంటకాంగారమార్గంబుల నడపించియు, గొందఱిని జేతు
లవిఱిచికట్టి జఠరదేశంబుల బీడించియు, గొందఱిసర్వాంగంబు
లును శృంఖలంబులచే బంధించియు, గొందఱి హస్తద్వయంబును
శంకులంబులచే వేధించియు, గొందఱికంఠంబుల కుఱిపెట్టియు గొందఱి
నతికష్టంబున నడపించియు, గొందఱిజిహ్వలయం దంకుశంబుల గ్రు
చ్చియు, గొందఱినాసికంబుల బొడిచి త్రాళ్ళు గ్రుచ్చి లాగియు,
గొందఱికిపాలోష్ఠంబుల ఛేదించియు, గొందఱియుదరంబుల వ్రక్కలు

నేసియు, కొందఱు చెవులనులిమియు, కొందఱియంగసంధుల విచ్ఛి
న్నంబులు గావించియు, మహాసాయకంబులచే గొందఱిని భేదించి
యు నాకర్షించి తీసికొనిపోవుచుందురు. జీవు లిట్లు బాధితులై యెం
దును దిక్కుగానక యేడ్చుచు బరిభ్రమించుచుందురు. మఱియు
గఠినాయుధాఘాతంబులచే బూయశోణితంబులం గ్రక్కుకొనుచు
గ్రిమికీటకాదులచే బీడితులగుచు దుర్గమం బగుమార్గంబు నను
గమించుచుందురు. వారు క్షుత్పిపాసాతురులై యన్నజలంబులను,
ఘర్మసిక్తశరీరులై ఛాయలను శీతభీతులై యనలంబును వాంఛించు
చుందురు. ఈవిధముగా దానపరాఙ్ముఖులగుదురాత్ములు దుఃఖంబు
లనుభవించుచు యమమందిరమునకు గొనిపోబడుదురు. దానంబు
లుగావించువారు పాథేయంబు లభించుటచే సుఖంబుగ బ్రయాణం
బు చేయుదురు.

ఇట్లు సుఖదుఃఖానుభవంబులు గలజీవులను యమకింకరులు
యమసన్ముఖంబునకు గొనిపోవుదురు. అందు పుణ్యాత్ములను ధర్మ
రాజు ఆసనార్ఘ్యపాద్యాదులచే సన్మానించి స్వాగతం బడిగి ప్రియవ
చనంబులతో ‘‘ఓమహాత్ములారా! దివ్యసుఖార్థులై సుకృతంబులు
గావించినమీరు ధన్యులు. మీరు దివ్యరమణీభోగభూషితం బగునీ
విమానము నధిరోహించి సర్వకామసమన్వితంబును, విమలంబు నగు
స్వర్గంబునకు విచ్చేయుడు. అచ్చట సుఖభోగంబు లనుభవించి
యనంతరము మీ రేదియైన నల్పంబుగ దుష్కృతంబు చేసియున్నచో
నిచ్చటికి మరల వచ్చి దానిఫలంబు ననుభవింపవచ్చును.'' అని యా
దేశించును. ధర్మాత్ములకు యముండు సౌమ్యదర్శనుం డగును. పాపా
త్ములకు మాత్ర మాతడు దంష్ట్రాకరాళవదనుండును, కుటిలభ్రుకు
టియు, రక్తనయనుండును, ఊర్ధ్వకేశుండును, ఊర్ధ్వనిస్ఫురితాధరుం

డును, అష్టాదశభుజుండును, క్రూరుండును, నీలాంజననిభ శరీరుండును, వివిధాయుధ హస్తుండును, సర్పదండసమన్వితుండును, మహామహిషారూఢుండును, దీప్తాగ్నిసదృశలోచనుండును, రక్తమాల్యాంబరధరుండును, మహామేరుసమోన్నతుండును, ప్రళయాంబుదనిర్ఘోషుండును నై సముద్రమును పానముచేయువానివలె, పర్వతములను గ్రసించువానివలెం నిప్పులు గ్రక్కుచున్నవానివలె నతిభయంకరుండై కానవచ్చుచుండును. అతనిచెంత కాలానలతుల్యం బగుమృత్యువును, నీలాంజనసన్నిభుండగు కాలుండును, అతిదారుణం బగుకాళరాత్రియు, భయంకరంబులగునానావ్యాధులును, శక్తిశూలాంకుశాదివివిధాయుధధారులును, క్రూరప్రకృతులును, పర్వతాకారులును, మహావీరులు నగునసంఖ్యకింకరులును బరివేష్టించి యుందురు.

పరివారయుతుం డగుప్రేతనాథుని, భీకరాకారుం డగు చిత్రగుప్తుని దర్శించి పరద్రవ్యాపహారులు, రూపయౌవనగర్వితులు, పరస్త్రీలంపటులు నగుపాపాత్ములు భయకంపితు లగుచుందురు. అప్డు వారింగూర్చి ధర్మరాజు తిరస్కరించుచు «మీకర్మములకుం దగిన ఫలములను మీరు గాక మఱియెవ్వ రనుభవింతురు? నరకబాధలం గల్పించుదుష్కృతములను మీరేల చేయవలయును? ఇప్పుడు పరితపించుటవలన నేమిలాభము? అనుభవింపుండు." అని మందలించును. ఇట్లే బలగర్వితులును పాపాత్ములు నగురాజులను గాంచి యముండు పరిభవసూచకంబుగా «దురాచారులును, ప్రజావిధ్వంసకారులు నగురాజులారా! అస్థిరం బగురాజ్యాధికారమువలన మదించి మీరేల దుష్కృతంబు లాచరించితిరి? భోగపరాయణులై ప్రజలను బలవంతముగ నేల దండించితిరి? మీపాపములకుం దగినశిక్షల ననుభవింపుండు! మీయధికారగౌరవంబుకొఱకును, మీపుత్రమిత్రకళత్రా

దుఃసుఖంబులకును మీరన్యాయముగఁ బ్రవర్తించితిరి. ఆరాజ్య
మును, ఆపరివారమును నిప్పు డెక్కడ నున్నవి? ఏపరివారబలంబు
వలన మీరు ప్రజాపీడనంబు గావించితిరో యాపరివార మంతయు మి
మ్ముఁ ద్యజించినదై చనెది. ఇప్పుడు మీరేకాకులై నిస్సహాయులై యమ
కింకరులచె బంధితులై నరకంబును జేరి యున్నారు. ఇట మీపాప
ఫలంబుల ననుభవింపకుండ నెట్లు తప్పించుకొనఁగలరు?" అని నిందిం
చెను. అప్పుడు రాజు లందఱును దముచేసినదుష్కృతంబులకుఁ బశ్చా
త్తప్తు లగుచు నేమియుం జేయఁజాలక వగచుచుందురు. యమకింక
రులు వారిని బాదంబులువట్టుకొని బలవంతముగ గిరగిర ద్రిప్పిత్రిప్పి
యాకసమున కెగురవైచి క్రిందికిఁ జదించి పట్టుకొని తప్తశిలాతలం
బులఁ బతితులం గావింతురు. అయ్యాఘాతంబులచే వారు జర్జరీకృత
సర్వాంగులై రక్తధారలచేఁ దడిసి నిశ్చేష్టులై పడియుండి వాయుస్పర్శం
బువలనఁ గ్రమ్మఱ సచేతనులై నిరయంబునఁ ద్రోయఁబడి పాపఫలం
బుల ననుభవించుచుందురు.

భూమి కధోభాగంబున సప్తమతలంబున నొకదానిక్రింద నొక
టిగ ఘోరాంధకారమయంబు లగునిరువదియెనిమిదికోట్లనరకంబులు
గలవు. ఘోర, సుఘోర, అతిఘోర, మహాఘోర, ఘోరరూప,
తలాతల, భయానక, కాళరాత్రి, భయోత్కట, చండ, మహాచండ,
చండకోలాహల, ప్రచండతిరనాయక, పద్మ, పద్మావతి, అభీష్ట,
భీమ, భీమప్రణాయక, కరాళ, వికరాళ, వజ్ర, త్రికోణ, పంచకోణ,
సుదీర్ఘ, పరివర్తుల, సప్తభౌమ, అష్టభౌమ, దీప్త, మాయ, యనెడి
యిరువదియెనిమిదినామంబులచే నిరువదియెనిమిదికోట్లును వ్యవహృ
తంబు లగుచుండును. మఱియు నీయిరువదియెనిమిదికోట్లలో నొక్కొ
క్కకోటియం దైదేసిచొప్పున యాతనాస్థానంబులు గలవు.

అందు ఘోర యమకోటియందు రౌరవము, మహారౌరవము, తమము, శీతము, ఉష్ణము ననుపంచస్థానంబులు గలవు. ఇట్లే సుఘోరాదికోటులయందు మహాతీక్ష్ణము, పద్మసంజీవనము, శివము, మహాతమవిలోపము, సులోమము, కంటకము, తీవ్రవేగము, కరాళము, వికరాళము, ప్రకంపనము, మహావక్రము, వక్రము, కాలము, ప్రగర్జనము, సూచీముఖము, సునేమి, ఖాదకము, సుప్రపీడనము, కుంభీపాకము, సుపాకము, క్రకచము, అంగారరాశి, భవనము, మేదోసృక్ప్రహితము, సుదీక్ష్ణము, కూటశాల్మలి, ప్రదీప్తము, మహానాదము, ప్రవాహము, సుప్రవాహనము, మేఘము, వృషము, శల్యము, సింహముఖము, వ్యాఘ్రముఖము, గజముఖము, కుక్కురాననము, సూకరాననము, అజాననము, మహిషాననము, వృకాననము, గ్రాహాస్యము, మీనాస్యము, సర్పాస్యము, కూర్మాస్యము, వాయసాస్యము, మండూకాస్యము, పూతివక్త్రము, రజతము, పూతిమృత్తిక, కణధూమము, అగ్నిక్రిమినిచయము, అగ్నిఘూసము, ప్రతిష్ఠ, రుధిరాంభము, శ్వభోజనము, లాలాభక్షణము, ఆత్మభక్షణము, సర్వభక్షణము, సుదారుణము, సంకటము, సువిశాలము, వికటము కటపూతనము, అంబరీషము, కటాహము, వైతరణి, తప్తలోహశయనము, ఏకపాదము, ప్రపూరణము, అసితాళవనము, అస్థిభంగము, సుపూరణము, తిలయంత్రము, అతసీయంత్రము, కూటపాశము, ప్రమర్దనము, మహాచూర్ణము, సుచూర్ణము, తప్తలోహపర్వతము, అంబుధార, యమళపర్వతము, మూత్రవిష్ఠాశుక్రపము, తారకతాపము, శీతలము, ముసలోలూఖలము, శిలాశకటము, లాంగలము, తాలపత్రము, గహనము మహాశకటమండపము, సమ్మోహము, అస్థిభంగము, మలయము, గుడము, బహుదుఃఖము, మహాదుఃఖము, కశ్మలము, మలము, హా

లాహాలము, విరూపము, స్వరూపము, యమానుగము, ఏకపాదము, త్రిపాదము, తీవ్రము, అవీచి మొదలుగాఁగల యాతనాస్థానంబులుగలవు.

పాపాత్ములీ నరకంబులయందు బాధలుపడుచు నరకానలంబున వేగిపోవుచుందురు. లోహంబులు పరిశుద్ధంబులగుటకు అనలప్రతప్తంబులు గావలసినట్లే జీవులు పాపవిముక్తు లగుటకు నరకానలంబున విశుద్ధులు గావలయును. పాపజీవులను తప్తశృంఖలంబులచే బంధించి యమకింకరులు మహావృక్షశాఖలయందు వ్రేలఁగట్టి యూచుచుందురు. ఆవేగంబునకు వారు యోజనంబులకొలఁదిదూరంబునఁ బడిపోయి నిశ్చేతను లగుచుందురు. మఱియు వారిపాదంబులకు నూఱుబారువల యినుపదిమ్మలను గట్టినడపింతురు. జీవులాభారముతో నడవఁజాలక దెబ్బలఁదినుచు గట్టిగ నేడ్చుటకైన నవకాశము లేక తమదుష్కృతంబులఁ దలంచుకొని పరితపించుచుందురు. మఱియు ఘోరాకారులగు యమదూతలు నలుదెసలను నిలిచి బాగుగ గాలినయంకుశములు, లోహదండములు, కంటకములు మొదలగువానితోఁ బొడుచుచు గాయంబులయందు వేగినయుప్పుగుండను జల్లుచుందురు. కొందఱిని సకలాంగకములను జీల్చి యుప్పు చల్లి లోహకటాహమునందుఁ బడవైచి సీదువంగకాయలంబోలి వేచుచుందురు. కొందఱిని అమేధ్యకూపంబులందును, క్రిమికూపంబులందును, మేదోరక్తపూయపూర్ణంబులగు దొనవులయందును, బడఁద్రోయుదురు. అందు తీవ్రవిషంబులు గలక్రిములును, లోహతుండంబులుగలకాకులును, భయంకరంబులగుకుక్కలును, తోడేళ్ళును, పులులును వారిని భక్షించుచుండును.

కొందఱిని కటుకునారసంబులకు గ్రుచ్చి చేఁపలముంబోలెఁ దీవ్రాగ్నిజ్వాలలయందుఁ బచనము చేయుచుందురు. పరనిందకు లగు

పాపాత్ములను తైలయంత్రంబులఁ బడవైచి సకలాంగకంబులను బిప్పిపిప్పిగాఁ జేసి తప్తలోహ భాండంబులఁ బడవైచి వండుచుందురు. అసత్యవాదులను జెట్లకు విఱిచికట్టి కాల్చినసూదులతో నాలుకలను జీల్చుచుందురు. వారినాలుకలను సాగఁదీసి సూదులతోఁ బొడుచుచుందురు. తల్లిదండ్రులను గురువులను నిందించువారినోటినిండ వజ్రముఖంబులగు జలగలను బడవైచి కఱపించుచు, ఆగాయములందు లవణంబు చల్లుచు, కరఁగించిన ధాతువు మొగంబునఁ జల్లుచు ననేక విధములఁ బ్రహరించుచుందురు. కొందఱు పాపాత్ములను క్రిమిసంకులంబులును, ప్రతప్తంబులు నగు లోహశాల్మలీవృక్షంబుల నాలింగనము చేయింతురు. లోహముద్గరంబులతో మోదుదురు. కఱకుఱంపములతో దలమొదలు పాదములవఱకును గోయుదురు. తమపొట్టకు మాత్రమే పోషించుచు దీనుల కొక్కమెతుకైనను బెట్టియెఱుంగని పాపాత్ములు స్వమాంసభోజనమును, స్వరక్తపానమును గావించుచు నరకబాధ లనుభవింతురు. వారు చెఱకుగానుఁగలలోఁ బీడితు లగుదురు. అసిపత్రవనంబునఁ బడి సర్వాంగములును గాయము లగుచుండ దుస్సహబాధ లనుభవింతురు. మఱియు నట్టివారు శూలారోపితు లగుదురు. స్వస్థశరీరమువలెఁ బాపాత్ములయాతనాశరీరము లెట్టి బాధలం బడుచున్నను మృతి నొందకుండును.

దండధరకింకరులు కొందఱు పాపాత్ములకండలను గోసివైచి యెముకలను జితుకఁగొట్టి నిరుచ్ఛ్వాసం బనునరకంబునఁ బడఁద్రోయుదురు. అచ్చట జీవులు ఊపిరి యాడక బాధపడుచుఁ దరువాత వాలుకావదనంబనునరకంబునకుఁ ద్రోయఁబడి నిట్టూర్పులు విడుచుచుందురు.

రౌరవనరకంబున రోదనము చేయుచు వివిధంబు లగు బాధల

ననుభవింపవలయును. మహారౌరవంబున సకలావయవంబులను దప్తలోహదండంబులచేఁ జితుకఁగొట్టి కాలినయినుకలోఁ బొఱవైచుచుందురు. పరదారరతు లగునరాధములచే నెఱ్ఱగఁ గాలినయినుపబొమ్మలను గౌఁగిలింపఁజేయుదురు. ఆసమయంబున యమకింకరులు వారిం గాంచి "ఏమి యెట్లు పాఱిపోయెదరు? ఎట్లును మీ కిది తప్పదు. మీ చేసినతప్పున కిదియే తగినశిక్ష" అని పరిహసించుచు మూఁతలువైచిన యినుపబానలలో వారిని బడవైచి మంటలువెట్టి యుడికింతురు. మఱియు రోళ్లలో వైచి లోహదండములచే దంచుచు నంధకూపంబునఁ బడవేయుదురు. భ్రమరంబులచేఁ గఱిపింతురు. క్రిమినిర్భిన్నాంగులగువారిని ఘోరకూపంబులయందు ద్రోయుదురు. మహాజ్వాలానరకంబునఁ బాపాత్ములు తీవ్రాగ్నిజ్వాలలచేఁ బరితప్తులగుచు నొక్కచో నిలువఁజాలక యేడ్చుచుఁ బరుగులెత్తుచుందురు. అచ్చటఁ బాపాత్ములను బాపరజ్జువులచే ముడికట్టలవలెఁ గట్టి లోహమయంబులగు భ్రమరంబులచేఁ గఱపింతురు. క్రోధాంధులును, దురభిమానులును, దస్కరులు నగుపాపులను కట్టగట్టి భీకరాగ్నిజ్వాలయందు పడవైచియు, రజ్జువులచే బంధించి దుర్గంధపంకమధ్యంబునఁ బడఁద్రోసియు, తీవ్రానలంబుచేఁ బచనంబు చేసియు ననేకవిధంబుల బాధింతురు. ఆదుష్కృతులు పాపక్షయం బగువఱకును దప్తకర్కశశిలాతలంబుల నంటిపెట్టుకొని ఘోరజలసేచనంబువలన నొడలంతయును మండుచుండఁ జావక మరణయాతనలఁ బడుచుందురు. వారియొడలంతటను బురుగులు పుట్టి రక్తమాంసములను భక్షించుచుండును. యమకింకరులు వారిని రెండుకొండలనడుమఁ బెట్టి వానిచే బలవంతముగ నొక్కింతురు. కాల్చిన యినుపగుండ్లను బెల్లపుముక్కలవలె వారినోటి నిండఁ గుక్కుదురు.

శివాలయంబులను, ఆరామములను, వాపీకూపతటాకంబులను బాధచేయువారును, శివమందిరంబులందు అభ్యంగస్త్రీభోగద్యూత క్రీడాదులఁ గావించువారును గల్పాంతంబువఱకు నరకంబున మహాబాధ లందుచు నిత్యయంత్రంబులచేఁ బీడితులగుచు నరకానలంబున నుడికిపోవుచుందురు. సాధునిందల నాకర్ణించువారిచెవులయందు దండధరకింకరులు కరఁగించినయినుము, రాగి, వెండి, సీసము మొదలగువానిని బోసి నిండించుచు వివిధంబులగునరకయాతనలపాలు గావించుచుందురు. మోహముగ్ధులై పరస్త్రీలను స్పృశించినపాపాత్ములచేతులలోఁ గాల్చినయినుపకను బోయుదురు. వారిని సకలనరకబాధలను బెట్టుదురు. తల్లిదండ్రులను గన్నులెఱ్ఱచేసి చూచువారిని, పరస్త్రీలను దురుద్దేశముతోఁ దిలకించువారిని వారికన్నులలోఁ గాల్చినయినుపసూదులను గ్రుచ్చి ఘోరాములను గ్రుక్కి వివిధయాతనలపాలు గావింతురు. దేవాగ్నిగురుజనంబులకు నివేదింపక భుజించువారినాలుకలు చీలికలుచేసి మొగంబులఁ జత్తుకఁగొట్టుదురు. దేవతారామంబులయందలిపుష్పంబులను సుగంధలోభముచే నపహరించువారితలలపై నినుపమేకులను నాఁటి నాసికారంధ్రంబులనిండఁ గారము నూరుదురు.

మహాత్ములను, పురాణపాఠకులను, ధర్మోపదేశకులను, దేవాగ్నిగురుజనంబులను, దద్భక్తులను, వేదాదిధర్మశాస్త్రంబులను నిందించువారికంఠంబులను, వక్షంబులను, జిహ్వలను, దంతసంధులను, తాలువులను, ఓష్ఠంబులను, మస్తకంబులను దీర్ఘశిఖంబులగు తప్తలోహదండంబులచేఁ గాల్చి యాగాయంబులయందు ఘోరతేపనంబు గావించుచు సకలనరకంబులయందును వివిధయాతనలఁ బెట్టుచుందురు. పరద్రవ్యాపహారులను, పూజ్యులగుబ్రాహ్మణులను శివపూజోపకరణంబులను శివధర్మగ్రంథములను బాదములచేఁదన్నువారును లోహ

దండములచేఁ గాలుసేతులు నలఁగఁగొట్టఁబడి వివిధనరకయాతనల ననుభవించుచుందురు. యమదూతలు శివాయతనంబులయందు మూత్రపురీషంబుల విసర్జించువారిసర్వాంగంబులను లోహదండంబులచేఁ జూర్ణంబుగఁజేయుచు, సర్వేంద్రియంబులకును దప్తతైలాదులచే మహాబాధలను గల్పింతురు. ధనవంతుఁడయ్యును లుబ్ధత్వముచే సకాలమునం దింటికి వచ్చిన యతిథి నవమానించువాఁ డయ్యతిథిపాపంబుల నన్నిటిని దాను పొంది యశుచినరకంబున నిమగ్నుం డగును. వాయసకుర్కురంబులకు బలిదానంబు సేయక భుజించువారు నరకంబునఁ గ్రుధ్రములచే నాహతు లగుచు వదనంబులు క్రిమిపూర్ణంబు లగుచుండ సూక్ష్మజంతువులచేతను, లోహతుండంబులగు వాయసంబులచేతను వివిధరీతుల బాధితు లగుచుందురు.

'యమమార్గనిరోధకంబులును, శ్యామ, శబలనామకంబులు నగుకుర్కురంబులకు బలిదానము చేయుచున్నాను. అవి దీనిని బరిగ్రహించుఁగాక' అనుమంత్రముతోఁ గుర్కురబలినిగావింపవలయును. మఱియుఁ ఐంద్రవారుణవాయవ్యయామ్యనైరృతంబు లగువాయసంబులు నాయర్పించు నీబలిని గ్రహించుఁగాక' అనుమంత్రముతో వాయసబలి నర్పింపవలయును. శ్రద్ధతో శివపూజావిధిపూర్వకంబుగ హోమంబుచేసి శివమంత్రంబులతో బలిదానంబు చేయువారు యమదర్శనంబు లేకుండ స్వర్గంబును జేరఁగలరు. కావునఁ బ్రతిదినంబును జందనాదిసువాసితం బగుచతుష్కోణమండలమును నిర్మించి యీశానకోణంబున ధన్వంతరిని బూర్వదేశంబున నింద్రుని, దక్షిణంబున, యముని చిత్రగుప్తగణంబులను, పశ్చిమంబున వరుణుని, మఱలఁ బూర్వంబున నర్యముని, ధాతను, విధాతను, ద్వారపాలకులను, కుర్కురంబులను, కుర్కురపతిని నుద్దేశించి భూతలంబున బలిదానంబు చేయువారు

దేవపితృమానవులచేతను, భూతప్రేతగుహ్యకులచేతను, పక్షికిమికీట కంబులచేతను, సంరక్షితు లగుచున్నారు. స్వాహా, స్వధా, వషట్కారంబులును, బలియు ధేనువునకు స్తనచతుష్టయంబై యుండును. అందు స్వాహాకారరూపం బగు స్తనంబును దేవతలును, స్వధాకారరూప స్తనంబును బితృగణంబులును, వషట్కారరూప స్తనంబును భూతేశ్వరగణంబులును, బలిరూప స్తనంబును, మానవులును సర్వదా పానము చేయుచుందురు. అట్టిధేనువును శ్రద్ధాపూర్వకంబుగఁ బూజించుమానవుఁ డగ్నితుల్యుం డగు తేజస్వి యగుచున్నాఁడు. ధేనువును బరిత్యజించిన గృహస్థుం డంధకారనిమగ్నుం డగును. కావున దేవాదుల నుద్దేశించి బలిదానంబును గావించి క్షుధార్తుం డగునతిథికొఱకు నిరీక్షించి యుండవలయును.

ఆన్నభోజనం బగునంతకులోపల నతిథి యేతెంచునేని యథాశక్తినుత్తమాన్నపానీయంబులతో నాతని బరితృప్తుం గావింపవలయును. అతిథి నిరాశుండై యెవ్వనిగృహంబునుండి మరలిపోవునో యాతఁ డాగృహస్థునకుఁ దనపాపంబుల నిచ్చి యాతనిసకలపుణ్యంబుల నపహరించి పోవును. అతిథిని దృప్తుం గావింపక లోభముచేఁ ద్యజించి తాను భుజించువాఁడు శృంఖలాబద్ధుండై నరకంబున వివిధయాతనల ననుభవించును. యమదూతలు లాతనిమాంసమును దిలమాత్రశకలంబులుగఁ జేసి యాతనిచే భుజింపఁజేసి యాతనిరుధిరంబును బానము చేయింతురు. ఆపాపాత్ముఁడు క్షుత్పిపాసార్తుండై క్రమంబుగ నవసన్నుం డగుచుండును. పాపాత్ముల కీవిధముగా ఘోరనరకయాతన లగుచుండును. క్షుద్బాధాతిరేకంబున భక్ష్యవస్తువులందు గుచిలాభంబు నందఁజాల్లే మహాపాపులగువారికి స్వల్పసుకృతభోగంబులు సంతుష్టిం గూర్పఁజాలవు. ధనవంతుం డగువాఁ డుపవాసంబును చేసి

యు వస్త్రాభావబాధ నందనట్లే యధికసుకృతంబు గలవాఁడు స్వల్ప
నరకయాతన ననుభవించుచుండియు లక్ష్యము చేయకుందును. పా
పంబులచే వజ్రాహతంబు లగుపర్వతంబులవలె మానవులు భిద్య
మానులగుచుందురు.

## —♦ ధర్మవిశేషనిరూపణము. ♦—

వేదవ్యాసునకు సనత్కుమారుండు మఱియు నిట్లు చెప్పందొ
డంగెను. ఓసంయమీంద్రా! శుభాశుభకర్మంబులకు ఫలభోగం బవ
శ్యముగఁ గాక మానదు. పుణ్యకర్ములును, సౌమ్యచిత్తులును, దయా
పరులును భయంకరమగుయమమార్గమును సుఖంబుగఁ దరింపఁగలరు.
చర్మపాదుకలను, కాష్ఠపాదుకలను దానము చేయువారు సులక్షణం
బగునశ్వము నధిరోహించియు, ఛత్రదానము చేయువారు ఛత్రము
లం దాల్చియు, వాహనదానముం జేయువారు శిబికల నధిష్ఠించియు
సుఖగమనంబు చేయుదురు. శయ్యాసనదాతలును, ఆరామప్రతిష్ఠాపకు
లును, వృక్షారోపకులును యమపురంబునకు సుఖంబుగఁ బోవుదురు.
పుష్పోద్యానంబుల నిర్మించువారు పుష్పకారూఢులై విహరించుచుం
దురు. దేవాలయములు, యత్యాశ్రమములు, అనాథశరణాలయము
లు నిర్మించువారు యమనగరంబున దివ్యమందిరాభ్యంతరములఁ గ్రీ
డించుచుందురు. దేవాగ్నిగురుజనంబులను, దల్లిదండ్రులను బూజిం
చువారు పూజ్యమానులై సుఖప్రయాణంబు చేయుదురు. దీపదా
తలు నలుదెసలను బ్రకాశింపఁజేసికొనుచుఁ బోవుదురు. నిరాశ్రయుల
కాశ్రయం బిచ్చువా రేబాధయును లేకుండ ననుగమింతురు. గురు
శుశ్రూషలం గావించుపుణ్యులు విశ్రామసుఖంబు ననుభవించుచు
స్వర్గము నారోహింతురు. రోగార్తుల కౌషధంబుల నిచ్చువారు సుఖం

టుగఁ బయనంబు సాగింతురు. గోదానంబులు చేయువారు సర్వకామపరిపూర్ణులై పరిక్రమింతురు. అన్నపానీయదాతలు పరితృప్తిం గాంచుచు యమమార్గము నుత్తరింతురు. పాదోదకదానము చేయువారికామార్గ మంతయుఁ జల్లగా నుండును. బ్రాహ్మణపాదములను తైలాదులచే మర్దించువారు తురగారూఢులై పోవుదురు. పాదశౌచము, అభ్యంగము, దీపము, అన్నము, ఆశ్రయము వీనిని దానము చేయువారు యమసమీపంబునకుఁ బోవువారు గారు. హేమరత్నాదిదాతలు దుర్గమస్థానంబుల నుల్లఘించి పోవుదురు. గోవృషదాతలు దివ్యయానంబుల నధిరోహించియు, భూదానంబు చేయువారు సకలాభీష్టంబుల నందుచును బయనంబు చేయుదురు. ఈరీతిగా దానములు చేయువారు సుఖంబుగ యమమార్గమును దరించి స్వర్గంబు చేరి వివిధభోగంబుల ననుభవించుచుందురు.

అన్నమువలనఁ దక్షణమందే సంతృప్తి కలుగుటవలనను, అన్నము సకలజీవులకును బ్రియంబగుట, బుద్ధివృద్ధికరంబు నగుటవలనను సకలదానంబులకంటెను నన్నదానమే శ్రేష్ఠమైనది. దానంబులయందు అన్నపానీయంబులతోఁ దుల్యంబు లగునవి యేవియును లేవు. అన్నమునుండియే సకలజీవులును జనించినవి. అది లేకయున్నచో నన్నియును నశింపఁగలవు. అన్నమువలననే రక్తము, వస, మాంసము, శుక్రమును వర్ధిల్లుచుండును. ఆశుక్రమే జీవోత్పత్తికిఁ గారణ మైనది. కావున నీజగం బంతయు నన్నమయం బగుచున్నది. క్షుధార్తుం డగు వానికి హేమరత్నములు, గుఱ్ఱములు, నేనుఁగులు, స్రక్చందనవనితాదిభోగములు, సకలవస్తువులు నొసంగినను దృప్తి కలుగనేరదు. గర్భస్థులు, పుట్టుచున్నవారు, బాలకులు, మధ్యములు, వృద్ధులు, దేవతలు, దానవులు, మానవులు, సకలజీవులునుగూడ నన్నమునే వాం

భించుచుండును. ఆకలియే యన్నిరోగములకంటెను భీకరమైనది. అట్టి వ్యాధి యన్నంబను నౌషధమువలన నశించుచున్నది. ఆకలివంటి బాధాకరమగురోగ మేదియును లేదు. ఆకలితో సమాన మగురోగమును, నిద్రాహీనత్వముతో సమాన మగుసుఖమును, క్రోధముతో సమానమగుశత్రుత్వమును లోకమునం దెందునులేవు. సకలజీవులును క్షుధానలముచేఁ బరితప్తులై మరణించుచుందురు. అన్నదాతయే ప్రాణదాత. ప్రాణముల నిచ్చువాఁడు సర్వమును దానముచేసినపుణ్యుఁ డగుచున్నాఁడు. అందుచేతనే యన్నదాతకు సకలదానఫలంబులును లభింపఁగలవు. అన్నదానముచేఁ బరితృప్తినందినవారు చేసినపుణ్యములో సగముభాగ మాయన్నదాతకు లభించుచున్నది. త్రిభువనంబులయందునుగల ధనకనకవస్తువాహనరమణీవైభవాది మహాభోగంబులన్నియు నన్నపానదాతల కిహపరలోకంబులు రెండిటియందును లభించుచున్నవి. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనుపురుషార్థములను బడయుటకు దేహమే ప్రధానోపాయమై యున్నది. అన్నము సాక్షాత్ప్రజాపతిస్వరూపమును, విష్ణుస్వరూపమును శివస్వరూపమునై యున్నది. కావున నన్నదానంబుతో సరియగుదానములు భూతభవిష్యత్కాలంబులయం దెందును లేవు.

జలము మూఁడులోకంబులకును జీవనమును, పవిత్రంబును, నమృతతుల్యంబును, దివ్యంబును, సకలరసంబుల కాధారంబునై యున్నది. ఎంతటిమహాపాపంబులు గావించిన వారైనను అన్నదానంబువలనఁ బాపవిముక్తులై స్వర్గావాసు లగుదురు. అన్నము, జలము, గోవు, వస్త్రము, శయ్య, ఛత్రము, ఆసనము, పాదుక మొదలగువస్తువులదానములు ప్రేతలోకంబున సుప్రశస్తంబులు. ఈదానంబులు చేసి

కిమోవులు విమానారూఢులై ధర్మపురంబు ననుగమింతురు. కావున
నవశ్యముగ ధర్మాచరణంబు గావింపవలయును.

తపంబువలన స్వర్గము, యశము, ఆయువు, ప్రహర్షము,
భోగము, జ్ఞానము, విజ్ఞానము, ఆరోగ్యము, రూపము, సౌభాగ్యము,
సార్వకాలికసుఖము నమువీనినన్నిటిని బడయవచ్చును. తపోనుష్ఠానం
బుచేయనివారు సనాతనం బగుశివలోకంబును జేరఁజాలరు, దూరంబు
లును, దురారాధ్యంబులును, సుదూరంబులును, దుఃతిక్రమంబులు
నగునవి యన్నియును దపంబుచే సాధ్యము లగుచున్నవి. తపంబునకు
మించిన దేదియును లేదు. మౌనావలంబనంబువలన లోకమాన్యత్వం
బుసిద్ధించును. దానమువలన భోగంబును, బ్రహ్మచర్యంబువలన
దీర్ఘాయువును, అహింసవలన బలరూపంబులును, శివమంత్రగ్రహణం
బువలన సత్కులజన్మంబును, ఫలమూలభోజనంబువలన రాజ్యం
బును, బర్ణభోజనంబువలన స్వర్గంబును, శుద్ధజలపానంబువలన స్వర్గం
బును, సమృద్ధస్థానంబును, గురుశుశ్రూషవలన విద్యయు, నిత్యశ్రద్ధ
వలన సంతతియు, శాకదీక్షవలన గోసమృద్ధియు, తృణభోజనంబువలన
స్వర్గంబును, త్రికాలస్నానంబువలన స్త్రీలాభమును, వాయుభక్షణం
బువలన యజ్ఞఫలంబును, సంధ్యాద్వయంబునను స్నానము చేసి శివ
మంత్రమును జపించుటవలన సామర్థ్యంబును, మౌనావలంబనముచే
రాజ్యంబును, నిరాహారంబుచే స్వర్గంబును లభించును. మఱియుభూ
శయనంబుచే గృహశయ్యాలాభంబును, చీరవల్కలధారణంబుచే వస్త్రా
భరణంబులును, దపోయోగనిష్ఠలచే శయ్యాదిసకలభోగప్రాప్తియు
నగును. అగ్నిప్రవేశంబువలన బ్రహ్మలోకగమనంబును, మధురాది
రసాసక్తినుండి యింద్రియంబుల మరలించుటచే సౌభాగ్యంబును,
ఆమిషత్యాగంబుచే సంతానంబున కాయుష్యంబును, సూర్యోదయా

త్వరంబున నిదిరింపకుండుటచే నాధిపత్యంబును, సిద్ధించును. సత్యవాదంబువలన దేవతాప్రీతియు, దానంబుచేఁ గీర్తియు, అహింసవలన నారోగ్యంబును, బ్రాహ్మణశుశ్రూషచే రాజ్యంబును బ్రాహ్మణత్వంబును, జలదానంబుచేఁ గామభోగతృప్తియు, సర్వభూతప్రియత్వంబుచే సర్వదుఃఖవిముక్తియు, దేవపూజనంబున రాజ్యంబును, దివ్యరూపంబును, దీపదానంబుచే సూక్ష్మదృష్టియు, పుస్తకాదిదానముచే స్మృతిశక్తియు, గంధమాల్యాదిదానంబుచేఁ గీర్తియు, కేశశ్మశ్రుధారణంబున సంతతియు, ద్వాదశవర్షోపవాసయజ్ఞదీక్షచే వీరప్రాప్యంబగు స్థానమునుమించిన స్థానమును, కన్యాదానతీర్థోపవాసంబులచే నుత్తమస్వర్గంబును, ఫలపుష్పప్రదానముచేఁ బతినభయశూన్యంబగు నుత్కృష్టస్థానంబును లభింపఁగలవు.

సువర్ణశృంగవిభూషితంబులగు వేయిగోవులను దానముచేయువాఁడు పుణ్యమును, దేవలోకసుఖంబునుగాంచు నని మునులు చెప్పుదురు. స్వర్ణశృంగంబులు గలకపిలధేనువును వత్సంబుతోఁగూడ దానముచేయువారు గోశరీరమునం దెన్నిరోమంబులుండునో యన్నిశుభఫలంబుల నందఁగలరు. వారు తమకులమునందు సప్తపురుషాంతరంబులవఱకును దరింపఁజేయుదురు. కాంచనశృంగయుతంబును, బహుమాల్యవసనాచ్ఛాదితంబును, నగుతిలధేనువును భూరిదక్షిణాకలితంబుగ దానము చేయువారు వసులోకంబున సుఖభోగంబు లనుభవింతురు. గోదానము ఘోరాంధకారమయంబగునరకకూపంబునఁ బడి పోవుచున్నమానవుని మహాసముద్రమును దరింపఁజేయు నోడవలెనే యుద్ధరింపఁగలదు.

బ్రహ్మవిధిచేఁ గన్యాదానంబును, భూదానమును మఱియు నితరదానంబులును గావించువారికి స్వర్గము లభించును. స్వాధ్యాయ

శుకరుండును, ఉత్తమపవిత్రకుండును, గుణనిధియు నగుబ్రాహ్మణునకు సర్వోపకరణసమన్వితం బగుగృహమును దానము చేయువా రక్షయం బులగుస్వర్గభోగము లనుభవించుచుందురు. గోవృషాశ్వదాతలకు వసులోకంబును, రజతాదిదాతలకు స్వర్గంబును, సువర్ణదాతలకుఁ దదున్నతస్థానంబును లభించును. ఛత్రదానంబుచే దివ్యమందిరంబులును, పాదుకాదానంబున వాహనంబులును, వస్త్రదానంబున సురూపంబును, చందనదానంబున సుగంధశరీరంబును లభించును. ఫలపుష్పసమన్వితం బగువృక్షమును దానము చేయుటవలన సౌభాగ్యవతియగు సతీలాభంబును, ధనకనకాదిసంపన్నంబగుగృహలాభంబును గలుగును. భక్ష్యములు, అన్నపానములు, రసంబులును దానము చేయువారు వివిధరససమృద్ధిం గాంతురు. అశ్రియాచ్ఛాదనదానంబులవలన సకలరసప్రాప్తి యగును. మాలాచందనానులేపనస్నానజలదానంబులచే రోగసౌఖ్యలును, రూపవంతులు, రాజతుల్యులు నగుదురు. ధాన్యయుతంబును, శాకగృహసంపన్నంబును, పవిత్రంబును, రమణీయంబును, బహువస్త్రపూర్ణంబు నగు గృహమును దానముచేయువారు సర్వోత్కృష్టభవనలాభముం గాంతురు. సుగంధమయంబును, విచిత్రాస్తరణసమన్వితంబు నగుశయ్యను దానముచేయువారి కప్రయత్నంబుగ రూపవతియుఁ బతిప్రియవిధేయయు, మనోహారిణియు నగుభార్య లభించును.

విపత్కాలంబున నభయప్రదానంబును, అనుగ్రహంబును, తృష్ణార్తులకుఁ గావలసిన జలదానంబును నుత్తమంబులు. గోభూహిరణ్యదానంబు లతిపవిత్రంబులును నరకనిస్తారకంబులు నై యుండును. ఈదానంబులు గావించుదాతలు సకలపాపవిముక్తు లగుదురు. అభీష్టంబులగు సకలవస్తువులును సమృద్ధంబులై యింట నుండవలయు నని వాంఛించువారు తమకుఁ బ్రియంబు లగువస్తువులను సత్పాత్రులకు

దానము చేయునవలయును. పరప్రియకారియై, ప్రియవస్తుదానంబు చేయు
వాఁడిహలోకంబునఁ బ్రియవస్తులాభముం గాంచుటే కాక పరలోకం
బున సర్వభూతప్రియుండై యుండును. దరిద్రుండు ప్రార్థించుచున్నను
దురభిమానంబుచే యథాశక్తిని సాహాయ్యంబుచేయనివాఁడు నృశం
సుం డగుచున్నాఁడు. ఆపన్నుండును, శరణాగతుండు నగుదరిద్రుఁడు
శత్రుండైనను నాతనియెడల ననుగ్రహంబు చూపువాఁడు పుణ్యపు
రుషుండని మునులు నిర్దేశించి యున్నారు. వృత్తిహీనులై సిగ్గుపడుచు
యాచించుచున్న దరిద్రులకు దానము చేయువానితో సమానుఁ డగు
నుత్తమపురుషుం డెవ్వఁడును లేఁడు.

ఏదేవతయందైనను, ఏమానవునియందైనను నల్పత్వము నా
రోపింపనిమహాత్ములును, నిత్యసత్యవంతులును, న్యాయలబ్ధోపజీవు
లును, విద్యాభిషిక్తులును, వ్రతస్నాతులును, అధ్యాత్మజ్ఞానచింతకులు
ను, గూఢస్వాధ్యాయతపోనిరతులును, ప్రశంసితవ్రతులును, స్వదార
నిరతులును, దాంతులును, యథాశక్తిచే దానము చేయువారును,
పురాణస్మృతివేత్తలును, యజ్ఞానుష్ఠానపరులును, నగుబ్రాహ్మణులు,
నాచార్యులును, పురోహితులును పూజనీయులు. ఇట్టిధర్మతత్పరు
లను పుత్రులవలెఁ బాలింపవలయును. స్వధర్మపరులగుగృహస్థులు
మంగళాకాంక్షులై తమశక్తికొలఁది న్యాయార్జితం బగువిత్తంబు నొ
సంగి యుత్తమబ్రాహ్మణులను పూజింపవలయును. దర్శనంబు లభిం
చినప్పుడు బ్రాహ్మణులంగూర్చి తల్లికి నమస్కరించినట్లు నమస్కరింప
వలయును. పతుల నాశ్రయించియుండుట సతులకు సనాతనధర్మమై
నట్లే సంసారతారకు లగుపురోహితుల ననుసరించుట యజమానులకు
ధర్మమై యున్నది. సద్బుద్ధు లగుక్షత్రియులకు బ్రాహ్మణులకంటె
గురువొరుగఁ లేదు. కావున వారు సర్వదా దానాచ్ఛాదనభోజనాదులచే

బ్రాహ్మలయెడల భక్తిప్రదర్శనముం గావించుచుండవలయును.

పూర్వము క్షత్రియులు బ్రాహ్మణులకును, వైశ్యులు క్షత్రియులకును, శూద్రులు వైశ్యులకును బరిచారకులై యుండిరి. మృదుస్వభావులును, సత్యశీలురును, సత్యధర్మపాలకులును, గోపముకలిగినచో విషసర్పసదృశులు నగుబ్రాహ్మణులను సర్వదా పూజించుచుండవలయును. విద్యచేఁగాని, వయస్సుచేఁగాని బ్రాహ్మణునకు శ్రేష్ఠత్వంబు గలుగదు. సదాచారసంపన్నుం డగు బ్రాహ్మణుఁడే యుత్తముఁడు. యాచకునికంటె నయాచకునకు దానము చేయుటవలననే యధికశ్రేయోలాభం బగును. దారిద్ర్యనిమగ్నుం డయ్యును ధృతిమంతుండై యాచింపనివాఁ డధికుం డగుయాచకునికంటె శ్రేష్ఠుం డగుచున్నాఁడు. అజ్ఞనపరుం డగుక్షత్రియుండును, ధృతిమంతుండును శుచియు నగుబ్రాహ్మణుండును శ్రేష్ఠులు. ధైర్యశీలుండును సంతుష్టుండు నగుభూసురుఁడు దేవతలకుఁగూడఁ బ్రియుండు గాఁగలఁడు.

యాచించుచున్న బ్రాహ్మణునియందు వ్యభిచారభావము గోచరించుచుండును. యాచకులు బందిపోటుదొంగలవలె సకలజీవులకు నుద్వేగముం గూర్చుచుందురు. యాచకుఁడు ప్రార్థించుసమయంబున మరణయాతన ననుభవించుచుండును. ఇష్టము లేక బలవంతముగ దానముచేయుదాతకూడ నట్టిక్లేశమునే గాంచుచుండును. శ్రద్ధాపూర్వకంబుగ దానము చేయువాఁడే యాత్మోద్ధరణంబు చేసికొనఁగలఁడు. యాచకున కేదియో కొంచె మిచ్చుటమాత్రమే దానము గాదు. అర్థించినదాని నిచ్చుటయే యుత్తమదాన మగుచున్నది. ధనాభావముచేఁ గ్లేశముల ననుభవించుచుండియు యాచింపకుండువారే దానమునకుఁ బాత్రులు. భస్మాచ్ఛాదితంబు లగునగ్నికణంబులవలె నిట్టి బ్రాహ్మణు లేరాజురాజ్యమునందు వసించుచుందురో యారాజు వారి

పరిభావనమువలనఁ దరింపఁగలఁడు. అట్టిజ్ఞానవిజ్ఞానతపోబలసంపన్ను లగుబ్రాహ్మణులను నిత్యమును బూజింపవలయును. అట్టిగూఢతపస్వులకు బహువిధవస్తుపరిదానంబు గావించినచోఁ బ్రాతస్సాయంకాలములయం దగ్నిహోత్రంబు చేసినఫలంబు లభించును.

విద్యావంతులును, వేదవ్రతులును, అవ్యయాపత్యజీవులును, గూఢస్వాధ్యాయతపోనిరతులును, విఖ్యాతవ్రతులు నగుబ్రాహ్మణుల నాహ్వానించి సోపకరణం బగుగృహంబును దాసదాసీజనసహితంబుగ దానము చేయవలయును. కర్షకులు మేఘునికొఱకు ఎదురుచూచుచున్నట్లు బ్రాహ్మణు లెవ్వరిదానముకొఱకుఁ బ్రతీక్షించుచుందురో యాతఁడు దేవతలచే ననుగమ్యమానుండై స్వర్గంబునకుఁ బోఁగలఁడు. క్షత్రియు లెప్పుడును యుద్ధాదిభయంకరకృత్యంబులఁ గావించుచుందురు గావున వారు తమపవిత్రకొఱకు యజ్ఞదానాదిసత్కర్మంబు లాచరించుచుండవలయును. సాధువులు పాపాత్ము లగునరపతులకడ నేదియును బ్రతిగ్రహింపఁజాలరు. అట్టినరపతులు శ్రద్ధాయుక్తులై ప్రతిదినంబును దానంబులు చేయుటవలనఁ బరిశుద్ధు లగుదురు. సర్వజ్ఞానవిశారదులును, వేదవిద్యాసంపన్నులును, సదాచారులును, తపోనిరతులు నగుబ్రాహ్మణులను, మిత్రులను, సాధువులను వివిధవస్తుపరిదానంబులచే సంతుష్టులం గావింపవలయును.

ధేనువులు, వృషభములు, అన్నము, ఛత్రములు, చర్మపాదుకలు, అశ్వయుతంబు లగు వాహనములు, గృహములు, శయ్యలు, మొదలగువానిదానంబులు మహాఫలజనకంబులు. వీనివలన సకలపాపంబులును నశింపఁగలవు. దరిద్రుం డగువానిని జూచి యసహ్యపడఁ గూడదు. అతఁడు నిరాధారుం డని గ్రహించి గూఢముగను, ప్రకాశముగను దానము చేయవలయును. భృత్యవర్గమును, బ్రజలను

బుత్రులవలెఁ బరిపాలించువానికి బ్రాహ్మణులవలన యోగక్షేమలాభం బగును. రాజు నగరపాలకులవలన లంచములను గ్రహించి వారిచేఁ బ్రజలను బరిపాలింపఁజేయుచున్నచో నాతఁడు మహాపాపఫలంబు లనుభవించును. రాజు ప్రజలకుండి న్యాయమార్గంబునఁ గరగ్రహణంబు చేయుచు సమాహితచిత్తంబున యజ్ఞాది సత్కర్మంబులాచరించుచున్నచో సాధువు లాతని గీర్తించుచుందురు. మహాసముద్రము తనలోనిసకలవస్తువులను బయటఁ బడవైచునట్లే భూరిదక్షిణల నొసంగుచు యజ్ఞంబుల నాచరించుప్రభుండు సంపన్నుండును, గీర్తిమంతుండును గాఁగలఁడు.

బాలకులు, వృద్ధులు, అంధులు, పీడితులు మొదలగువారిధనమును నరపాలుఁడు సంరక్షించుచుండవలయును. భూపాలుం డెన్నఁడును భూగర్భస్థం బగునితరులధనంబును, అదత్తం బగుపరులద్రవ్యంబును హరింపంజనదు. కృపణుఁ గువానిసంపత్తి మహీపతియపహరించినచో నాతనిరాజ్యమును, సత్కర్మంబులవలనం గలుగుఫలంబును నశించిపోవును. బాలునిచేతనున్న భుచ్యభక్ష్యమువలెనే కృపణునికడనున్నధనము తనకును బరులకునుగూడ భోగ్యంబు గాకపోవును. ఏ రాజు రాజ్యంబున విద్వాంసులగుబ్రాహ్మణులు క్షుత్పీడితులై యవసన్నులగుచుందురో యాతనిరాజ్యమును జీవితమునుగూడ నిందనీయము లైనవి. శిబివచనానుసారంబుగ నట్టిభూపాలుఁడు మానుష్యపదవాచ్యుండు గానేరఁడు. అతనిరాజ్యమును రాజ్యముగాదు. ఆరాజుతోఁగూడ నారాజ్యము నశింపఁగలదు. కాముకులగుదస్యులచే నేరాజురాజ్యంబున నాక్రోశించుచున్నపతిపుత్రాదులయెదుట రమణీమణులు బలవంతముగ నాకర్షింపఁబడుదురో యాభూపాలుఁడు జీవన్మృతుఁడని చెప్ప నధమాధముఁ డగుచున్నాఁడు. రక్షణభరణంబుల

రుండఁ బరాఙ్ముఖుండును, ప్రజాద్రవ్యవినాశకుండును, అదాతయు, గర్వ యుండు నగునరపతిని బ్రజలందఱును బలవంతముగ శిక్షింపఁ జేయుదు రు. 'నేను మీకు రక్షకుఁడను.' అని వాగ్దానము చేసి సింహాసనాసీ నుఁడగుపిమ్మట స్వవచనవ్యాఘాతముగఁ బ్రవర్తించినచోఁ బ్రజలా తనికి వినాశంబు గూర్పక మానరు. ధర్మశాసనాభావంబుచేఁ బ్రజలు విశృంఖలులై చేసినపాపంబులయందు చతుర్థాంశము రాజనుభవింప వలయు నని మామతము. ఆపాపఫలంబునం దర్ధభాగము రాజునకు ఘటిల్లు నని కొందఱుమునులు నిర్దేశించి యున్నారు. సురక్షితులగు ప్రజలుచేసిన పుణ్యంబులందు చతుర్థాంశము రాజునకుఁ జెందఁగలదు.

## — అన్నదానవిధి. —

గుణవంతుండును, దానప్రియుండు నగుభూపాలుం డెట్టిదానం బులఁ గావింపవలయునో యానతీయవలయు నని వేదవ్యాసుండు ప్ర శ్నించుటయు నసత్కుమారుండిట్లు చెప్పందొడంగెను. మునీంద్రా! శ్రేష్ఠులగుమహర్షులును, దేవతలునుగూడ లోకతంత్రమును బాగుగ గ్రహించి యన్నమునే విశేషముగఁ బ్రశంసించి యున్నారు. అన్న మునందే సర్వంబును బ్రతిష్ఠితంబై యున్నది. కావున నన్నదానమే సర్వోత్తమంబై నదని సాధుజనులయుద్దేశము. దానితో సమానంబు లగుదానంబు లెవ్వియును లేవు. అన్నమే యీవిశ్వమునంతను ధరిం చి యున్నది. అన్నము బలమును నిచ్చుచున్నది. సకలజీవులకును బ్రా ణము లన్నమువలననే నిలుచుచున్నవి. కావున నాత్మశ్రేయంబు నా కాంక్షించువారు తామును దమకుటుంబమును బాధపడినైన మహా త్ములగుభిక్షుకులకు నన్నదానంబు చేయవలయును. క్షుధార్తుల కన్న దానంబు చేయువారు పరలోకోపకారంబగు పుణ్యనిధిసంచయంబు

చేసినవా రగుచున్నారు. ఐశ్వర్యకాముం డగువాఁడు యథాకాలస
మాగతుండును, శ్రీమాతురుండును, పాంథుండును నగునతిథి నన్నపా
నాదులచే సత్కరింపవలయును. శీలవంతుండును, నిర్మత్సరుండు నగు
మానవుండు యాచకునియెడలఁ గోపంబు లేక యన్నదానంబు చేసి
యిహపరసుఖంబుల నందును. భిక్షార్థియై వచ్చినయతిథి నభినందింప
నక్కఱలేదు. అతని నేవిధముగను దిరస్కరింపకుండుటయే చాలును.
వేయిమాటలేల—ఆకలిచేఁ బరితపించుచున్న చండాలునికైనను, కుక్క
కైనను నన్నదానంబు చేసినచో నిష్ఫలంబు గానేరదు.

శ్రాంతుండును, అపరిచితుండు నగుపథికునకు సుఖకరంబుగ
నన్నదానము చేయువాఁడు మహాసంపన్నుం డగును. దేవపితృగణం
బులను, బ్రాహ్మణులను, అతిథులను అన్నదానంబుచేఁ బరితృప్తులం
గావించువారు మహాపుణ్యఫలంబులం గాంచఁగలరు. మహాపాపియై
నను క్షుధార్తున కన్నదానము గావించి పాపవిముక్తుండగును. బ్రాహ్మ
ణునకుఁ జేసినదాన మక్షయం బగును. శూద్రునకు దానము చేసినను
మహాఫలంబు లభించును. సకలవర్ణంబులకును నన్నదానంబు చేయుట
విశేషఫలప్రదం బగుచున్నది. అన్నార్థియై వచ్చినయతిథిగోత్రము,
శాఖ, స్వాధ్యాయము, దేశము వీనింగూర్చి యేమియుఁ బ్రశ్నింపకుం
డఁగనే యన్నదానము చేయవలయును.

అన్నదానము చేయువారికి స్వర్గలోకంబున నివసించుటకు సర్వా
భీష్టదాయకంబులును, సకలభోగసమన్వితంబులు నగురమణీయమంది
రములు నిర్మింపఁబడి యుండును. అవి యన్నియును బుష్పఫలోద్యాన
సమన్వితంబులై యుండును. హేమవికారంబులగు దొరువులును,
నిర్మలజలపూర్ణంబు లగుకూపదీర్ఘికలును, గభీరనినదంబులును, మౌక్తి
కమయంబులు నగుయానంబులును, సమృద్ధంబులగుభోజ్యవస్తువులును,

ఉత్తమవసనంబులును, అలంకారములును, క్షీరనదులును, అన్నపర్వతంబులును, శుభ్రిసౌధంబులును, కనకశయ్యలును మొదలుగాఁగల సకలవైభవంబులును వానికిఁ గరగతంబులై యుండును. కావున నన్నదానంబు చేయుట పరమధర్మము. శ్రాద్ధకాలంబున నీయన్నదానప్రశస్త్యముంగూర్చి భక్తిపూర్వకంబుగ నాకర్ణించినచో శ్రాద్ధీయాన్నమును పితృగణంబులు పరిగ్రహించి సంతృప్తులగుదురు.

## —♦ పానీయాదిదానప్రశంస. ♦—

జలదానమును సర్వోత్తమం బైనది గావున వాపీకూపతటాకాదినిర్మాణంబు గావింపవలయును. పాపాత్ముం డైనను లోకసుఖార్థమై జలాశయమును బ్రతిష్ఠించినచోఁ దనపాపమునం దర్ధభాగమునుండి విముక్తుండగును. జలాశయంబులయందు గోబ్రాహ్మణసాధుగణంబులును, సకలజీవులునుగూడ జలపానంబు చేసి సుఖింతురు గావున వానిని నిర్మించువారివంశమునం దందఱును పాపవిముక్తు లగుదురు. వేసవికాలంబులయందు జలస్థానంబుల నడ్డుపెట్టక సకలజీవోపయోగకరంబులుగ విడుచువారి కెన్నఁడు నెట్టికష్టంబులును గలుగవు. తటాకనిర్మాతలు త్రిభువనంబులయందును బూజ్యులై సూర్యదేవునితో మైత్రిం గాంచి సూర్యలోకంబుఁ జేరి యందు సుఖభోగంబులను శాశ్వతకీర్తిని గాంచఁగలరు. ఉత్తమక్షేత్రంబున విశాలంబగు తటాకమును ద్రవ్వించువారికి ధర్మార్థకామంబు లనుత్రివర్గఫలంబులును లభించును. చతుర్విధప్రాణుల నుద్దేశించియుఁ దటాకోత్సర్గనంబు గావింపవలయును. తటాకనిర్మాతలు శ్రీసంపన్ను లగుదురు. దేవమానవులును, సర్పంబులును, రాక్షసులును, స్థావరంబులును మొదలుగాఁగలప్రాణులన్నియును జలాశయముల నాశ్రయించి యుండు

ను. వర్షాకాలమునందుమాత్రమే జలంబులు నిలిచియుండు చెఱువును త్రవ్వించువారుగూడ నగ్నిహోత్రఫలలాభంబు నందఁగల రని మహాత్ములు చెప్పుదురు. శరత్కాలంబువఱకు నుదకపూర్ణంబు లగు తటాకంబులు నిర్మించువారు సహస్రగోదానఫలంబు గాంతురు. వానియందు హేమంతకాలంబువఱకును జలమున్నచో దాతలకు స్వర్ణదానఫలంబును, శిశిరకాలంబువఱకు నిలిచియున్నచో యజ్ఞానుష్ఠానఫలంబును, వసంతకాలపర్యంతము నున్నచో నతిరాత్రయజ్ఞఫలంబును, గ్రీష్మకాలంబువఱకునుగూడ నిలిచియున్నచో నశ్వమేధయాగఫలంబును లభింపఁగలదు.

వివిధంబులగు ఫలవృక్షాదులతోఁ దోఁటలను వేయించువారు తమవంశమునం దతీతులగుపితృగణంబులను, అనాగతు లగుపుత్రపౌత్రాదులను నుద్ధరింపఁగలరు గావునఁ బుణ్యార్థు లగువారు వనప్రతిష్ఠలను గావింపవలయును. అందు నాఁటబడినవృక్షంబు లన్నియు నారోపకునకుఁ బుత్రతుల్యంబులై పరలోకగతికి సాధనంబు లగుచున్నవి. ఆవృక్షములు పుష్పంబులచే దేవతలను, ఫలంబులచేఁ బితృగణంబులను, ఛాయలచే నతిథిగణంబులను బూజించి తనియించుచుందును. మఱియు వానిపుష్పఫలాదులచే మానవాది సకలజీవులును సంతుష్టులగుచుందురు. కిన్నరులు, ఉరగులు, రాక్షసులు, దేవతలు, గంధర్వులు, మానవులు, మహర్షులునుగూడ వృక్షంబుల నాశ్రయించియుందురు. ఇహపరలోకంబులయందు వృక్షంబులు పుత్రతుల్యంబులని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. జలాశయప్రతిష్ఠాపకులును, వృక్షారోపకులును, యజ్ఞానుష్ఠానపరులును, సత్యవాదులు నగువారికి స్వర్గచ్యుతి లేదు.

సత్యమే పరమబ్రహ్మంబును, శ్రేష్ఠంబగుతపంబును, "అసాధా

రణంబగు యజ్ఞంబును, అద్వితీయం బగువిద్యయు నగుచున్నది. సత్యము వేదంబులయందు జాగరితమై యుండును. సత్యమే పరమ పదము. తపము, యజ్ఞము, పుణ్యము, దేవర్షిపితృగణపూజనము, వైదికధర్మసమూహము, విద్య యనునవి యన్నియును సత్యమునందే ప్రతిష్ఠితములై యున్నవి. యజ్ఞము, దానము, మంత్రము, దేవి యగుసరస్వతి, వ్రతాచరణము ఓంకారమునుగూడ సత్యస్వరూపములే యగుచున్నవి. సత్యప్రభావముచేతనే వాయువు గమనాగమనంబులం గావించుచుండును; సూర్యుఁడు ప్రకాశించుచుండును; అగ్ని దహించుచుండును; స్వర్గముకూడ సత్యప్రభావముచేతనే సుస్థిరమై యుండును. సత్యవాదులకుం జతుర్వేదధర్మపాలనమును, సర్వతీర్థావగాహనమును గావించిన పుణ్యఫలము లభించుచున్నది. సహస్రాశ్వమేధ ఫలంబును, సత్యఫలంబును దలయందుంచి తూచినచో సత్యము వంకనే గౌరవం బధికమైనట్లు వలలు సూపఁగలదు. సత్యమువలన దేవర్షి పితృగణంబులు ప్రీతు లగుదురు. సత్యమే పరమధర్మంబును, బరమపదంబును, బరబ్రహ్మము నని మునులు నిర్దేశించి యున్నారు. కావున నెల్లరును సర్వదా సత్యవాదులు గావలయును. సత్యనిరతులగు మునులు దుష్కరతపస్విద్ధులై నలుదెసల నప్సరోగణంబులు పరివేష్టించియుండ దివ్యవిమానారూఢులై స్వర్గలోకంబున విహరించుచుందురు. సత్యవచనంబు సర్వోత్తమంబైనది. సత్యముకంటె శ్రేష్ఠధర్మం బేదియును లేదు. అగాధంబును, దీర్ఘస్వరూపంబును, నిర్మలంబునగుసత్యహ్రదంబునం గావించిన స్నానమే యుత్తమస్నాన మగుచున్నది. ఆత్మార్థంబైనను, బరార్థం బైనను, పుత్రార్థంబైనను మిథ్యావచనంబులు వలుకనివారు స్వర్గగాములగుదురు. వేదయజ్ఞమంత్రంబులు నిత్యంబును బ్రాహ్మణాశ్రయములై

యుండును. అట్టి బ్రాహ్మణులు సత్యవాదులు గాకున్నచో నిస్తేజు లగుదురు. కావున సత్యాచరణం బవశ్యకర్తవ్యము.

మునివరేణ్యా! సర్వకామార్థసాధకంబును, బ్రాహ్మణులకుఁ గూడ దుర్భరంబును నగుతపోధ్యాయముంగూర్చి చెప్పుచున్నాను వినుము. తపమే శ్రేష్ఠమైనది. దానివలన మహాఫలలాభం బగును. తపోనిరతులగువారు దేవతలతోఁ బ్రమోదవిహారంబులు చేయుచుందురు. తపంబువలననే స్వర్గంబును, యశంబును, ముక్తియుఁ, బరమబ్రహ్మలాభంబును గలుగును. జ్ఞానము, విజ్ఞానము, సంపత్తి, సౌభాగ్యము, సౌందర్యము మొదలగునఖిలాభీష్టంబులును దపఃప్రభావముచే సిద్ధింపఁగలవు. తపంబు సేయనివారు బ్రహ్మలోకంబును జేరఁజాలరు. ఇహాపరలోకంబులు రెంటియందును మానవునకుఁ గోరినకోరిక లన్నియును దపోబలంబున లభింపఁగలవు. సురాపానరతులును, పరదారాసక్తులును, బ్రహ్మహంతకులును, వినూత్నగాములును గూడఁ దపోబలంబుచేఁ బాపవిముక్తు లగుదురు. స్థాణుం డగుసర్వేశ్వరుండును, సనాతనుం డగువిష్ణుదేవుండును, బ్రహ్మయు, హుతాశనుండును, మహేంద్రుండును గూడఁ దపోనిష్ఠులే. ఊర్ధ్వరేతస్కులగు నెనుబదియాఱువేలమందిమునులును దపోబలంబుచేతనే స్వర్గ[illegible]బున దేవతాసహితులై సుఖభోగంబు లనుభవించుచు[illegible] [illegible]జ్యలాభం బగును. సురేశ్వరుం డగు [illegible]ప్రభావముచేతనే సకలదేవతాపరిపాలనమును, వృత్రాసుర సంహారమును గావింపఁగలిగెను. లోకహితనిరతు లగుసూర్యచంద్రనక్షత్రగ్రహంబులు తపశ్శక్తిచేతనే ప్రకాశించుచున్నవి. తపంబుచే సిద్ధింపనిసుఖం బేదియును లేదు. తపఃప్రభావముచే సకలాభీష్టంబులును లభించు నని వేదవిదు లగుమునులు చెప్పుదురు. ఫలమూలంబుల భుజించుచు వనంబున

మహాతిపంబు గావించువానికి సకలసంపదలును, సకలసుఖభోగంబులు ను సిద్ధింపఁగలవు.

సూర్యచంద్రులు లేకుండుటచే లోక మంధకారమయమైనట్లే శాస్త్రపురాణాదివిహీనం బగుజగం బజ్ఞానమయమైపోవును. నిత్య జ్ఞానమయుండును, తపోనిరతుండు నగుగురుండు జ్ఞానప్రబోధమువల నను, శాస్త్రోపదేశమువలనను శిష్యుని నిరయంబునుండి యుద్ధరించును గావున నెల్లవిధంబుల గురుండు పూజనీయుండై యున్నాఁడు. అంద ఱికంటెను బురాణజ్ఞుం డగుబ్రాహ్మణుఁడు దానపాత్రులలో నుత్త ముఁడు. అతఁడు మానవులు నరకపతితులు గాకుండఁ బురాణపఠనా దులచే నుద్ధరింపఁగలఁడు. ధనధాన్యహిరణ్యవసనాదులను సత్పాత్రు లకు దానముచేయువారి కుత్తమగతులు సిద్ధించును. గోవులు, రథ ములు, మహిషములు, గజములు, సజ్జితాశ్వములు మొదలగువాని నుత్తములకు దానముచేయువా రశ్వమేధఫలంబు గాంచఁగలరు. ఫల వంతమగుభూమిని సత్పాత్రునకు దానముచేయువారు తమవంశమునఁ బదితరములపూర్వపురుషులను, బదితరములభావిపురుషులను దరింపఁ జేయఁగలరు. వారెల్లరును దివ్యవిమానారూఢులై శివలోకగమనంబు గావింతురు. దేవతలు పురాణపఠనమువలన సంతుష్టులైనట్లు యజ్ఞాను ష్ఠానము, దేవమందిరముల నాటకాభినయము, ఉపహారనివేదనము, పూజ మొదలగువానివలన నంతసంతృప్తి నందరు. విష్ణుమందిరంబు నఁగాని, శివమందిరంబునఁ గాని, బ్రహ్మమందిరంబునఁగాని ధర్మగ్రంథ పఠనంబు గావించువాఁడు రాజసూయాశ్వమేధయాగఫలంబు నందు ను. పురాణేతిహాసపఠనాదులవలనఁ బుణ్యంబును, సకలాభీష్టసిద్ధియు నంది యంతంబున సూర్యలోకంబును భేదించి బ్రహ్మలోకంబును జేరి యందు శతకల్పంబులవఱకును సుఖభోగంబు లనుభవించి క్రి

మ్మఁట భూమండలంబున మహారాజులై జనింపఁగలరు. దేవమందిరం
బునఁ బురాణపఠనంబు చేయుటవలన సహస్రాశ్వమేధయాగఫలంబు
లభించును. భగవానుం డగుమహేశ్వరునిమందిరంబునఁ బురాణోక్తి
హాసాదులఁ బఠించుచుండవలయును. శివునకైనను, ఇతరదేవతలకై
నను బురాణపఠనముకంటెఁ బ్రీతికరం బగునది యేదియును లేదు.

## ధర్మసంహితాశ్రవణమాహాత్మ్యము.

ఇత్యర్థంబునఁ బురాణజ్ఞులగుమునులచేఁ బ్రశంసింపఁబడిన
యొకయితిహాసంబు గలదు. ఒకానొకప్పుడు బ్రహ్మపుత్రుండును, దేవ
ర్షియు నగు సనత్కుమారుండు సత్యలోకంబున కరిగి సకలలోకపితా
మహుండగు బ్రహ్మదేవుని సందర్శించి నమస్కరించి తానెఱింగిన
యొకవిచిత్రచరిత్రముం గూర్చి యిట్లు చెప్పం దొడంగెను. దేవా!
నేనొకప్పుడు ధర్మరాజును సందర్శింప నుద్దేశించి వైవస్వతనగరంబున
కుం బోయి యందు దక్షిణేశ్వరుం గాంచి భక్తిగౌరవపురస్సరంబుగ
స్తోత్రంబు చేసి యథావిధిగ నారాధించుటయు నాతండు సంతృప్తుం
డై మధురప్రియవాక్యంబులచే నన్నాదరించి యుచితపీఠంబున నాసీ
నుం గావించి కుశలప్రశ్నంబు చేయుచుండెను. నేనును సుఖాసనం
బున నుపవసించి పరమానందమున నాతనితో సంభాషించుచుంటిని.
ఇంతలో నొకయద్భుతసంఘటనము తటస్థించెను.

ఆసమయంబున నొకమహాపురుషుండు వైడూర్యమయవేదియు
తంబును, మణిముక్తాలంకృతంబును, రత్నకింకిణీజాలశోభితంబును,
గాంచననిర్మితంబు నగునొకదివ్యవిమానము నధిరోహించి యచ్చటి
కేతెంచెను. ఆపురుషునిఁ గాంచినంతనే ధర్మరాజు తనసింహాసనము
నుండి చటాలున లేచి ససంభ్రమంబుగ నెదురేఁగి యాతని దోడితె

చ్చి యుద్యానవనంబున నాసీనుం గావించి «ఓధర్మదర్శీ! నీప్రయాణము సుఖకరంబుగ జరగినదిగదా! నీదర్శనంబువలన నేనతిప్రీతుండనైతిని. నీవు కొంతకాలము సుఖంబుగ నాచెంత నుండుము. అనంతరము బ్రహ్మవాసంబునకుఁ బోయెదవుగాక!' అని చెప్పుచుండఁగనే మరల నట్టివిమానమునే యధిరోహించి యింకొకపురుషుఁ డచ్చటి కేతెంచెను. వైవస్వతుం డాతనిగూడ మొదటివానివలెనే సన్మానించి సగౌరవంబుగఁ దోడితెచ్చి పూజించి కుశలప్రశ్నంబు గావించెను.

ఇట్లు యమధర్మరాజు స్వయముగా వారినిబూజించుటంగాంచి నేను మిగుల విస్మయావిష్టహృదయుండనై యాదండధరునుద్దేశించి «మహాత్మా! నీయొద్దకు మొదట వచ్చినయాపురుషుం డెట్టిసత్కర్మంబులాచరించుటచే నీవాతనియెడలఁ బ్రసన్నుండవై యిట్లాదరించి పూజించితివి? ఈవిషయంబునువిస్తరంబుగవినవలయునని నేనుమిగులఁ గుతూహలపడుచున్నాఁడను. ధర్మరాజవగునీచే స్వయముగ నీతనిఁ బూజించుటం గాంచి దీనికిఁ గలకారణము దెలిసికొనవలయుననుకోరిక నన్ను వేగిరపెట్టుచున్నది. మఱియు నీరెండవపురుషునిగూడ నీవిట్లే యర్చించితివి. అందువలన నిమ్మహాపురుషులిరువురునుగూడఁ బుణ్యాత్ములై యుందురు. త్రిమూర్తులచేతను సర్వదా పూజితుండవగు నీవుగూడ నీయిరువురను సమానముగఁ బూజించితివి. వీరి పూర్వపుణ్యమే దీనికిఁ గారణమై యుండును. మహాత్ముండవగునీచే సన్మానితులు గాఁదగిన యీపుణ్యపురుషుల పవిత్రచరిత్రములను కర్ణరసాయనంబుగ నాకు వినిపింపవలయు»నని ప్రార్థించుటయు యముండిట్లు చెప్పం దొడంగెను.

భూమండలంబున వైదిశనామకంబగు ప్రఖ్యాతనగరంబుగలదు. సుప్రసిద్ధుం డగుధరాపాలుం డనుభూవరుం డాపట్టణమును బరిపాలిం

చుచుండెను. పూర్వమొకప్పుడు పార్వతీదేవి తనయనుచరులలో నొక్క-
నియెడలఁ గోపించి 'ఓరీ! నీవు నాయానతికి వ్యతిరేకముగ సంచరిం
చుచు నానాథునకుఁ బరకాంతాసమాగమముం గూర్చుచుంటివి.
నీవీదుష్కర్మంబునకు ఫలంబుగా ద్వాదశవర్షంబులు సృగాలంబవై
యుందువుగాక!' అని శపించెను. అభృత్యుం డప్పుడు దుఃఖితుండై
యనేకవిధంబుల నతిదీనంబుగఁ బ్రార్థించుటయుఁ గరుణాలయ యగు
నద్దేవి ప్రసన్నయై 'వేత్రవతీవితస్తానదులసంగమస్థలంబున నీకు శాపా
వసానంబు గాఁగలదు.' అని యనుగ్రహించెను.

ఆసేవకుం డాక్షణంబుననే భగవతిశాపానుసారంబుగ భూలో
కంబున జంబుకమై పుట్టి యందందు పరిభ్రమించుచు శాపమోక్షణ
కాలంబునకుఁ బూర్వోక్తం బగుపవిత్రతీర్థంబును జేరి యావశనవ్రత
దీక్షం గైకొని ప్రాణత్యాగంబు గావించి యంతలోనే దివ్యరూపముం
దాల్చి దివ్యవిమానము నధిరోహించి పురల శివలోకంబునకుం బో
యెను. ఆసమయంబున ధరాపాలుం డనురా జాక్షేత్రంబునందుండి
యాయద్భుతవ్యాపార మంతయుం గాంచి యానందనిమగ్నుండై
యాసృగాలం బట్లు వరమువడించినపవిత్రప్రదేశమునందు దేవమందిర
మును నిర్మాణంబు చేయించి యందు మహాదేవుని దివ్యలింగమును
బ్రతిష్ఠించి మఱియు సకలదేవతలను స్థాపించి విధివిధానంబునఁ బూ
జాదికంబులు చేయించుచుఁ బూజాకాలములయందు నిత్యమును
బోయి సందర్శించుచుండెను.

మఱియు నమ్మహారాజు సర్వోపకరణసంపూర్ణం బగునమ్మహా
దేవాయతనంబునఁ బురాణేతిహాసజ్ఞులగు బ్రాహ్మణులను నిరంతరమును
బూజించుచు నొక్కనాఁడు, విద్వాంసుండును, మహామునియుఁ, బు

రాజ్ఞుండును, వాచకుండు నగుపౌరాణికునిం బురాణంబుతోఁగూడ షో
డశోపచారంబులచేఁ బూజించి వినయావనతుండై మధురప్రియభాష
ణంబులతోఁ 'ఓబ్రాహ్మణోత్తమా! ఈదివ్యస్థలంబున నేనీశివాలయం
బును బ్రతిష్ఠించి యుంటిని. ఇందు బ్రాహ్మణాదిచతుర్వర్ణంబులవా
రును బురాణశ్రవణంబునకుఁ గుతూహలపడుచున్నారు. నీవు నూఱు
నిష్కంబులయుత్తమవృత్తిని గ్రహించి యొకవత్సరంబువఱకును బు
రాణపఠనంబు గావింపవలయును. పిమ్మట నాత్మశ్రేయంబుకొఱకు
నీకింకను ధనదానంబు గావింపఁగలను.' అని ప్రార్థించెను. ఆబ్రా
హ్మణుం డందులకు సంప్రీతుండై యాదేవాలయంబున కరుదెంచిన
వారందఱికిని బురాణశ్రవణభాగ్యమును గల్పించుచుండెను.

ఈవిధముగా నాలుమాసములు గడచెను. ఆయుర్నిశ్శేషం బగు
టయు ధరాపాలుండు కాలధర్మము నొందెను. అతని దనలోకంబున
కుఁ జేర్చుకొనుటకై మహాదేవుం డీదివ్యవిమానమును నాచెంతకుఁ
బంపించెను. దీనిని నేనీతనికిఁ బంపితిని. పుణ్యాఖ్యానశ్రవణం బనుసత్క
ర్మంబువలన నీతని కిట్టిఫలంబు లభించినది. దేవతలు గంధపుష్పబలి
హిరణ్యవస్త్రగ్రామనగరాదిదానంబులఁ గావించుటకంటెఁ బురాణశ్ర
వణంబు గావించుటవలననే యధికసంప్రీతు లగుదురు. ఓమునిసత్త
మా! పురాణేతిహాసశ్రవణంబువలన నేనెట్లు ప్రీతుండ నగుదునో
యట్టిప్రీతి సర్వకామికంబు లగుశ్రాద్ధాదులచేఁగూడ నాకుఁ గలుగ
నేరదు. కన్యాశ్రాద్ధము నాకతిప్రియమైనది. అయినను దానియందుఁ
గూడఁ బురాణశ్రవణమువలనం గలుగునంతటియధికప్రీతి యుదయిం
పదు. వేయిమాటలేల? పురాణశ్రవణంబుకంటె నాకధికప్రియం
బగునది యేదియును లేదు.

తరువాత వచ్చిన యీరెండవపురుషుఁడుగూడ నాపట్టణము

నందే నివసించుచుండెను. ఈతఁ డొకనాఁడు సత్సంసర్గవశంబున నొక శివాలయంబునకుం బోయి భక్తిశ్రద్ధలతోఁ బురాణపఠనంబు నాకర్ణించి మహాత్ముం డగుపౌరాణికునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి యొకస్వర్ణమాషము నాతనికి దానంబు గావించెను. లోభవశంబున నీతఁడు తనజీవితమునం దింతకంటె హెచ్చు యేయితరదానమును జేసి యుండలేదు. సత్పాత్రమునందు నివేదించిన యాస్వల్పదానఫలంబు వలననే యీతనికి బ్రహ్మలోకావాసము సిద్ధించినది. ఈతఁడా పౌరాణికుని సన్మానించి సత్కరించుటకంటె నితరసుకృతంబు లేవియును జేసినవాఁడు గాఁడు. ఆసత్కర్మఫలంబువలననే యీతఁడు నాకుఁగూడఁ బూజాపాత్రుం డయ్యెను. శ్రద్ధాభక్తులతోఁ బౌరాణికులఁ బూజించువారికి సన్మును, బ్రహ్మవిష్ణుమహేశ్వరులను నారాధించినఫలంబు లభింపఁగలదు. శ్రాద్ధకాలంబులయందు భక్ష్యభోజ్యంబులచేఁ బురాణవాచకుని సంతృప్తుం గావించుటవలన దేవమానముచే నైదువత్సరములు నన్నారాధించిన పుణ్యము సిద్ధించును. పౌరాణికునకు భోజనంబు వెట్టి ధనసత్కారంబు చేయువారియెడల రెండువందలవత్సరంబులవఱకు సకలదేవతలును బ్రీతులై యుందురు. పౌరాణికుఁడు త్రిమూర్తులయు, సకలదేవతలయు సత్యతత్త్వమును బోధించి మానవుల కాస్తిక్యబుద్ధిని జేకూర్చుచుండును. కావున నాతనిఁ బ్రీతుం గావించినచో సకలదేవతలును సంతృప్తు లగుదురు. ధర్మమును సాధించుకొఱకే త్రిమూర్తులను సూర్యచంద్రాదిగ్రహంబులను బూజించుచుందురు. స్నానము, పూజ, జపము, హోమము, వేదాధ్యయనము శౌచము, అహింసావ్రతము, ఉపవాసము, ధైర్యము, మౌనము, ఇంద్రియనిగ్రహము, శాస్త్రజ్ఞానము, ఆత్మజ్ఞానము, సత్యము, అక్రోధము, దానము, క్షమ, దయ, దమము, వాపీకూపతటాకదేవప్రాసా

దాదినిర్మాణము, కృఛ్రము, చాంద్రాయణము, యజ్ఞము, తీర్థసేవ
నము, వానప్రస్థాద్యాశ్రమస్వీకారము మొదలగు సత్కర్మంబు లన్ని
యును ధర్మసాధనంబులకొఱకే యని మహాత్ములు చెప్పుదురు. ధర్మ
మువలననే యర్థకామమోక్షంబులును, ఇహపరలోకంబులయందు సక
లసుఖంబులును లభింపఁగలవు. పాపకర్మంబులవలనఁ గేవలదుఃఖ
ప్రాప్తియే యగుచుండును. కావున సుఖము ధర్మమయము. అట్టి
ధర్మము సాత్త్వికము, రాజసము, తామసము నని త్రివిధంబుల విరా
జిల్లుచుండును. సిద్ధమునిగణంబుల నిష్కాముకం బగుతపము సాత్త్విక
ధర్మము. ఫలోద్దిష్టం బగు దేవతాదుల సత్కర్మము రాజసధర్మము.
హింసాధికంబు లగుసత్ఫలంబుల నుద్దేశించి దానవాదులు గావించు
తపము తామసధర్మము. ఓమునిపుంగవా! నీకిప్పుడు సకలకర్మంబు
లనుగూర్చియు సంక్షేపముగ నెఱింగించితిని. సత్ఫలోద్దేశముచేఁ
బూర్వోక్తం బగు పౌరాణికపూజనంబును, బురాణశ్రవణంబును
గావించువారికి నెట్టితపంబును చేయనక్కఱలేదు. అని యమధర్మ
రాజు నన్నుఁగూర్చి ప్రబోధించెను.

ఓదేవదేవా! వనజాసనా! నేనాయిరువురుమహాపురుషులచరిత్ర
మును ధర్మరాజువలన విని యటనుండియే నీసమ్ముఖంబున కేతెంచితి
ని. ఆవైవస్వతుండు దెలిపినధర్మమునందలి సత్యాసత్యములను నీవే
నిర్దేశింపవలయును. ఆవిషయంబును నీవలనఁగూడఁ దెలిసికొనవల
యు నని కుతూహల పడుచున్నాను. అని సనత్కుమారుండు ప్రార్థిం
చుటయుఁ జతుర్ముఖుం డిట్లని యానతియ్యందొడంగెను.

వత్సా! నీవుసందర్శించిన యాయిరువురునుగూడఁ బుణ్యపురు
షులు. వారిదర్శనము లభించుటవలన నీవుకూడ ననమానపుణ్యాత్ముం

డ వైతివి. ఎల్లవిషయంబులయందును బ్రత్యక్షదర్శియగు ధర్మరాజు
చెప్పినవచనంబులు సత్యము లైనవి. ఆతనిభాషణంబు లెన్నఁటికి నస
త్యంబులు గానేరవు. లోకపూజితం బగునాపంచమముఖంబునుండి
పురాణములు బహిర్గతంబులై నలుదెసలను బరివ్యాప్తంబు లైనవి.
చతుర్వేదములును, వేదాంగములునుగూడఁ బురాణంబులవలె నాకం
తటిప్రియంబులు గావు. ఎల్లరును భక్తిశ్రద్ధలతోఁ బౌరాణికునకు
వృత్తిదానంబు గల్పింపవలయును. పురాణశ్రవణంబు చేయువారికిఁ
బరమగతిలాభం బగును. పురాణేతిహాసంబులు ధర్మార్థకామమోక్ష
ఫలంబులను విస్పష్టముగ నిర్దేశింపఁగలవు. వానిమూలముననే వేద
మును విస్తరింపఁజేయవలయును. వేదార్థమును సంపూర్ణముగ విస్తరిం
పఁజేయఁజాలని యల్పజ్ఞుఁడగు పౌరాణికునిం గాంచి ప్రహారభయం
బున వేదములు సంకుచితము లగుచుండును. వేదములు గూఢార్థయు
తంబు లగుటచేఁ దదర్థబోధకంబుగా నేనీపురాణములను సృష్టించి
తిని. పురాణపఠనంబును, భక్తితోఁ బురాణశ్రవణంబును బరమపద
కారణంబులు. పౌరాణికునకు దక్షిణాదానంబు చేయుటవలనఁ బరమ
బ్రహ్మప్రాప్తి యగును. సత్పాత్రదానమువలన నిట్టిమహాఫలంబు
సిద్ధించుననుటలో నాశ్చర్య మేమున్నది? తీర్థంబులలోఁ గేదారంబును
వ్రతంబులలో మహావ్రతంబును, పర్వతంబులలో మేరువును, పక్షు
లలో గరుడుండును, నదులలో గంగయు, దేవతలలో మహాదేవుం
డును బోలె సత్పాత్రులందఱిలోను బౌరాణికుఁడు శ్రేష్ఠుం డగుచు
న్నాఁడు. కావునఁ బురాణవాచకుని భక్తిపూర్వకంబుగఁ బూజించు
వాఁడువిశ్వము నంతను బూజించినవాఁ డగుచున్నాఁడు.

అని బ్రహ్మదేవుండు ప్రబోధించుటయు సనత్కుమారుండు
“ ఆహా! పురాణశ్రవణముం గావించువాఁడే ధన్యుఁడు! పౌరా

ఈశునిబూజించి శక్తికొలఁది దానంబు చేయు సత్కర్ముఁడే పుణ్యపురుషుఁడు!' అని ప్రశంసించెను. పద్మసంభవుండును నాతనివచనంబుల నంగీకరించి ప్రతిదినంబును దేవదేవుండగుశంకరునిమందిరంబునఁ బురాణశ్రవణంబు సేయించువాఁడును బరమపదప్రాప్తుం డగు నని యానతిచ్చెను.



# వర్ణనరత్నాకరము

